# కవిత్వతత్త్వ విచారము

అను

పింగళి సూరనార్యకృత కళాపూర్ణోదయ ప్రభావతీ
ప్రద్యుమ్నముల విమర్శనము

కట్టమంచి రామలింగారెడ్డి
ప్రణీతము




1980

# అంకితము

నా

చిన్నతనమునుండియు

నన్ను

ఆంధ్రమున శక్తికొలఁది శిక్షితునిం జేసిన

గురుండును

"భారతసారరత్నావళి" "భాగవతసారముక్తావళి"

యను గ్రంథముల

విరచించిన సరసుండును

అగు

నా

తండ్రి, కీర్తిశేషుఁడు

కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డి యొక్క

దివ్యచరణమ్ములకు

భక్తి ప్రీతుఁడనై

ఈ గ్రంథమును సమర్పించుచున్నాఁడను

# అవతారిక

ఈ గ్రంథముయొక్క చరిత్రము గొంతవఱకుఁ జిత్రము. తొలుత 1899 వ సంవత్సరములో, నేను చెన్నపురి క్రైస్తవ కళాశాలయందు విద్యార్థిగా నున్నప్పుడు, కళాపూర్ణోదయ పఠనోత్సాహోత్కర్షంబునం జేసి సూరనార్యుని యెడఁ గృతజ్ఞతయు, ఋణమునుండి విముక్తియు, సాధ్యమైనంతవఱకు బడయంగోరి యాత్మతృప్తికై యొక యుపన్యాసము వ్రాసితి. అది మొట్టమొదట బహిరంగపఱుపఁబడిన రంగము. ఆ కాలేజికిం జేరిన "యాంధ్ర భాషాభిరంజనీ" సమాజము. దీని నత్యంతముగాఁ బొగడిన వారిలో నొకఁడు సహపాఠియుఁ బరమ మిత్రుండు నగు మొంద్రేటి బాపనయ్య. అతని వాసస్థలము రాజమహేంద్రవరము. ఆ సుకుమారచిత్తుని ప్రోత్సాహము నాహ్వానముఁ గారణముగ రాజమహేంద్రవరమునకుఁ బోయి యచ్చట నప్పుడు ప్రముఖముగా నుండిన "విద్యాభివర్ధనీ" సమాజమువారి యాశ్రయమున నడుపఁబడిన గొప్పసభలో నావ్యాసమును మిక్కిలి జంకుతోఁ జదివితి. అక్కడఁ దటస్థించిన వాదములం జర్చలంబట్టి చూడఁగా, నా కాలమునఁ గళాపూర్ణోదయము మంచి ప్రస[illegible]కి వచ్చియుండలేదని తోఁచినది. తెనుఁగున నవల లనఁబడు కథలఁ గల్పించుటలో నద్భుత ప్రతిభులగు శ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహముగారు ఉదారులగుట గొంచెమును బెద్దగా గణించి యామోదసూచకముగఁ దమ కృతుల నాకు సమ్మానముగా నిచ్చిరి. బాలుండనగు నాకు నట్టివారి యంగీకార మెంతటి యౌత్సుక్యము నొసంగెనో మీరే యోజింపుఁడు. భాషాకృషిక ప్రోత్సాహకములలో వారి సంభావన ప్రథమగణ్యము. పిమ్మట నా వ్యాసము మఱిరెండు స్థలముల నివేదించితిని. అందొక దాన నగ్రాసన మలంకరించిన కవీశ్వరులు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులుగారు. నేను అత్యుక్తిదోషము పాలైతినని మృదువచనములతో మనము నొవ్వని విధంబునఁ గొన్ని స్ఖాలిత్యములం జూపి నన్నుం గృతార్థునింజేసి నాకు నెప్పటికంటె నెక్కువగ వందనీయులైరి. నెల్లూరులో నివసించు శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యంగారు నా వ్యాసముంగూర్చి ప్రశంసించుచుఁ బద్యము నొకండు వ్రాసి పంపిరి. తరువాత 1902 వ సంవత్సరమున విద్యార్థినై గవర్నమెంటువారొసంగిన బహుమాన వేతనము సహాయముగ నింగ్లాండునకుం బోయితిని. విదేశములయందును గళాపూర్ణోదయము మఱి మఱిం

జూచుచుంటినిగాని వదలలేదు. వదలఁగాదుగాన. మరల స్వదేశము నకు వచ్చుటకు సుమారు 5 సంవత్సరములు పట్టెను. వచ్చి యుండిన కొంచెము తెనుగన్నను సగానికి సగము అంతర్ధాన మైనందునఁ జింతాక్రాంతుఁడనై, యే ప్రాచుర్యములు నాకేలయని యుండఁగా, ప్రస్తావవశమున నా యుపన్యాసము సంగతి వినిన అస్మత్పితృసఖుని పుత్రుఁడు వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి దానిం బ్రకటింపగోరి తనకిమ్మని యడుగఁగా నెట్టకేలకు సమ్మతించితి. ఇంటికి వచ్చి యెక్కడ వెదకినను నా కా విమర్శనము లభించినది గాదు. దానిగతి యేమాయెనో దేవునికే యెరుక. నూతన ప్రారంభములు నావంటి యన్యకార్యమగ్నునకు దుర్ఘటములు. కాలము నిలువదు. పోవును. తరుణము సులభముకాదు. తనంతట రాదు. ఇట్లు కొన్నియేండ్లు చెల్లఁగా నేది యెట్లున్నను వ్రాయకపోరాదని పునఃపఠనమునకుం దొడంగుతఱికి నా యభిప్రాయము లనేకములు నాకుఁ దెలియకయ ఈమధ్యమునఁ బలుదెఱంగుల మార్పులం గాంచియుండుట వ్యక్తమయ్యెను. దానిచే నుపన్యాసమునకు మాఱుగ నీ విపులగ్రంథము వ్రాయుటయుఁ గ్రొత్తపేరిడుటయు ననివార్యము లాయెను.

ఒంటిగా నే సమర్థించి యుండఁజాలను. నాకుం దోడుగ మైసూరు మహారాజుగారి కాలేజియం దాంధ్రపండితులగు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు నిలిచినందునఁ గార్యము నెఱవేఱెఁ గాని లేకున్న నైయుండుట సందిగ్ధము. ఇంత త్వరలో నైయుండుట యసంభవము.

తొలుతటి యుపన్యాసము వాసన యిందు నింకను నుండుట చదువరు లెఱుంగుదురు. కళాపూర్ణోదయముతోడ ప్రభావతీ ప్రద్యుమ్నమును ఆక్రమింపవలసివచ్చె. దృష్టి యొక కావ్యమునుండి యింకొక దానిపైఁ బ్రసరించియుండుట స్పష్టము. సహజవ్యాప్తినేల నిరోధింపవలయునని దాని ప్రకృతి కనర్గళసంచార మొసంగితి. గ్రంథవైపుల్యముంగూర్చి మీ క్షమాపణ వేఁడెద.

ఈకార్యమునకుఁ దొలుత నత్యంత ప్రోత్సాహకుఁడైన మన్మిత్రుఁడు మొంగ్రేటి బాపనయ్య కీర్తిశేషుఁడగుటచే దీనిం జూచి నాపైఁ బ్రేమచేనైన సంతసింప లేమికిఁ జింతిలుచున్నాఁడ! చిరసమీక్షచే గార్యములు నిష్ఫలము లగునుగదా! కావున నీచింత దురదృష్టము గాదు. నా నేరమునకు నైనదండన.

ఇట్లు, తమ విధేయుఁడు

కట్టమంచి రామలింగారెడ్డి

# చదువరులకు విజ్ఞాపనము

క. నాతండ్రి, సుగుణమణిఖని
శ్రోత్రియుఁ డురువైభవుండు, సుబ్రహ్మణ్యుం
డాతతగతి నాటిన వి
ద్యాతతులఫలంబు మీకు నభివేదింతున్. 1

మ. గుణమీవ్యాసమునందుఁ గొంచియము ; సాంగోపాంగ పూర్ణంబుగా
ఘనమైనట్టి కవిత్వవిద్య నెఱుఁగంగా నాకు శక్యంబె? యో
జనమైమీరు విచారణ ల్సలిపి, సంస్కారంబులంజూపి, భా
షను బెంపింకను మీఱఁదేర్తు రను విశ్వాసంబునన్ వ్రాసితిన్. 2

ఉ. ఇంతియ కాని, నిర్ణయము లేర్పడుపంగ నెవండఁ? గార్యదే
శాంతరగామినౌట మునుపట్లటు వచ్చిన కొంత యాంధ్యముం
జింత ఘటిల్లఁజేయు పరిశీలత నెన్నఁడొచెందెఁ గాన సి
ద్ధాంతములేల నాకు? దయతప్పక మీరలు చాలుఁజూచినన్. 3

క. పరిపరి విధములఁ బరిపరి
నరు లారాధింప, యౌవన మనశ్వరమై
పరగంగ నిత్యనవ్య
స్ఫురణమ్మునఁ బేర్చు కవిత సాం పేమందున్. 4

ఉ. కారణజన్ముఁడై, జననికాయము మెచ్చఁగ భారతంబు నా
నా రుచిరార్థయుక్తముగ, నవ్యత శాశ్వతమై తనర్చ, వి
స్ఫార వచోధురీణతఁ, బ్రశస్తగతిం దెనిఁగించె నెవ్వఁ డా
సూరిని నాంధ్రలోక పరిశుద్ధ తపఃపరిపాక రూపునిన్. 5

క. కవితా ప్రపంచ రవిఁ, ది
క్కవరేణ్యుం గొలిచి, యతని కడిఁది యశఃకాం
తివలన వ్యక్తములయిన
ట్టి విశేషంబులను గొన్నిటిని బ్రకటింతున్. 6

# విషయసూచిక

## ప్రథమ భాగము

### మొదటిప్రకరణము



### రెండవప్రకరణము



### మూడవప్రకరణము

## ద్వితీయ భాగము



## తృతీయ భాగము

# పీఠిక

ఈ కవిత్వతత్త్వవిచార మాంధ్రలోకమునకుఁ జిరపరిచితము గాని క్రొత్తది కాదు. ఆంగ్లవాఙ్మయకోవిదులును సుప్రసిద్ధులునగు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి యాంధ్రసాహిత్యసారజ్ఞతకు ఫలముగా, క్రీ.శ. 1899లో, వ్యాసరూపమున నవతరించి సభల మెప్పువడసి 1914లో, వికసించి ప్రకాసించిన యీ కళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యుమ్న విమర్శనమందలి విషయ మింతకుమున్నె భాషాభిమానులు చక్కఁగా నెఱిఁగియున్నను, శ్రీ రెడ్డిగా రుపాధ్యక్షులుగా నున్నతఱి దీని నాంధ్రవిశ్వకళాపరిషత్తునకు సమర్పించి యుండుటచేఁ బరిషద్వశమున నీ చిన్నపీఠిక వ్రాయవలసివచ్చినది కాని, నిజముగా నిది సిద్ధకథనమే.

పట్టుపట్టి చదువుకొని పండితుఁడైనఁ గావచ్చునుగాని కవి యగుట కష్టము. ఎట్లో శ్రమపడి భాషాంతరీకరించియో యనుకరించియో కవియైనఁ గావచ్చునుగాని విమర్శకుఁడగుట యంత కంటెఁ గష్టము. లోకజ్ఞుఁడై మృదుమధురభాషలో నొక చక్కని భావమిముడ్చునట్టి కవిదృష్టి యేకాగ్రమైనచో నతని కవిత్వము సరసమై పండిత పామర రంజకమగునుగాని లోకజ్ఞుఁడును బహు కవిభావజ్ఞుఁడునై యా కవిత్వమందలి మంచినో చెడ్డనో తెలుపఁ బూను విమర్శకుని దృష్టి సర్వతోముఖమైనఁ గాని యతని విమర్శనము సహృదయరంజకము కానేరదు. కావుననే కవిత్వముకంటె విమర్శనము కష్టతరమనుట. ఇట్లే శాస్త్ర రచనముకంటె శాస్త్ర విమర్శనమును గష్టతరమగును.

సంస్కృతమందు శబరస్వామి శంకరాచార్యాది భాష్యకర్తలు స్వమతస్థాపనమునకై వివిధ శాస్త్రమతము లాకర్షించి కావించిన వివిధ విమర్శనములును, ఔచిత్యవిచారచర్చా కావ్యప్రకాశరస గంగాధరాదిలక్షణ గ్రంథములందు క్షేమేంద్రమమ్మటభట్ట జగన్నాథ పండితరాజాదులు బహుగతులఁ గావించిన కథా రస పాత్రాది విమర్శనములును, విద్వజ్జనరంజకములై వెలయుచున్నను, వారి వారి మతాభిమాన పాండిత్యవిశేషాదులను బట్టి వాని త్రోవలు వేఱుగాఁ గనఁబడుటచే విమర్శనమున కొక నిర్దిష్టమైన పద్ధతి లేదనియు, అట్లుండుట సాధ్యముకూడఁ గాదనియుఁ దెలియ వచ్చును. కావున విమర్శనము విమర్శకుని చిత్తవృత్తి ననుసరించి

యుండుననుట స్పష్టము. అయినను, గుణము గుణముగాను దోషము దోషముగాను వర్ణించుట యుత్తమపద్ధతియనియు, గుణము మాత్రము ప్రకటించి దోషము గప్పిపుచ్చుట మధ్యమ పద్ధతి యనియు, దోషము మాత్రము విశదీకరించి గుణము మఱుఁగు పఱుచుట యధమ పద్ధతి యనియు, గుణమును దోషముఁగానో దోషమును గుణముఁగానో వెల్లడించుట యధమాధమ పద్ధతి యనియు లోకజ్ఞులు చెప్పుదురు. కొంతకాలమునుండి, తెలుగులో విమర్శనము లేదను లోపము తీర్చుటకోయన పోఁకకు పుట్టెఁ డన్నట్లు వెడలుచున్న విమర్శనములలోఁ గొన్ని కడపటి మూఁడు పద్ధతుల కుదాహరణముగా నున్నవని ప్రాజ్ఞలోకము తలంచు చున్నది. విమర్శకుఁడు సహృదయుఁడు గానిచో భాష కిట్టి యనర్థము లుత్పత్తిల్లునుగదా! ఇందుకుఁ గొన్ని పత్రికలుగూడ సహకారు లగుచున్నవని చెప్పవలసి వచ్చుట విచారకరమగు చున్నది.

రజోఽనన్తరవివాహము విమర్శనీయమైనపుడు స్మృతిసూత్ర మునందలి విధినిషేధవాక్యములను బరిశీలించి, సమ్మతమనియో, అసమ్మతమనియో, ఆపత్కాల విహితమనియో, యేదో యొకటి విస్పష్టముగా నిర్ణయింపవలసి యుండునుగాని, అది సర్వథా సమ్మతమని సప్రమాణముగా నిరూపించి యే కారణముననో యసమ్మతమని మరల విమర్శించినచో నట్టి విమర్శనము లెం దయిన గణనీయము లగునా? అట్లే యొక భాషావిషయమును విమర్శించునపు డిది సంప్రదాయవిహితమని యొకమాఱును, ఇది సంప్రదాయ విరుద్ధమని యింకొకసారియుఁ జెప్పినచో నట్టి యభి ప్రాయముల కెందయిన విలువయుండునా? విమర్శకుఁడు కొంత కాలమునకుఁ బూర్వాభిప్రాయము మార్చుకొనవచ్చునుగాని, ఆ మార్పు సప్రమాణమైనపుడే యుచితమగునుగాని యస్థిరచిత్తతతో నసూయతోఁ గావించినదైనచో విద్వల్లోకము సమ్మతిగాంచఁజాలదు. కావున నేదేని యొక విషయము విమర్శించుటకు ముందుగా నర్హత సంపాదింపవలెను. అది లేక విమర్శింపఁబూనుట యందని మ్రానిపండ్లకు జేతులు చాచుటయే. కాని—

మొదటి యుత్తమపద్ధతి నవలంబించిన సద్విమర్శనములు గూడఁ గొన్ని యాంధ్రమున లేకపోలేదు. అందు శ్రీ రామలింగారెడ్డి గారి కళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యుమ్న విమర్శన మొకటి. భారతము, ఉత్తరహరివంశము, మనుచరిత్ర, ఆముక్తమాల్యద మొదలగు గ్రంథములను, నన్నయ తిక్కన శ్రీ నాథాది కవులను

గొందఱు గొన్నివిధముల విమర్శించిరి. కాని, వారి పద్ధతులకును రెడ్డిగారి పద్ధతికిని సూక్ష్మదృష్టితోఁ బరిశీలించినవారికి భేదము గోచరింపకపోదు. ఇది యాంగ్లపద్ధతి ననుసరించినదయినను, ఆంధ్రమున నవీనము స్వతంత్రము. ఎంతటి విమర్శనమైనను బునర్విమర్శనార్హ మగుచున్నదనుట యనుభవసిద్ధ మగుటచే లోకో భిన్నరుచి యన్నట్లు కొందఱి విమర్శనములోని కొన్ని విషయము లందు భిన్నాభిప్రాయములు చూపుచున్నారని చెప్పవలసివచ్చినను, ఇంతమాత్రమున విమర్శనపద్ధతి కాక్షేపము రాఁజాలదు.

ఆంధ్రభారత నిరంతర పఠనాయత్తచిత్తులును విమర్శన విజ్ఞాన సంపన్నులు నగు శ్రీ రెడ్డిగారు పింగళి సూరనార్యుని కవిత్వ మందలి యాదరాతిశయమునఁ గళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యు మ్నములు పెక్కుసార్లు చదివి యతని కథాకల్పనా కవిత్వ చాతుర్యములకు మెచ్చి యందలి విశేషము లాంధ్రలోకమున కెఱింగింపఁబూని ముందుగా నుపోద్ఘాతముగా నాంధ్రకవితాస్వరూ పమును మొదటి ప్రకరణమున వర్ణించియున్నారు. స్వతంత్రకవుల పద్ధతులవలెనే స్వతంత్రవిమర్శకుల పోకడలును, అపూర్వములుగా నుండుననుట కుదాహరణముగా నిందు విశదీకరింపఁబడిన భావనా శక్తి భావము పాత్రములు జీవకళ మొదలగు విశేష విషయములతో భారత కవుల ప్రతిభను, అందును విశేషించి తిక్కనార్యుని మహత్త్వమును గన్నులకుఁ గట్టినట్లు ప్రత్యక్షము గావించిన శ్రీ రెడ్డి గారి యాంధ్రాంగ్ల సాహిత్య విమర్శన విజ్ఞానమున కీ ప్రకరణ మాకరముగా నున్నది. రెండవ ప్రకరణ మంతయు బ్రబంధలక్ష ణాది విమర్శనముతో నిండినది. ఈ రెండు ప్రకరణములలోని భావనాశక్తి వర్ణనాలంకార ప్రబంధకథాది విషయ విమర్శనము లందలి కొన్ని భావములును, కొన్ని వాక్యములును, ప్రాచ్య పాశ్చాత్యసాహిత్య వాసనాభేదములనుబట్టి వారివారికి వేఱువేఱుగాఁ గనఁబడుటయు, ఆ విషయములను మఱి కొందఱు వేఱుగా విమర్శించి సమర్థింపఁగలుగుటయు, సత్యమేకాని, శ్రీ రెడ్డిగా రాశ్రయించిన ప్రధానోద్దేశముతోడి విమర్శనపద్ధతి కవి యిందు నెరిపడుచునే యున్నవి.

ఈ గ్రంథమునకు జీవనప్రాయములై పరిమాణమందును గుణమందును నుత్కృష్టములైనవి తరువాతి రెండుప్రకరణములు. ప్రభావతీ ప్రద్యుమ్న కథాసంవిధానమందును, మూఁడుమార్లు చదివినఁగాని యర్థముగాక మిక్కిలి గజిబిజిగానున్న కళాపూర్ణోదయ కథానిర్మాణమందును గల యెల్ల మర్మములను సూరనార్యుని నిజ

జీవితముతో నివి కరతలామలకము గావించుచున్నవి. అందుచే రెడ్డిగారి విమర్శన స్వరూపమంతయు నీ ప్రకరణ ద్వయ దర్పణమునఁ జక్కఁగాఁ బ్రతిఫలించుచున్నదని చెప్పవచ్చును.

రసములలో నెల్ల శృంగారము మిన్నయై సంస్కృతలక్షణ గ్రంథములం దెక్కువ భాగమాక్రమించి యున్నది. అట్టి ప్రధాన రసమును సూరనార్యుఁ డైదువిధములుగా వర్ణించుటను జూపి, యందు నాలుగు విధముల శృంగార మతిమనోహరముగాఁ గళాపూర్ణోదయమున నెట్లు కనవచ్చుచున్నదో యీ విమర్శనము దెల్పుచున్నది. స్త్రీపాత్ర పోషణౌచిత్యమునకు లక్ష్యముగా నిది కలభాషిణీ పాత్రమును బహుభంగుల వివరించుచున్నది. సుగాత్రీశాలీనుల కథయందలి చమత్కృతి నిది యరఁటిపండొలిచి చేత బెట్టినట్లు చూపుచున్నది. పెక్కేల సూరనార్యుని రెండు ప్రబంధములం గల ముఖ్యాంశములనెల్ల నిదియుక్తియుక్తముగా ననుభవసిద్ధముగా విమర్శించి నిష్పక్షపాత విమర్శనమునకు దారిచూపుచున్నదనుటకంటె దీనిని గూర్చి యిందధికముగా వ్రాయుట యనావశ్యకము.

కడపటిప్రకరణమం దసహ్యశృంగారము, కళాపూర్ణోదయము కడపటి కథ, అందలి యనౌచిత్యము మొదలగు విషయములు పరిశీలింపఁబడినవి. సుగాత్రీ కలభాషిణీ పాత్రపోషణమునకును మధురలాలసా పాత్రపోషణమునకును గల భేదమును జూపి యందలి యౌచితిని, యందలి యనౌచిత్యమును విశదీకరించుటయె విమర్శకులు సూరనార్యు నెంత గౌరవబుద్ధితోఁ జూచినను, అతని రచనయందలి గుణదోషములను నిష్పక్షపాతముగాఁ జూపిరనుటకుఁ దార్కాణమగుచున్నది. మఱియు—

అసహ్యతుచ్ఛ శృంగారముల స్వరూప మిట్టిదియని చూపుచు ఉత్తమ శృంగారమునకు, గవిత్రయమువారి పద్యముల నుదాహరించిన రెడ్డిగారు, ప్రబంధకవులు కొందఱు గతానుగతికముగా శృంగారరస మర్యాద నతిక్రమించిపోవుటను సూచించుటయేగాక, ఉత్తమకవుల వర్ణనలను బట్టియు లోకానుభవమును బట్టియు శృంగారవర్ణన మిట్లున్న హృదయంగమముగా నుండునన్న కవితాధర్మమునుగూడ నుపదేశించిన వారైరి.

రెడ్డిగారు విమర్శనతత్త్వవిజ్ఞాన మందారితేఱినవారగుటచే నీవిమర్శనము నతిసమర్థతతో నిర్వహించిరని నాయాశయము. ఆంధ్రదేశమునఁ జక్కఁగ వ్యాపించియున్న యట్టి యీ గ్రంథమందలి విషయమును విద్వల్లోకమును విద్యార్థి బృందమును

[illegible] యిందలి యొక్కొక్క యంశమును వర్ణించుచుఁ బీఠికగా నాలుగు మాటలతోఁ జెప్పవలసినది గాదు.

ఆంధ్రవిశ్వకళాపరిషత్ప్రథమోపాధ్యక్షులగు శ్రీ రామలింగారెడ్డిగారు పరిషదుపాయనముగా సమర్పించిన యీ విమర్శన గ్రంథమాంధ్రవిశ్వకళాపరిషత్ప్రకటితమై చిరకాల మాంధ్రలోకమును రంజింపఁ జేయుఁగాక.

ఆంధ్రవిశ్వకళా<br>పరిషత్కళాశాల<br>22-6-1932

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

శ్రీ

# కవిత్వతత్త్వ విచారము

## ప్రథమ భాగము

### మొదటిప్రకరణము

కళాపూర్ణోదయమును రచించిన మహాకవి పింగళి సూరన్న. ఇతని జీవితముంగూర్చి శ్రీ కందుకూరి వీరేశలింగముగారి సుప్రసిద్ధమైన కవులచరిత్రలో వ్రాయఁబడిన దానికన్న నాకెక్కువ దెలియదు. మఱి దెలిసికొనుటకు నుద్యమించిన వాఁడనుగాను. నాప్రధానోద్దేశ్యము కృతి విమర్శనగాని చరిత్ర శోధనంబుగాదు. నాయీ కార్యమునకుం బ్రయోజకంబులైన యీతని జీవితాంశములు రెండు. శ్రీకృష్ణదేవరాయల కాలమునకుఁ దరువాతివాఁడనుటయు, ప్రాయశః రామరాజ భూషణకవికిఁ బూర్వికుఁడనుటయు, మఱియు నింగ్లాండుదేశములోని కవులలో నగ్రగణ్యుండైన షేక్స్పియరునకు నితఁడు సమకాలీనుఁడై యునికియు సుసాధ్యము.

#### ఆదికవుల గుణదోషములు

ఆకాలంబున నాంధ్రదేశమునఁ బ్రబలముగానుండిన కవితారీతి ప్రబంధరచన, ప్రబంధకవులకే మధ్య కవులనియుఁ బేరు గలదు. ఆదికవులయు వీరియు జాడలువేఱు. అనేక విషయముల విరుద్ధములును.

నన్నయాదులు సందర్భానుగుణములగు వర్ణనలందక్క నితర విధముల నూతన కల్పనలకుం దొడంగక సంస్కృతమున నుండు కథాదిక విషయములం దెనిగించుటలోఁ దమ శక్తిని ముఖ్యముగ వినియోగించిరి; అనగా, నీకవులు మొత్తముమీద భాషాంతరీ కర్తలేకాని యపూర్వ సృష్టిక్రియా నిపుణులుగారు. ఇట్లనుటచే వీరిపై దోషారోపణము జేయుచున్నానని నాపైఁ గినియకుఁడు! వీరికి ప్రతిభయు భావనాశక్తియు నమేయములు. అవి ప్రకాశమునకు వచ్చిన మార్గము లెవ్వియనగా:

1. తాము వ్రాసిన కృతులు భాషాంతరీకరణములయ్యును స్వకపోలకల్పితములగు కావ్యములం బలె నెడతెగని యేకధారగా బ్రవహించునట్లు రచించుట.

2. మాతృకలలోనుండు నసమంజసములు నప్రయోజన ములునైన భాగములను బ్రక్షిప్తములనో సంక్షిప్తములనో చేసి కవితారసము పలుచనగాకుండునట్లు సాంద్రంబుగ సమర్థించుట ఇందుకుఁ బ్రశస్తమైన నిదర్శనము మనభారతము, సంస్కృత మున నానాజనులు నానావిధములఁ దూర్చియున్న వెఱ్ఱివెఱ్ఱి వేదాంతములు ధర్మాధర్మములు మొదలగు నసంబద్ధచర్చలతో నిండి చూచువారికి దిక్కులు తెలియనట్లు విపులముగఁ బెరిగి చీఁకుపొదవలె నుండు గ్రంథమును దెనుగున భగవద్గీతాద్యసంగత ప్రకరణములను సంగ్రహముగ వ్రాసి చదువరులకు నమందా నందము నిచ్చునట్లు పరివర్తించిన కవిత్రయము వారి రసజ్ఞతను అర్హతకొలఁదిఁ బొగడ నెవరితరము! ఇంకను సంకోచింపలేదేయని విచారముఁ బూనదగుఁగాని యింతచేసిరిగదా యని దూషింపఁ జూచుట బుద్ధిపొరపాటు.

## గద్య పద్య తారతమ్యము

అధునికులలో నొక్కరు తెనుగుభారతము సంస్కృతమునకు సరియైన భాషాంతరీకరణముగాదనియు, నందుచే విషయగ్రహణ ముంగూర్చిన బాధలు కొన్ని వాటిలెననియు సెలవిచ్చుటయకాక, యది కారణంబుగఁ దాము నూతనాంధ్రీకరణంబునకుం బూన వలసినవారై తమ విధిని కవిత్రయము వారి యౌదాసీన్యమును నిందించునట్లు దోచెడిని. ఉత్తమగ్రంథముల నెందఱెన్ని రీతుల వ్రాసినను దగదని చెప్పగూడదుగాబోలు! అయినను అట్టి వాదము లలో నించుక మతిభ్రమణ మున్నదేమో! ఎట్లన: విషయము ప్రధానమైనది గద్యము. రసప్రధానము పద్యము. అట్లగుటఁ బ్రతిపదార్థానురూపంబగు రచన వచనమునం జేసిన నొప్పుఁగాని పద్య రూపముగ నొనరించిన వ్రాయు వారికి సుఖము లేదు. చదువువారి కంతకుమున్నే లేదు! ఇఁక కావ్యముగ దెనిగింప నెంచిరివో! అపుడు సమయోచితములైన సంక్షేప విక్షేపముల జేగూర్చినఁగాని మనసు కరిగించునట్టి రుచియు భావోద్రేకంబులు గలుగనేరవు. ఈ న్యాయం బెఱుంగని శుష్కపండితులు పద్య రూపముగ భాషాంతరీకరణముం జేసిరయేని క్లేశంబుఁ దక్క

నింకొండు ఫలంబు బుట్టదు. కవీశ్వరుల కృతుల నన్యభాషలలో ప్రాచుర్యముం దెచ్చుటకు నా కవీశ్వరులతో సమానమైన ప్రతిభ గలవారికేకాని యలంతులగు లాంతివారి కేనాంటికిం జెల్లదు.

3. పాత్రోచితములైన మాటలం బ్రయోగించియు విషయమునకుం దగిన రీతిని సొగసైన వర్ణనములం జేసియు వృత్తములు సాక్షాత్తుగ నెదుటం గనులంగట్టినట్లు చేయుట. ఇదియే యన్నింటికిని మించిన కవితాలక్షణము. "కన్నులం గట్టినట్లు కలంగాంచిన రూపము ముందు నిల్చినట్లు" అకృతులు మనసునకుం దట్టవేని యయ్యది నిక్కమైన కవిత గానేరదు. ఈ మహేంద్రజాల కౌశల్యమున కాధారమైన గుణము భావనాశక్తి.

## భావనాశక్తి

భావనాశక్తి యనంగా విషయముల మనసులోం బ్రతిబింబించునట్లు చేయు సామర్థ్యము. ఒక్క ప్రతిబింబించుట యననేల! ప్రత్యక్షముగ నవతారమెత్తునట్లు చేయుట. చూడుండు. సీత, ద్రౌపది, సావిత్రి, దమయంతి, శూర్పణఖ మొదలగు స్త్రీలు కవి కల్పనమునకుం జేరినవారయ్యును మనకుం జరిత్రములలోని స్త్రీలకంటెను, మఱియు మనము నిత్యమును జూచుచు వాదాడుచు నున్న యిరుగుపొరుగు భాగ్యశాలినుల కన్నను నెన్నియో మడుంగులు సత్త్వముం దాల్చినవారై స్ఫురించుచున్నారుగదా! చూడం బోయినం బాండవులు, దుర్యోధనాదులు, రామభరతులు మొదలగు మనస్సృష్టిమానవులు మిథ్యలా? మనమె మిథ్యలా? ఈ తీరునం గృత్రిమముల సయితము మూర్తీభవింపం జేయువారే మహాకవులు. అట్టివారు వ్యాకరణమునకు భంగము గలిగించిననేమి? వచనమున వ్రాసిననేమి? వారి కే కొదువయు రాంబోదు. వ్యాకరణము యతి ప్రాసములు అన్నియుం దప్పక కుదిరినను భావనాశక్తి లేనియెడల నట్టి పాండిత్యము జీవము లేని యాకారము బలె జడంబుగం గాన్పించును. ప్రదిమలు వ్రాయుటలో బహుసమర్థుండైన యొక శిల్పివర్యునియెడకు, చిల్లరశిల్పి యొకండు పోయి తన లిఖించిన చిత్రపటముం జూపి, "దీనియం దేమైన దోషము లున్నవా?" యని ప్రార్థింపుడు నాతం డిట్లనియె "అయ్యా! గీంతలు వర్ణములు మొదలగు గుణములన్నియుం జక్కగ గుదిరి యున్నవికాని, యీ సుందరవిగ్రహమునకుం బ్రాణములే యున్నట్టు గానమే!" అది విని "ఏరీతిని దిద్దిన దీనికిం జైతన్యమబ్బును తెలుపవేమహాత్మా!"

యని యా విద్యార్థి దీనుఁడయి వేడుఁడు, "అయ్యా! నీ చింతఁ దీర్ప నావల్లనఁగాదు. నీ యడిగిన వరంబు సాజమైన భావనాశక్తిచే లభ్యము. ఇట్టిట్లు చిత్రించుటచే ఘనుఁడ వగుదువని చెప్పి చేయించుటలో ఫలము లేదు. వాని వాని మనోబలముకొలదిఁ బరిపూర్ణత్వము సిద్ధించునేకాని యలంకారశాస్త్రముల ననుసరించుట నిష్ప్రయోజనము!" అని యా కళాకోవిదుఁడు వాక్రుచ్చెను. జన్మముచేతన కవిగావలయుఁగాని పఠనము అభ్యాసము నివి యుండినమాత్రము చాలదు. తోడంబుట్టిన చాతుర్యముండినచో నివి సహాయభూతములై వృద్ధిని వికాసమును గల్పింపవచ్చును. స్వాధీనంబగు మనోగాంభీర్య మలవడియుండదేని కృషిఁజేయుట విత్తునాటక యెరువు వఱిచినట్లు. కొన్ని పురుగులు మాత్రము సృష్టికి వచ్చునేమో?

## వేమన

ఈ తత్త్వమునకుఁ బ్రమాణమైనవాఁడు వేమన. ఇతనికి పుస్తకజ్ఞానము ఇంచుమించు సున్న. వ్యాకరణము, ఛందస్సు, అలంకారశాస్త్రము మొదలగువానిలో నీతనికి శక్తి యెంతతక్కువో భక్తియు నంతతక్కువ. అట్లుండినను మహాకవులలోఁ జేరినవాఁడని చెప్పుటకై సామాన్యముగ శుష్కపండితులుదప్ప నింకెవరును సంధియఁపడరు. కుటిల మతాచారములు, మూఢభక్తి, వేషధారితనము మొదలగువానిని దూలనాడుటయం దీతం డద్వితీయుఁడు. గొప్ప రహస్యముల బోధించినవాడైనను తనకుం గల నైజమగు బుద్ధినేకాని, పలుదెఱంగుల విపరీతవ్యాఖ్యానములకుం బాలగు శాస్త్రముల నాశ్రయింపలేదు. అనేకులు సిద్ధాంతముల కాధారములు ప్రాచీనసూత్రములని నమ్మి వానిని వల్లించుటకై జ్ఞాపకశక్తిని వృద్ధిచేయుచు మనశ్శక్తిని గోలుపోయెదరు. ఇంక వేమన యన్ననో కారణ విమర్శనశక్తికిఁ బట్టాభిషేకముం జేసిన మహాత్ముఁడు. ఇతని పద్యములన్నియు లోకోక్తులు. అనగాఁ బలికినవాఁడు అతఁడయ్యుఁ బలుకఁబడిన మాటలు లోకమువారి హృదయములలోఁ బూర్వమే యుండినట్టివియో, లేక అతనిచే నచలముగ నాటఁబడినట్టివియో యైనవనుట. ఇతని పద్యములలోఁ బరిహాసరసము దట్టము. మఱుఁగు మర్యాదలు లేని మోటువిధముగాఁ దిట్టఁడు. నొప్పిచెందువారు సైతము ఇతరులతోఁ గలసి నవ్వునట్లు పేయ సమర్థుఁడు. గాయము కానుపింపకయు, రక్తము కాఱకయు

నుండునట్లు శరీరమును ఛేదింపఁజాలినంత మిగుల వాఁడిగల కత్తి నొకదానిని పూర్వము విశ్వకర్మసన్నిభుఁడగు శిల్పి యొకండు నిర్మించెనని గాథయొకండు గలదు. ఆ కత్తితో నుత్ప్రేక్ష్యములు నుపమేయములునైన యవి యాంధ్రదేశమున నిమ్మహనీయుని పద్యములేకాని వేఱువ్వియు లేవు. "అరిదివిలుకాని యుజ్జ్వలశరము నకును" అట్టిగుఱి పదును పాతమును రావు. నిదర్శనములం జూపుటలో నితఁ డద్వితీయుఁడు. మఱియవి యెవ్వియు గూఢములు కావు. స్పష్టములు. శ్లేషచే స్థాపింపఁబడిన సామ్యము లట్లు దిక్కు నర్థమును లేనివిగావు. వైశద్యము అనుగుణ మితనియందు ప్రబలము. మనము ప్రతిదినమందును జూచుచు నింతేకదాయని యాదరము నవధానము నుంచకపోవు విషయములనే యీతఁడు గ్రహించి భావనాశక్తిచేఁ గాంతి, రూపము, ప్రాణము నావహింపఁ జేసి యెదుట నిలుపఁగా, నపుడు గుర్తుదెలియక పూర్వము మనచే గర్హింపఁబడిన వయ్యును, నివియేవో యమానుష విగ్రహములని విస్మయముజెంది గారవింతుము. ఈ గారడీవిద్యలోఁ దెనుగున నితఁడ ప్రథముఁడు. సామాన్యవస్తువుల కేదే నొక కామరూపము నిచ్చి వెలయించుట యీతని మాహాత్మ్యములలో మొదలింటిది. ప్రకృతిస్వరూపములను ఎంతచక్కఁగాఁ దన సృష్టిభావములతోఁ జూచి, యొకటి రెండు మాటలతోనే యచ్చుటచ్చుట వానిని సాక్షాత్కరింపఁజేసి యున్నాఁడనుట వేఱ సేనొత్తిచెప్పవలయునా? ప్రకృతియనఁగా మనవారిలో ననేకులకు నిఘంటువులలోనుండు ప్రకృతియేగాని మాలింటికి బయటనున్న ప్రకృతి యెట్టిదో, తమ స్వంతకన్నులతోఁ జూచిన పాపమునఁబోరు! అట్టివారికి వేమన యనుసరణీయమగు త్రోవఁ జూపించినాఁడనుటలో నించుకయు గుణాధిక్యస్తుతిలేదు.

## పల్నాటి వీరచరిత్రాదులు

ఈకవితో సర్వవిధముల సమానుఁడైనవాఁడో మించినవాఁడో యసంఖ్యాకులఁ దగిన యాతఁడు పల్నాటి వీరచరిత్రమును వ్రాసిన వీరకవి * ఈ వీరచరితము కొన్ని ముఖ్యాంశములలో రామాయణ

---

* వీరభద్రారెడ్డి యాస్థానకవియైన శ్రీనాథుఁడు దీనిని వ్రాసిన వాఁడు కాఁడనుట నాకుం బూర్తి నిశ్చయము. శ్రీనాథునిలో పాండిత్యమునకు సమమైన కవితాశక్తిలేదు. పల్నాటి వీరచరితములోఁ గవితాశక్తికి సమానమైన పాండిత్యము లేదు.

భారతాదులకు నీడైనదని నా యభిప్రాయము. పాండిత్యప్రభావము మిక్కిలియుఁ దక్కువ. హృదయముల నల్లలనాడించు భావనాశక్తియో యెక్కువ.

ఈతరగతికిం జేరినవి 'బాలనాగమ్మ కథ' 'బొబ్బిలిరాజు కథ' 'రాజాదేసింగుచరిత్రము' మొదలగు ప్రజాసమ్మతములైన కృతులు. వీని రామణీయకమునకు వేఱు తార్కాణములేల! సమస్త స్త్రీ పురుషులయు మనసులలో స్థిరనివాసమేర్పఱుచుకొని యుంటయ చాలదా? వీని నొకమాఱువిన్న మఱల మఱువనగునా? కావుననే పారంపర్యముగ జనులు వీనిని ఖాడుచుండుటయు, తన్మూలమున నవి శిథిలములు గాకుండుటయు.

కేవల కల్పితములైన వానింగూడ సాక్షాత్కారముందాల్చిన చేతనములం జేయంజూచునది కావున భావనాశక్తి నాటకకౌశలంబుతో ననుసంధించియుండును. అనఁగా నాటక రచనాశక్తి యున్నంగాని కావ్యములు సైతము యథార్థములుగఁ గన్పింపవు. విరాటోద్యోగ పర్వంబులం జదివిచూచిన వారికి తిక్కనయెడ నీకళాకౌశలంబెంత పరిపూర్ణముగ నుండెననుట నావంటివాఁడు చెప్పవలసిన పనియేమి? సంజయుఁడు, ధృతరాష్ట్రుడు, ధర్మరాజు, ద్రౌపది, కృష్ణుడు, దుర్యోధనుఁడు, కర్ణుఁడు మొదలగువారు మనయెదుటనే మాటాడుమాడ్కి నుండుట పండితపామర విదితము. పాత్రల నడవడిని, వారిచేష్టలకును మాటలకును గల సమ్మేళన యెంత దృఢము! భారతములోని యేపద్యమైనం జదివిన యెడ, శైలింబట్టియే యది యెవరిదైనదియుఁ జెప్పవచ్చునని యొకానొకరి యభిప్రాయము.

ఈ భావనాశక్తి యింత గొప్పగఁ గొందఱిలో వృద్ధిగాంచుట కేమికారణము? ఈప్రశ్న కుత్తరము సెప్పుట బహుకష్టము. ఏలన తొలుతనే యిది స్వభావదత్తములైన సిద్ధులలో నొకటియని విన్నవించితి. ఆదిమములైన తత్త్వములంగూర్చి వ్యాఖ్యానమునకుం బూనుట పిచ్చితలంపు. అట్లయినను ఒక లక్షణమాత్రము నిరూపింపవచ్చునని తోఁచెడిని. ఎద్దియన;

### భావనాశక్తి నుద్దీపింపఁ జేయుప్రకృతి భావతైక్ష్ణ్యము

మనుష్యుల మనంబులతో నిరంతర సంయోగముం దాల్చిన ప్రకృతులు మూఁడు గలవు. (1) ఆలోచనములు. (కార్యకారణములంగూర్చి విచారణచేయుట, వస్తుస్వరూపము నిర్ణయించుట

యిత్యాదులు) (2) భావములు. అనగా మనోవికారములు. ఉదా: కామక్రోధాదులు, ప్రేమ, ప్రశ్చాత్తాపము, దయ, దాక్షిణ్యము మొదలగు చిత్తసంచారములు. (3) సంకల్పములు. అనగా నేదైన నొకదానిం గోరి, దానిని సాధింపవలయునని ప్రతిజ్ఞఁబూనుట. ఈమూడు శక్తులలో భావనాశక్తి నధికంబుగ విజృంభింపఁ జేయు నవి భావములు, కొయ్యలరీతినో, మహర్షుల చందంబుననో, నిర్వి కారస్థితి నుండువారు పద్దెములు వ్రాయనేర్తురుగాని, కవులగుట యసంభవము. ఏవృత్తాంతమునైనఁ జూచునట్లు వర్ణింపవలయు నన్న దానియొక్క స్థితిగతులను, నందలి పాత్రముల సుఖ దుఃఖములను, రోమరోమమునకును దానే మనఃపూర్వకముగ ననుభవించినందప్ప, తద్రూపముగ నభినయింప నెవరికిని దరము కాదు. చిత్త చాంచల్యము గూడదనువారు ఇట్టి యనుభవములకు మనిసిచ్చి సమ్మతింపరుగావున వారియందు శాస్త్రజ్ఞానమొకవేళ ప్రకాశమునకు వచ్చిన రావచ్చును గాని, శిల్పకళ లేమాత్రమును మొలకెత్తనేరవు. ఈవిషయము పామరులుసైతము గొంతకుఁగొంత యెఱిఁగినదే. కావుననే కాళిదాసు, తిక్కన్న మొదలగు మహాకవు లెల్లరు రసికులనియు స్త్రీలోలురనియు వారు గాథలు కట్టి యుండుట! ఇంతేకాదు. భావములు కోరికలు రసములును మనసులో వెల్లివిరిసెనేని, జనులు మూగలట్లు పందల మాడ్కి మూలఁబడి, నిశ్చేష్టితులై యచలతత్త్వముం బూనియుండుట యరిది. అట్టివారు అనేకవిధములైన యుద్యమములకుంబూని కార్య నిపుణులగుదురు. కావున భావనాశక్తి, సంఘటనోత్సాహము ఇవి పరస్పర మిత్రములనుట విమర్శన శాస్త్రమునందలి యాదిమ తత్వము. అట్లగుట నింకను వివరముగఁ దెల్పుట విధి.

## భావనాశక్తికి కార్యోత్సాహమునకు నుండు సామ్యము

"ఘనములైన రాజకార్యములం దాసక్తికొని ప్రవేశించినవారు గద్యపద్యాది నిర్మాణశిల్పమునకుం దొడంగు వారైనచో వారు సులభముగను త్వరితముగను దత్కళాప్రవీణులౌట నైసర్గికము కార్య గంభీరుల రచనయందుసారము, వీర్యము, ఉద్వేగము, చుఱుకుఁదనము ఇత్యాది నానాపదంబులచేఁ బేర్కొనఁబడు సుగుణ మొకండు అఖండముగనుండును. కావున నట్టివారి కృతులు కేవలపండితుల గ్రంథములవలె రుచిలేనివిగను, చప్పిడి గను, మొద్దుపాటినవిగను ఉండవు" అని విద్యాధురంధరులైన

"మార్లీ" ప్రభువుగారు సుమారు 25 సంవత్సరముల క్రిందనే వ్రాసిరి. దీనికి రాజకార్యవిచక్షణుఁడైన మన తిక్కన్నయే నిర్వికల్పుండైన సాక్షి. కాళిదాసుఁడును గార్యోత్సాహపరులలో మిన్నయైనవాఁడని యతనింగూర్చిన కథలచే నూహింపవచ్చును. మఱియు దేశచరిత్రములఁబట్టి చూచినచో యుద్ధాది వీరకృత్యంబులకుం జనులు గడంగు కాలంబులలో మాత్రము కవిత్వమును విజృంభించుచుండెననుట నిర్వివాదముగ నెఱుఁగనగు నిందులకు హేతువును విశదమ. అట్టికాలములో నెట్టి జడులును ఋషులును గొంతకుఁ గొంతయైన దేశభక్తియు శత్రుసంహననసంరంభంబును దాల్పక మానరు. ఇఁక సామాన్యమైనవారన్నో హృదయములు పగులునట్లు వీర్యాదిభావములం దాల్చుట ప్రకృతి విరోధంబు గాదు. భార్యను బిడ్డలను విడిచి యుద్ధమునకుఁ బోవువాని యాత్మలో నెన్ని భావములు తాండవ మాడుచుండవు ! కుటుంబమును విడిచి పోవలయుఁగదా యను దుఃఖము, మరల నావారిని గన్నులారఁ జూతునో చూడనో యను దిగులు, ఇఁక యుద్ధమునకుఁ బోకున్నఁ బరులువచ్చి తనవారి ప్రాణములకుమాత్రమా, మానమునకును భంగపాటు దెత్తురో యను రోషము, తన వారికిని తన రాష్ట్రమునకునై వినియోగింపక యీ నా ప్రాణమును మూటఁగట్టుకొనిపోయి యేగంగలో బడవేయువాఁడనను దార్ఢ్యము ! ఇత్యాదిగ లెక్కకు మీరిన మనోవికారములను దలచుకొన్ననే మనకు నేమో యగునట్టు లుండునుగదా ! ఇఁక వారికిని వారి కాలమువారికిని గలుగు నుద్రేకమును వర్ణింపనవునా ? ఉద్రేకమేకదా కవితాశక్తికి ప్రాణాధారమైన కారణము ? ఈ దృష్టాంతములో "మనోవికారములు" అను పదమును విధిలేక వాడితిని. ఈ వికారములన్న పదము నాదిగాదు. మఱి

> "తిండిపోత నీకు భండనం బేటికిఁ
> గడవఁ జేరి మనసు గాంక్షదీర
> నోవుకొలఁది మ్రింగియూరక నీవింటి
> కడనయుండు"

మని మగవారిచే గర్హింపఁబడు పేడివారి తెగకుఁజేరిన మన వేదాంతులు మొదలైన వారిచే సృష్టింపబడిన పదము ! గొప్ప గొప్ప భావములు వికారములఁట ! దుర్గంధ ప్రళయముగా మూలఁ గూలంబడి ముక్కును బట్టి కూర్చున్ననేమి సుందరాకారమో !

అది యట్లుండె.*

భాషాచరిత్రమును దేశచరిత్రమును నిత్యసంయోగములు

ఆంధ్రదేశము వీర్యశౌర్యాదిగుణంబులచే విరాజిల్లు కాలంబున నన్నెచోడుఁడు, నన్నయ, తిక్కన మొదలగు కవిగ్రామణులు ప్రాబల్యమునకు వచ్చిరి. కావునన వారి వ్రాఁతలలో రసములమేయముగ మెఱయుచుండుటయే గాదు. ఉత్సాహమను గుణంబును వెల్లివిరియు చుండుటయు, మహమ్మదీయులచే నోడింపబడియుక్కుతక్కువయై కుక్షింభరులమైయున్న కాలంబులోఁ బుట్టి పెరిగిన ప్రబంధకవులలో పాండిత్యబలము విశేషముగ నున్నను పందతన మొక్కటి యెక్కువగ నున్నదేకాని, ధైర్యముతోఁ దల యెత్తికొని మనుష్యులలో మనుష్యుఁడుగ దిరుగుటకుఁ దగిన యుత్సాహ మంతగాఁ గాన్పింపదు. శ్రీకృష్ణదేవరాయల కాలములో పౌరుష మొకింత యుద్దీపించె, కాని యయ్యది మెఱుఁగుదీఁగవలె నొక్క నిమిషమాత్ర మాంధ్ర ప్రపంచమును ధగద్ధగితముఁ జేసి యంతర్థానమైనందున యథారీతిని మఱల గాఢమగు చీఁకటి యాక్రమించినది.

బ్రిటిష్ గవర్నమెంటువారు మనకు మనసార నిచ్చిన విద్యా ప్రభావముచేత నిప్పుడు పరచింత నంతగా నుంచుకొనక యైహికముల సాధించు నుద్యోగములను బునరాచరణమునకుఁ దెచ్చికొనుచున్నాము. కాన భాషాసంబంధములైన రచనలును బ్రకృతము తేజోవంతములై వ్యాప్తికి వచ్చుచున్నవి. హిందూ దేశమును మహోన్నతదశకుం దేవలయునని దృఢప్రతిజ్ఞగలుగు జనులుండు ప్రాంతములందెల్ల దేశభాషలకుఁ బ్రకృతమున గౌరవమును విస్తీర్ణతయు మెండు. మనకుఁ బట్టిన వేదాంతపిశాచిని అట్లట్లు పాఱఁదోలినందులకు నింగ్లీషువారు స్వభాషాభిమానులమగు మన కెల్లఁ బూజనీయుల.♦

పాండిత్యబలము

రేయింబవలును వ్యాకరణములను నిఘంటువులను ప్రాచీన

---

*వికారమునకు నిజమైన అర్థము మార్పు. ఆకారము మాఱుటయె వికారము. ఆ వికారము సహ్యమో అసహ్యమో దానిగతిం బట్టియుండును.

♦ముఖ్యముగా జాతీయోద్యమము మన చిత్రకళలను పునస్సృష్టికిఁ దెచ్చుటలో ప్రథమహేతువు.

కావ్యములను వర్ణించు చుండుటచేత నూనెకు నష్టియేకాని కవితకుఁ బుష్టిలేదు. తనమనసున నెన్నియో భావములు ప్రభవిల్లకున్న నితరుల మనసులలో భావము లుప్పతిల్లఁ జేయుటయెట్లు ? కట్టెవారిన కోవిదులకన్న లోకవాసనల ననుభవించి యానందించువారు మేలు.

## అలంకారము లనావశ్యకములు

మన కావ్యములలో నుపమాద్యర్థాలంకారములును ననుప్రాసాదిశబ్దాలంకారములును దఱచుగ నుపయోగింపఁబడి యుండుట, యెల్లరకుఁ దెలిసినసంగతియె. అందు శబ్దాలంకారములంతగా ముఖ్యములు గావనుట యందరు నొప్పుకొందురు. గాన వానిమాట ప్రస్తుత మటుండనిత్తము. అలంకారములలో ప్రధానమైనవి యుపమోత్ప్రేక్షాదులు. వీనికి మూలభూతమైన ధర్మమేదనగా ప్రకృత వస్తువునకు మఱేదో యొక వస్తువునకును నామ రూప స్వభావాదులంబట్టి సామ్యము గల్పించెడుశక్తి. పోలికలను స్థాపించుట సొగసైన కార్యమేయైనను గవితకు ఖండితముగా నుండవలసిన లక్షణముకాదు. మనవారు అలంకారములయెడ నమితాతురతఁ గొన్నవారు కాఁబట్టి యొకటి రెండు కారణములఁ జూపుట యావశ్యకము. శిల్పములకు వర్ణన మప్రధానము. కాదను వారెవరునులేరు. ప్రతిమలను జిత్రించువారును విగ్రహములఁ దీర్చువారును బరిస్ఫుటముగ నాకృతులనెదుర నిల్పనేర్తురుగదా ! అయిన నట్టిచో వీరు పోలికలందెచ్చి చూపి పరిష్కరించుటకవకాశమెక్కడిది ? గద్య పద్యములును శిల్పమునకుం జేరినవే. కాననిందును సాదృశ్యప్రతిపాదనము విడువరానిది గాదనుటయ సరి. మఱియు భావములు తీవ్రముగఁ జెలరేగునపుడు వానియుద్భవోద్రేకములకు హేతువులగు వస్తువులం దప్ప నితరములయెడ దృష్టిపారుట యసంభవము. మనసు చెలరేగినప్పుడు ఆలోచనకుం బూనుట యౌచిత్య భంగమునకు ముఖ్యకారణము. కావుననే మనవారు కోపమువచ్చినపుడు ౧, ౨, 3 ఎంచుమని చెప్పుదురు. చూడుఁడు. భీమసేనుఁడు దుర్యోధనుని జూచినాఁడుపో ! అపుడు. సింహము మదేభముపైఁ జెలఁగినట్లు, డేఁగ పావురముమీఁద వ్రాలిన మాడ్కి, ఇంద్రుడు వృత్రాసురుని మార్కొనువిధమున, బల్లి చీకటీఁగపై గవిసిన కరణిని ఇత్యాద్యుపములు భీమసేనునికిఁ దట్టునా ? "క్రోధం బప్రతికారమై హృదయముం గుందించు"

నవసరమున నిట్టిదూరపు టాలోచనలకుఁ దావెక్కడిది ? ఒకవేళ అరమైలు దూరమునఁ జెట్టుచాటునఁ బొంచిచూచెడు కవులకైనఁ దోఁచునా ? తోఁపవని నానమ్మిక. ఏలన, భీమసేనునిజూచి వణఁకు చుందురుగాన ! కావున కథాంశము సాక్షాత్తుగ సమీపమున నడచి నట్లు భావనాశక్తి బలంబుచే స్ఫురించెనేని దూరపుసంబంధముగల బలాత్కృతాలంకారములకుఁ దావుండదు. సాదృశ్యములలోఁ గొన్ని సహజములును అనివార్యములును. అవి తమంతటన యే ప్రయాసమును లేక వచ్చినయెడఁ గథాసందర్భముతోఁ గలసి మెలసి యుండును. ఈ విషయమునందు ప్రథమోదాహరణము కాళిదాసుని సాదృశ్యకల్పనము. చూడుఁడు.

తే. "అట్టి సంతతిలేని న నెట్లుగనుచు
వంతఁ జెందవు మది మౌనివర్య ! చెపుమ !
ప్రీతిమైఁదాన నిర్వోసి పెంపఁదుదకు
గొడ్డువాఱిన యాశ్రమ కుజముబోలె"*

మఱికొన్ని సర్వవిధముల సరిపోలఁజాలునే గోవిందా ! యను చున్నను దీర్ఘాలోచనములుచేసి కష్టపడి శ్లేషాది కుయుక్తిపాశ ములచే నీడ్చితెచ్చి తొందరమెయిఁ జొన్పించినట్టులుండును. ఇట్టివి సంపూర్ణముగ విసర్జించిన నెంతయోబాగు. అలంకారములం గూర్చిన ముఖ్యపద్ధతు లెవ్వియన, అయ్యవి ప్రయత్నములేకయ వచ్చినంత సహజముగ నుండుట. కథలోని స్త్రీ పురుషులు మాటాడునపుడు పాత్రోచితములైన కొన్నింటిమాత్ర ముపయోగిం చుట కవియే వర్ణించునపు డొకింత యెక్కువగ నలంకారములు వాడినను దోషములేదు. కాని భావములు మహోజ్జ్వలములుగ రేగునపుడు ప్రకృతమునందే యవధానము నింపుట మంచిది. అట్టి తరుణముల నలంకారములు సాధారణముగ నసంబద్ధ ప్రలాపముల.

## సాదృశ్యతత్త్వము

సామ్యము వర్ణనకు నుపకరణము. ప్రధానంబు గాదు. సామ్యము లుండిననేమి యుండకున్ననేమి ? సొగసైన వస్తువును జూచినవెంటనే తనంతట సంతోష ముదయించును. ఈరీతినే సమస్తవస్తువుల యనుభవములయందును స్వతస్సిద్ధములైన సుఖ

*ఈ పద్యము శ్రీ అనంత కృష్ణశర్మ విరచితము. రఘువంశము (స. ౧, ౭౦)

క్లేశాది భావములున్నవి. వస్తువులు, వృత్తములు, చర్యలు ఇత్యాది ప్రకృతులకును మానవమనః ప్రకృతికిని స్వచ్ఛందముగనుండు భావవిషయమైన రీతులను వర్ణించుట కవితయొక్క ప్రథమగణ్యోద్దేశము. ఈ కార్యమునకు, సాదృశ్యనిరూపణాద్యలంకారములు సులభముగఁ దోడ్పడిన వలదనరాదుగాని, యిట్టి యలంకారములు లేకున్న వర్ణనము తుదముట్టనేరదని భ్రమించి, వానిని కుయుక్తి యను త్రాటిచే బంధించి ప్రబంధమను చెఱలోనుంచుట యెంతయుఁ బశ్చాత్తాపకరమైన నేరము. కమలముతోఁ బోల్పకున్న సీతాదేవి ముఖము చూచువారికి సుఖమియ్యదా? చిన్నతనముఁ బూనునా? అట్లగుట నాదేవి ముఖమునే నేరుగ వర్ణించినం జాలదా? మఱియుఁ గమలముతోఁ బోల్చుటంజేసి సీతాదేవి ముఖ మానందదాయి యాయెనని భ్రమించు వెఱ్ఱు లెవరైననున్న వారికొక ప్రశ్న. ఏమన, ఇఁక దేనితోఁ బోల్పఁబడినందున కమలము హర్షము నొసంగునది యాయెను? ప్రతి పదార్థమునకు నొక యుపమాన ముండితీర వలయునన్న కట్టకడపటి యుపమానమున కాధారమేమి? కావున నెట్లును ఏదోయొక వస్తువు తనంత, ఇతర మధ్యస్థ్యములేక, తన కనుగుణమైన భావమును బుట్టఁజేయునుగదా? అట్లగుట మొదటి వస్తువునకే యా గౌరవము నేల ప్రతిష్ఠింపరాదు?

### వస్తుస్వరూపములు భావములు పరస్పర నిర్ణీతములు

వస్తువులంబట్టి భావము లేర్పడిన భావములంబట్టి వస్తువు లేర్పడుటయు నిజము. ఎట్లన, సంతోషకాలమున సర్వము ప్రకాశ మానముగాఁ దోఁచును. దుఃఖము గ్రమ్మినచో లోకమంతయుఁ జీకటిగ్రమ్మిన యట్లుండునుగదా! అభిమన్యుని మరణము విని శోకతప్తయైన సుభద్రాదేవి ప్రలాపించిన యీ పద్యము వినుండు.

సీ. "ఈ లోకమెల్లఁ బాడిల్లును బోలెనై
యున్నది నీవు లేకునికిఁ జేసి!
నీవు వేగమ కడు నెఱసి బంధులఁ బ్రీతిఁ
బొందజేయుట కలవోలె నయ్యె,
జిష్ణుని కొడుకవు కృష్ణు నల్లుండ వీ
వరులచేఁబడుట చోద్యంబుగాదె!
చెలువంపుమేనును జెన్ను మొగంబునై
యెన్నడు పొడనూపెదింక గుఱ్ఱ!

తే. అకట! యుత్తర యెప్పెడునది, మనంబు
దీనికెంతయు మెత్తన, యేమనిన్ను
వేఁడికొనియెద! వచ్చి యివ్వేలఁది వంత
దీప్తి తళుకొత్తు పలుకులఁదేర్పవన్న!" (భా. ద్రో. ద్వి. 733)

ఈ మాట యెంత సత్యము! జయమగునేని ప్రపంచమంతయు పెండ్లిల్లే; పరాజయమేని పాడిల్లే! కావుననేకదా వేమన

"తనచావు జలప్రళయము
తనదుఃఖమె సర్వలోక దారిద్ర్యంబున్"

అని నుడువుట!

విపరీతాలంకార రచనకు ప్రేరేపకము భావశూన్యత

ఇంగ్లీషుకవులకంటె నాంధ్రకవులలో నలంకారము లధికములు. అందును ప్రబంధకవులలో నత్యంత విపరీతములు. దీనికిఁ గారణమేమన, అలంకార రచన యాలోచనాశక్తికిఁ జేరినంత భావనాశక్తికిఁ జేరినదిగాదు. మనకవులు తరుచు పండితులు. ఇంటిలోనే కూర్చుండి నిఘంటవులఁ గంఠపాఠము సేయువారు. వీరికి కార్యోత్సాహము భావప్రాబల్యము రెండును క్షీణములు. కావుననే భావనాశక్తి మట్టు. ఒకవిధమైన యాలోచనాశక్తి యెక్కువకాన రేపగలును ఆలోచించి యాలోచించి దిక్కుగతి మోక్షములేని యూహలఁ గల్పించుచు నదియే కవిత్వమని విఱ్ఱవీఁగసాఁగిరి. యుక్తులు కుయుక్తులుఁ గవితాశక్తి యగునా! కానేరవు. కవిత్రయమువారిలో నిట్టి విఱుపులు లేవని చెప్పఁగాదు గాని ప్రబంధకవులయందు బలెపిచ్చి ముదిరియుండలేదనుట సర్వజనవిదితము. ఒకవేళ మన దేశభాషలలో నలంకారములకు స్వచ్ఛందమైన ప్రవృత్తి యాంగ్లేయ భాషలకన్న నెక్కువయోమో! భాషాశాస్త్రవేత్తలు గొందఱు మనలో గుణవాచకములు వలసినంత లేకుండుటచే విషయవైశద్యప్రాప్తికై యలంకారములతో నిండిన శైలి నారాధింపవలసినవార మైతిమని సిద్ధాంతము చేసి యున్నారు. ఇదియు సహేతుకమైన వివరణమేయని తోఁచెడని.

భారతకవుల ప్రతిభ

ఈ విస్తార వ్యాఖ్యానమునకు ప్రకృతి సాంగత్య మెట్టిదనఁగా భారతకవులకు భావనాశక్తి యెంతయు గంభీరము. సమయోచిత

వర్ణనా ప్రావీణ్యమునఁ దిక్కనతో సమాను లెవరును లేరు. అరపా లైనవారును లేరన్న సత్యమునకుఁ దలవంపు రాదు. పనికిమాలిన యలంకారములు వారి కవిత్వమున నపరిమితములుగావు. తుదకు వర్ణనములకుం బూనునపుడు సైతము కథయొక్క వేగమునకు భంగము గలిగింపనంత మితముగఁ జేయుదురేకాని కథ మఱపు నకు వచ్చునంత దీర్ఘముగా నెప్పుడును సాగఁబెట్టరు. అనఁగా నిక్కమైన కవిత వీరియందు నెలకొన్నదని నా విన్నపము. అందుఁ దిక్కనను గూర్చి నావంటివాడు ప్రశంసింప జూచుట యధిక ప్రసంగము. అతఁడు కవిబ్రహ్మ. అవతారపురుషుఁడుగాని కేవల మర్త్యుఁడా యని యాశ్చర్యపడవలసినంత ఘనుఁడు!

### విషయము శైలి రెండును ముఖ్యములు

"భారతమునందు మనకంత రుచియుండుటకుఁ గారణము విషయము, అనఁగా కథగాని, యా విషయము ప్రదర్శింపబడిన మార్గములు, అనగా శైలి ఇత్యాదులు, గావని" కొందఱ యభిప్రాయము. కాని యిది శుద్ధముగా బుద్ధిపొరఁబాటు మాట. దృష్టాంతము: భాస్కరుని రంగనాథుని* రామాయణములం జదివినవారు రామవియోగముచే శోకించు కౌశల్యాదశరథాదులయెడ నెంతో ప్రీతియు జాలియు వహించినవా రగుదురుగదా! అయ్యలరాజు రామభద్రుఁడను కవి తన రామాభ్యుదయములో రామవనవాస ఘట్టమున దశరథుఁడు 'నానార్థరత్నమాలను ఎదుట నుంచికొని పుటలఁ ద్రిప్పుచు నేర్చినాఁడో' యనునట్లు దరిద్రముపట్టిన శ్లేషాలంకారములు పెట్టి

సీ. "కానక కన్న సంతానంబు గావునఁ
గానక కన్న సంతానమయ్యో
నరయ గోత్ర నిధానమై తోఁచుఁ గావున
నరయ గోత్రనిధానమయ్యో నేఁడు
ద్విజకులాదర వర్ధిష్ణుండు గావున
ద్విజకులాదరణ వర్ధిష్ణుఁడయ్యో
వివధాగమాంత సంవేద్యుండు గావున
వివిధాగమాంత సంవేద్యుఁడయ్యోఁ

---

*రంగనాథరామాయణమును రచించినవాఁడు కోన బుద్ధారెడ్డి. రంగనాథుఁడనెడువాఁడు కట్టుకథలకుఁ జేరిన కవియకాని వాస్తవ్యుఁడు గాఁడు.

తే. గటకటా! దాశరథి సముత్కట కరీంద్ర
కటకలిత దాన ధారార్ద్ర కటకమార్గ
గామి, యెట్లు చరించు నుత్కట కరీంద్ర
కటకలిత దాన ధారార్ద్రకటక తటుల?”

ఇత్యాదిరీతులఁ బ్రలాపించినట్లు వ్రాసియున్నాడు. మఱియు శంకరకవికృత హరిశ్చంద్రోపాఖ్యానమున లోహితాస్యుని మరణము గూర్చి యేడ్చుచుఁ జంద్రమతి, రాజర్షి పత్నిగావుననేమో, కుమారునికింబలె తనకును నూపిరాడకుండఁ బ్రాణాయామముఁ జేయుచు నీ దీర్ఘసమాసమును గూర్చి పద్యము చెప్పినది చూడుఁడు.

మ. “అకటా! చేరెఁడు నేలకుం దగఁడె సప్తాంభోధి వేష్టిభవ
త్సకలద్వీపకలాప భూపమకుటాంచ త్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్గళ నిర్గళత్కిరణ శుంభత్పాదుఁడైనట్టి రా
జకుమారుండు” (అ. 5, 86 ప.)

ఈ తీరుననే యెల్ల రామాయణములును వ్రాయబడియున్నచో నా గ్రంథముల యొద్దకు మనుష్యులననేల, తుదకు జెదలు సయితము పోదనుట స్పష్టము. కాబట్టి విషయముచే రసము తప్పక కలుగుననుట తప్పు. కథ బాగుగ నుండిన జాలునా? తగినరీతిని వ్రాయంబడియున్నంగాని కాదు. ఈదేశములో నొక్క యాంధ్రులకుఁ దప్పఁ దక్కిన యందఱకును రామాయణమందుఁ గల యభిరుచి భారతమున లేదు. మనకన్ననో భారతము ప్రాణము. ఈ వ్యత్యాసమునకుఁ గారణమేమి· ఆంధ్రంబున భారత రామాయణాదులకుఁ గల శైలి తారతమ్యమే. శోకరసము వర్ణించునపుడును, రామభద్రునకు శ్లేషలుః సాంస్కృతిక దీర్ఘ సమాసములును వీడరాని చీడలాయెఁగా! యుద్ధము ముగిసి జయము సిద్ధించిన పిదపఁదాఁజేసిన యకృత్యములఁ దలఁచికొని ధర్మరాజు పశ్చాత్తాపపడు ఘట్టమునఁ దిక్కన్న వ్రాసినవిధముం జూచిన భారతమునకు మన యంతరాత్మలయందుఁగల నిత్యనివాసమునకుఁ గారణమేర్పడకపోదు. చూడుఁడు.

ఆ. అల్పకాల భోగ్యమైన రాజ్యమునకుఁ
గా, ననల్పకీర్తి మనుని, జరత
సింహకల్పు, వంశశేఖరజన్ముఁ, ద్రుం
చితి, మనంబు పగలఁ జివుక కున్నె? (భా.శాం.ప్ర. 197 ప.)

మ. జననంపూజ్య పదారవిందుఁడగు నాచార్యుండు శోకించి, నం
దనుఁజొప్పారయవేఁడి, పెద్దయు నమం దానమ్మి యర్థింపఁ, జా
వనివానిన్, గరిచావు బుద్ధినిడి, "యశ్వత్థామ నచ్చెన్ నిజం"
బని యే బొంకితి! మేదినీ భరణ మర్హంబే గురుద్రోహికిన్? 198

ఆ. రాజ్యలాభలోభరతుఁడనై కడు బాప
మైన బొంకుమాటలాడి, గురుని
గూల్ప నేర్చినట్టి క్రూరాత్ముఁడేగతిఁ
బోవువాఁడు? సెపుమ బుధవరేణ్య! 199

క. భ్రాత మహాత్ముఁడు కర్ణుం,
డాతనిఁ జంపించి యేలు నవనీ రాజ్యం
బాతురత నొనఁగుఁగాక, సు
ఖాతిశయము మతికి నొనఁగునయ్య మునీంద్రా. అ. 200

చ. కడిఁది మగండు కుంభజుఁడు గావఁగ నొడ్డిన మంటపోలెనుం
డెడి మొనఁజూచి చూచి, యెది డెప్పర మన్వగలేక పంచితిన్
గొడుకుఁ జొరంగ, నత్తెఱగు క్రూరతసైఁప సుభద్రయట్లు, క
వ్వడి క్రియ, నోర్తురేయొరులు? వల్లభుఁడేలగు నట్టిఁదుర్వికిన్? 201

చ. అడలడిఁ బొందగాఁదగని యట్టిది ద్రోవది, మేరుకల్పులం
గొడుకుల నేవురన్ జముఁడుగొన్న నలందురఁ జూడనేర్తునే?
పుడమి గిరీంద్ర పంచకము వొల్చినఁ బాడఱి నట్టులున్న య
ప్పడతుక యెట్టులోర్చుగృహభారము నెమ్మది నిర్వహింపఁగన్.

క. ప్రాయోపవేశమున ని
కాయంబుఁ దొఱంగఁ దలపు గదిరెడు, నంతా
పాయత్తచిత్తు, నకట క
టా! యని పోనిండు నను దృఢవ్రతయుక్తిన్.

## పాత్రరచనాతత్త్వములు

మఱియు పాత్రముల చరిత్రములను విస్తరించుటలో వర్ణ నీయమైన పద్ధతి యేదనఁగా స్త్రీ పురుషులు గుణానుగుణమైన నడ వడి గలవారయ్యును, ప్రపంచాచారములయందు బళ కావ్యము లందును గాలదేశవర్తమానముల వలన నొక్కొక్క యెడ విరుద్ధమైన వర్తనముగలవారుగా నున్నట్లును ప్రదర్శించుట సర్వకాలముల యందును సర్వావస్థలయందును ఏకరీతిగా వర్తించు వారుండుట

యరుదు. మొత్తముమీఁదజాడ యెంతక్రమముగానున్నట్లు దోఁచి నను సూక్ష్మముగఁ బరీక్షించి చూచినయెడల వంకర లేమాత్రమును లేకుండవు. ఋజుమార్గం బట్లుండఁగా, నిక్కమైన యుపజ్ఞలేమిచేఁ బరులో పెద్దలో చెప్పినట్లు, వ్రాయఁజూచు నలఁతికవులు, అలంకార శాస్త్రములలో నాయికా నాయకులకు జాతుల నేర్పఱచి గుణమ్ముల నిర్ణయించియుండుట బాగుగఁ బఠించియున్నవారు గాన నదియ యొకవేదమనుకొని ప్రమాణమను పిచ్చిపట్టి, యందుఁ బేర్కొనఁ బడిన ధీరోదాత్తప్రభృతులలోఁ దమకు వలయువారిని స్వీకరించు కొని యెల్లదెఱంగులం బ్రాచీనోపదిష్టమార్గంబుననే వర్ణించియెదుట నిలుపుటయు కృతకృత్యతగ భావించిరి. బింబములకుఁ బ్రతి బింబముల నుత్పాదించుట కవి చేయవలసిన పనిగాదు. మరి పోటోగ్రాఫరుది. తన మనస్సునకుఁ దగినట్టు తన కన్నులకు గోచరించునట్లును వ్రాయవలయునేకాని యింకెవరికో తోచినట్లు దా వ్రాయఁజూచుట మూఢమతము. అట్లుచేసినఁ బద్యములు సిద్ధించినను గవిత పక్వస్థితికి రాఁజాలదు. ఇందునకుఁ గారణ ములు. మనసులు వేఱు. సంపూర్ణముగ సరిపోలునవి దుర్ఘటములు కావున నేవిషయముం గూర్చి చర్చించినను సరే యొకనికిఁదోఁచు భావము లితరుల భావములతోఁ గొంతవరకు సదృశ్యములై యున్నను గొంతవరకు భిన్నములుగను నుండుననుట ప్రకృతి లక్షణము. ప్రకృతి శాస్త్రములయందు సామాన్యగుణంబులకు గౌరవ మెక్కువ. ఏలయన వస్తుజ్ఞానమే యందు ముఖ్యము. అట్లుగాక మనోరంజకమే ప్రధానముగాఁగల కవితాదిశిల్పములందు భిన్నగుణములకు గౌరవమెక్కువ, చూడుఁడు. ఒక స్త్రీని జూచి మోహించినవాఁడు ఆమెకు స్త్రీజాతి యంతటితోడను గల సామాన్య మైన గుణములచే నాకర్షింపఁబడియా మోహించును? అట్లయిన నీ యమ్మయే కావలయునని పట్టుబట్టుట యేల? ఎవతె చిక్కినను సంతోషమని యుండరాదా? మోహమునకుం గారణము సామాన్య గుణంబులతోఁ గలసియు మీఱి మెఱయు ననన్యసాధారణములైన లావణ్యము, వచోమాధుర్యము, నడకల సొగసు ఇత్యాదులగు సౌందర్యములు. జాతి యనునది యస్తిభారము వంటిదను కొనుఁడు. కనులను మనసులను మఱల్చునది యదిగాదు. దాని మీఁద జక్కఁగఁ దీర్పంబడియుండు స్వరూపమను భవనము. ఈ సంగతి నెఱుంగనివారె "పాడిందేపాడరా పాచిపండ్ల దాసరీ" యన్నట్లు ఏదోయొక కొన్నితరగతుల పాత్రములను వర్ణనములను

బిఱికిపట్టుతోఁబట్టి వానిసంఖ్యలకు గుణకారము సేకూర్చిన నలంకారము సేకూరుననియాంధ్రకవిత్వమును భావములేని పదాటోపము ప్రకటించి పాడుసేసిరి.

"ఏమీ! ప్రతివాని మనసునకు వచ్చినట్లు వ్రాసినదియుఁ గవిత్వమగునా? యను నాక్షేపణ ముండునేమో! నేనన్నదది కాదు. కవియైనవాఁడు తన భావము ప్రకారము వ్రాయవలయు నంటినిగాని, భావము ప్రకారము వ్రాసిన వారందఱు గవులౌదురని నా మాటగాదు. అనఁగా నుత్కృష్టమైన భావములేని నీరసమానసులు కవిత్వముం జేయంబూనుట వారియొక్కయే కాదు మనయొక్కయు దురదృష్టము.

## పాత్రములు అనితరతుల్యములుగ నుండవలయు

సుప్రసిద్ధములైన పాత్రములన్నియు ననితరతుల్యములు. మఱియు ననితరతుల్యములే సుప్రసిద్ధములు. ఉదా.: ద్రౌపది, సీత, సావిత్రి, శకుంతల, మండోదరి, శూర్పణఖ మొదలగువారు ఎల్లర చిత్తములలోను జక్కఁగాఁ దమ తమ గుణములచే బ్రకాశమానలుగ నున్నారు. వీరిలో మంచివారుసైతము భిన్నమూర్తులే కాని, ప్రత్యేకపఱుచుటకు సాధ్యముగాని యొకే యచ్చునఁ గొట్టినట్టి బొమ్మలుగారు. ఇఁకఁ బ్రబంధస్త్రీలన్ననో యట్లుగాదు. అందఱకు నొకటేమూర్తి. వెవ్వేఱ గుర్తింపనలవిగానట్టిది. ఆకారములు, గుణములు, చీరలు, నగలు అన్నియును నలంకారశాస్త్రమను నొకే యంగడిలో నెరవుతేఁబడిన వస్తువులు. పేర్లుమాత్రము వేఱు. చర్యలేమో యొక్కటే. అవియు నంత శ్రేష్ఠములు గావు. వ్యక్తిత్వము సున్న.

ఆదికవులను మధ్యకవులనుగూర్చి చెప్పిన యీ కవి మాటలు దిక్ ప్రదర్శనముగఁ జెప్పబడినవేకాని ప్రతియొక్క కవికి నారోపింపఁదగినవి కావని యెఱుంగవలయు. చూడుఁడు. స్త్రీపాత్రములందు మనుచరిత్రములోని వరూధిని యెంత మనోహారిణియగు ముద్దరాలు!

## జీవకళయొక్క లక్షణము

పాత్రములు ప్రత్యేకాకృతులుగ నుండవలయు ననుటయు నయ్యవి బిఱుసువాఱినట్లుండక సమయోచితములగు మార్పులం జెందునవిగ నుండవలయు ననుటయుఁ బరస్పర మిత్రములైన

న్యాయములు. ఎట్లన, ఈరెంటికిని హేతుభూతమును దావళమును నయినది జీవము. జీవకోటులం బరీక్షించి చూడుఁడు. మూఁడు గుణములు తెల్లముగఁ గాననగు, (i) అవి జాతులుగ నేర్పడును. (ii) కాని ప్రతిప్రాణియు నితరప్రాణులనుండి వేఱుగ గుర్తింపఁ దగినంత వ్యక్తిని దాల్చియుండును. (iii) వికారము. అనఁగా మార్పులం జెందుట. ఇది యన్ని జీవరాసులయు స్వభావము. నిర్వికారముగా నుండవలయునన్న ఱాయి గావలసినదే! అదియు నుంగాదు గాఁబోలు! ఏలన, ఆధునిక ప్రకృతి శాస్త్రజ్ఞులు లోహములు మొదలగు జడంబులు సైతము జీవులట్ల స్వాభావికముగ వికారము నొందునని నిరూపించియున్నారు. కావునఁ బరమ నిర్వికారస్థితిఁ దాల్పవలయునన్న రంభలు లేని లోకముఁ గనిపెట్టి యందు ఋషీశ్వరులగుటఁ దప్ప వేఱొండుపాయములేని యుపాయము వెదకినను దొరకదు. (iv) ఈ వికారములును వ్యక్తిభేదముల మాడ్కి. అనగా వస్తువులయొక్క ప్రకృతికి మీఱిపోవు. మఱియెట్లు వ్యక్తిజాతిచే పరిమితమో యట్లే వికృతులును ప్రకృతులచేఁ బరిమితములు. హృదయప్రమోదమే యుద్దేశ్యముగాఁగల శిల్పకళలయందు వికృతులు ప్రధానతమములు.

### వికృతులులేని పాత్రములు జడసమానములు

ఇది తెలియనివారు ఎవరినైన నొకని ప్రారంభమున ధీరోదాత్తుఁడుగా నుండునట్లు వర్ణించిరయేని, మఱి వాఁడు చచ్చువఱకు నా ధీరోదాత్తత్వమునందే వానిని పడవైచిపెట్టి పుణ్యము గట్టి గొందురు. వీరియొక్క పాత్రములు గ్రుక్కుమిక్కనక యిటు నటుఁ జూడక ముక్కునకు సూటిగా నేగుచుండును. అనగా యినుప యంత్రములకు జేరినవిగాని మనస్సును కలిగి, యది కారణముగ చాంచల్యముగల చేతనములుగావు. పాత్రముల సహజ వికృతుల నుద్ధరించుటయందు భారతమును మించిన గ్రంథ మీ ప్రపంచమునం దెక్కడను లేదు! మానవస్వభావ మీ గ్రంథరాజమున నెంతచక్కఁగ నెంత గంభీరముగ నెత్తి చూపఁబడినదో యది తలంపునకు రావచ్చునేమో గాని నాల్కకు వచ్చుట దుర్లభము. చిత్రవిచిత్రభంగులు గలిగి, భావార్ద్రములై, స్వాభావికములై, మెఱుంగు వెట్టఁబడిన భారతపాత్రములం గూర్చి వ్యాఖ్యానముఁ జేయవలయునన్నచో నిటనుండి పింగళి సూరన్నను వెడలఁ గొట్టవలసినదే. ఈ యుపన్యాసమునకు నాయకుఁడు గాన నది

మర్యాదకాదు. ఈ గుణములంబట్టి చూచిన రామాయణాదులు భారతమునకంటె నెంతో తక్కువయ్యెననుట నిస్సంశయము. ఇంక సామాన్య ప్రబంధములన్ననో వానియందలి స్త్రీ పురుషు లెండిన కట్టెలవలె నున్నారు. వంగలేరు, పెరుగలేరు. కాంబట్టి ప్రాప్తులు రెండు : విఱువంబడుట! ప్రాయి నిడంబడుట.

### శాస్త్రాదేశ రచనలు విరసములు

ప్రాచీనులు వ్రాసినట్లును అలంకారశాస్త్రము లాదేశించినట్లును విరచింపం బ్రయత్నించుట తెలివితక్కువ పని ఏలన ఒక కవి వ్రాసినవిధమున నింకొకండు వ్రాయంజాలమి ప్రకృతిసిద్ధమైన యర్గళము, ఇందునకు గారణములు, (i) మనసులు వేఱగుటం జేసి భావాదులును వేఱు. వివిధభంగుల స్ఫురణము గలవారు ఒకేతీరున నభినయింపంజూచుట పరిహాసమునకు హేతువు. (ii) భావము భాష యివి పరస్పర సాంగత్యముం దాల్చి యున్నవి. ఇంచుక నిదానించి చూడుండు. ఏవిధమైన పదములచేరికయు లేని యాలోచనలజేయుట సాధ్యమౌనా? ఏదీ? భాషాసాహాయ్య మేమాత్రముం గైకొనక కొంతసేపు దేనినిగూర్చియైన యోజింపుండు? ఈ గారిడీవిద్య మనుష్యులకు మించినది. తలపుండిన భాషయు నుండవలయుననుట నిజము. అయినను భాషయుండినం దలం పుండితీరవలయునా యనునొక ప్రశ్నయు విచార్యము. భావము లఖండముగ లేక యుండినను పదాడంబరముం బ్రబలముగాం జూపవచ్చుననుటకు మన ప్రబంధకవులే సాక్షులు కాని, యట్టి పదములు నిరర్థకములుగాన హృదయాకర్షకములు గావు. రుచి నీయవు. భావపుష్టి లేని పదపుష్టికి 'బడాయిశైలి' యని పేరు. పసిపిల్లలేగాని ధీరులెవరును దీనినొకయెత్తుగం బాటింపరు.

కావునం దిక్కనరీతిని వ్రాయవలయునన్నం దానే తిక్కనావ తారమెత్తి యాతని మనోభావాదులం దాల్చిన యౌనుగాని విరాట పర్వము గ్రుడ్డిపాఠముం జేసిన గోరిక తుదముట్టదు. ఒకరు సృజించిన శైలి, విషయము, రీతి ఇత్యాది బింబములకు ప్రతి బింబముల రచింపంజూచుట మంచిదిగాదు. అదృష్టవశమున సాధ్యమునుగాదు. కష్టించి బహిరాకారముం దీర్పంజాలితిమేనియు నంతరంగ ప్రతిపాదనముం జేయుట యెట్లు? ప్రాణము అను గుణములేని పాత్రములు రిత్తలు. ద్రోణపర్వములో నభిమన్యు మరణవివేయమై జాలిం జెందుచు పర్జునుండు

ఉ. "హాయను ధర్మరాజ తనయా యను నన్నెడఁబాయ నీకుఁ జ
న్నేయను దల్లినేఁపఁ జనునే యనుఁ గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను నొంటిపోక దగవేయను నేగతిఁ బోవువాడ నే
నో యభిమన్యుఁడాయనుఁ బ్రియోక్తుల నుత్తరఁ దేర్పవేయనుఙ్"
(భా. ద్రో. ద్వి. 242)

అని విలాపించిన సామాన్య పద్యముం జూచి తరువాతి కవులందఱు నాక్రోశావసరంబులలో

ఉ. "రాయనుఁగాయనుం దొగలరాయనిఁగేరు నిగారపుంగొటా
రాయను మేటినాడెవు దొరాయనుఁ గిన్కయొనర్చెదేమిమే
రాయను నింతనీకుఁ గనరాయను దయ్యము పాడిదప్పెనా
రాయనుఁ గన్నవారు నగరాయను నిప్పని మానురాయనున్"
(అచ్చ తెన్గు రామాయణము అయో. 89 ప.)

ఉ. కాయను మేటితప్పు కొడుకాయను నిద్దపుఁబూతమావిమో
కాయనుఁ బంజరంపుఁ జిలుకాయను నబ్రపుసోయగంపుఁ బ్రో
కాయనుఁబల్కవేమి యలుకాయనుఁ బంతముదీఱెనోటుకై
కాయను నేరయిట్లు దుడుకాయనుఁ బాయఁగఁ గోరికాయనున్
(అచ్చ. రా. అయో. 90 ప.)

ఉ. హాయను గాధినందన మఖారినిశాటమదాపహారిబా
హాయను గ్రావజీవదపదాంబురుహాయను రాజలోక సం
హాయనుఁ బోషితార్యనివహాయనుఁ గానల కేగితే నిరీ
హాయను నిర్వహింపఁగలనా నినుఁబాసి రఘూద్వహాయనున్.
(రామాభ్యుదయము ఆ. 5 ప. 10)

ఉ. జాయనుజూపవేమి యనుజాయను నవ్విధియెంత చేసెనో
రాయను నాదుగుండె బలురాయను నాత్మపరాక్రమోన్నతుల్
రోయును గాననాంతరము రోయును దుష్టకురంగచేష్ట ను
మ్మాయను జానకీ దనుజమాయను గ్రుంగితె పల్కమాయనున్.
(రామాభ్యుదయము, సీతావిరహమట్టము)

ఇత్యాది వర్ణక్రమము ననుసరించి ప్రాసములతో వ్రాసిన రసికుల మనసులకు తూయనిపింపక మానునా ?

**మిశ్రచరిత్రములుగాని పాత్రములు ప్రకృతి విరుద్ధములు**

పాత్రములం గూర్చి యీావఱకు స్థాపింపఁబడిన పద్ధతులు

రెండు, (i) అవి నిర్జీవములట్లు బిఱ్ఱబిగిసి యుండఁగూడదు. (ii) మఱి తీఁగెలవలె నల్లునవిగానున్న నింపును సత్యమును వహించినవగును అనుట. ఇట విన్యసింపఁ దగిన విశేష మింకొండుగలదు. ఏదన, పాత్రముల చరిత్రములు శుద్ధముగ మంచివిగానో శుద్ధముగఁ జెడ్డవిగానో యుండునట్లు దీర్చుట శిల్పదోషములలో నొకటి. ఏలోపమునులేని స్త్రీ పురుషులుండరు. మఱి కేవలము దుష్టులైన మానవులును గంటికిఁ గానరారు. మనుష్యప్రవృత్తి మిశ్రమైనది. కూనీచేసినవాఁడు సైతము పగసాధించుటయను వీరకర్మమున కుద్యోగించు వాడేకదా! దొంగలు పరుల సొత్తును గ్రహించినను తమ భార్యలయు బిడ్డలయుఁ బోషణార్థమేకదా! ఇంతేకాదు. వెలుతురు చాయయు నెట్లు నెడతెగని సంయోగముం దాల్చి యున్నవో, యట్లే మంచి గుణములకును, దమ నీడలోయను మాడ్కి నవియే యాధారముగఁ బ్రభవించెడు చెడుగుణములు సదా సహచరములైయుండును. ధైర్యము మంచిద. అయిన నభిమన్యునివలె నత్యంత సాహసోదగ్రులైనయెడ వ్యర్థమైన ప్రాణ నష్టికి మూలమగును. ఇఁక నెదిరిని దమ్ముని నెఱింగి సమయము పొంచి మీఁదఁబడుదమనువాఁడు జయము గొన్నవాఁడైనను అంత కడింది మగఁడుగఁ దోఁపఁడు. నీతియనునది శకునికైతపము యొక్క యపరావతారము. నీతిరహితమైన విజృంభణము ఆశ్చర్య కరమైనను, ఆనందకరమవునో కాదో, మఱియు సుగుణములే కొన్ని యెడలఁ బరస్పర విరుద్ధములగుటయు సంభవించెడు. అపుడేదేనొక న్యాయమును నిరాకరించుట విధిలేని యకృత్యము. దృష్టాంతము కర్ణపర్వమునఁ గృష్ణుఁడు చెప్పిన "కౌశికోపాఖ్యా నము" సత్యము ధర్మమే అయినను దొంగలువచ్చి నీసొత్తెక్కడనని యడిగిన నిజము చెప్పవలయునా? శత్రువులువచ్చి నీయింటఁ జొచ్చినవాఁ డెక్కడ నున్నాడు చూపుమా వాని గొంతుగోయ వలయును. అని మర్యాదగాఁ బ్రార్థించిరేని నిజముచెప్పిన భూతదయ నశించును. కనికరము నుద్ధరించిన ననృత దోషము ఘటిల్లును. అట్లగుటఁ గేవలము నిరంజనుఁడుగా నుండవలయు నన్న నసాధ్యము. నిరంజనత, నిర్వికారత, నిష్కళంకత ఇత్యాద్య భావములు మానవ ప్రకృతికిం జేరినవికావు. మన నడతలు మిశ్రములు. ఈ న్యాయమునకు ననుకూలమైనరీతిని పాత్రముల చరిత్రములం జేర్చి విస్తరించుటలో భారతమునకు నీడుజోడైన గ్రంథము లెవ్వియునులేవు. సామాన్య కవుల పాత్రములు

నిర్వికారములుగ నుండుటయే కాదు. సంశ్లిష్టములును గావు. అవి యేకరస ప్రధానములుగాని నానా భావాభ్యుదయములకు నాకరములుగావు.

## వర్ణనములకన్న అంగాంగ సాంగత్యము కావ్యముల శ్రేష్ఠము

ఒకానొక విద్వాంసుఁడు గొప్ప గ్రంథమున కొక దానికి విమర్శన ప్రాయమైన పీఠిక వ్రాయుచు నా గ్రంథమును బ్రశంసించుటకై యిందుఁ బదునెనిమిది విధములయిన వర్ణనములు నున్నవియని దృష్టాంతములతోఁ జూపియున్నాఁడు, ఇది దోషము గాదుగాని పొరపాటునకు వీలిచ్చెడు పద్ధతి. ఎట్లన, విడివిడి వర్ణనములఁ జేయుటలో సామర్థ్యముం జూపెనేని యా మాత్రమే కవియొక్క ఘనతకుఁ జాలునని భ్రమింతురా? చూడఁబోయినఁ బదునెనిమిది వర్ణనలుండిన నెవరికిఁ బ్రీతి; లేకున్న నెవరికి నష్టము! వర్ణనములకన్న ముఖ్యమైన విషయమేదనఁగా, కావ్యము నందలి యఁగాంగములకుం గల కలయిక. పొత్తుపొసఁగని వర్ణనలు రసమునకుం బ్రతికూలములు. సంగీత మెపుడును హృద్యము, పాటపాడువాఁడు, మృదంగమువాఁడు, పిడేలువాఁడు గలసినట్లు వర్తించిననా దానిసొంపు, అట్లుగాక ప్రతివాఁడును ఇష్టమువచ్చి నట్లు దన యావచ్ఛక్తి నక్కడనే వినియోగింప యత్నించిననా? తనంతట ప్రత్యేకముగ వాయింపఁబడు నప్పుడెంతయో మనోహర ముగ నుండు మద్దెలమెట్టు సందర్భశుద్ధిని మీఱి వెలయింపఁ బడినచోఁ జెడ్డ రోఁతగ నుండుననుట కేమి సందేహము! అట్లే పురపుష్పలావికల వర్ణనములు వ్యష్టిని జూచిన నెంత బాగుగ నున్ననేమి! సమష్టితో సంబంధములేని కూఁతగానున్న నవి దుష్టములే. స్త్రీపురుషుల యాకారసౌందర్యములు నిట్టులే. అంగము లన్నియు వేఱు వేఱుగా శస్త్ర వైద్యశాలలోబలె విభజింపఁబడి యుండినచో వానిని గన్నెత్తిచూడ సుకుమార మానసులకు నౌనా? మఱి చెలువంపు దనమునకు జీవనమైన లక్షణము అంగముల సాంగత్యము. లోకములోనుండు వర్ణనీయాంశముల నన్నింటిని నొకచోటఁ బ్రోగుచేసియుంచిన నది సర్వవికారముల కాస్పదమైన కుప్పయగును! సీతమ్మకు ముక్కు సొగసు, రుక్మిణమ్మకు కన్నులు సొగసు, కావున నీ యమ్మ ముక్కును ఆ యమ్మ కన్నులను దీసి బ్రహ్మదేవుఁడు వేఱొక పెద్దమ్మను సృజించెను! కావున నీ మూఁడవ యమ్మ సీతారుక్మిణులకన్న రెండింతలు

సొగసుకత్తెయని వ్రాయువారికి శిల్పముయొక్క తెఱంగను వాసన యేమాత్రమైనఁ దెలియునని వచింపనౌనా? సీతమ్మ ముక్కు సొగసన్న నర్థమేమి? సీతమ్మయొక్క ముఖము మొదలగు నవయవములతోఁ జేరిక కల్గియుండుటచే, ననఁగా నా స్త్రీయొక్క యాకారముం బట్టి, యది చక్కనిదనుటగాని, యా ముక్కును గోసికొనిపోయి యింకొకచో నుంచినను నదేరీతి సొగసుగానుండునని యర్థముకాదు.

"తమ తమ నెలవులఁ దప్పినఁ
దమ సొగసులె రోఁతలగుట తథ్యము సుమతీ!"

కావున నంగీకారములేని వర్ణనలు ప్రత్యేకముగ నెంత యద్భుతములుగా నున్నను నింద్యములే. కథయను నిండుటా కృతిని దీర్పఁజాలని కవి యంగములవంటి వర్ణనములఁ దీర్ప నేర్చుననుట పిచ్చికూఁత. కావున విమర్శనముఁ జేయుటలో కథ, పాత్రములు, ప్రకృతి విశేషములు, వర్ణనములు ఇవన్నియుఁ బర స్పరమైత్రికలిగి విఱుపులులేని యేకాకృతిగా నున్నవాయను విచా రణ ప్రధానతమమని నా మనవి. కథయొక్క గమనమునకు విరోధ మైన దీర్ఘవర్ణనముంజేయుట రసవిహీనభావమున కొక గుఱుతు. భారత రామాయణ హరివంశాదులలో నీలోపము లేశమాత్రము గానము. ఇప్పుడిట వివరింపఁబడిన న్యాయము గోప్యముగాదు. చదువరులెల్ల నెఱిగినదే.

### స్వభావవర్ణన యనుటకు నిర్వచనము

పకృతిసమ్మతమైన వర్ణనము అనుమాటకు నిర్వచనము ఉన్నది యున్నట్టు చెప్పుటగాదు. ఏలన గవర్నమెంటువారి గెజట్టులో జరిగినవి జరిగినట్టు వృత్తాంతములు ప్రకటింపంబడును. అది కారణముగ నావ్రాఁతలు స్వభావోక్త్యలంకారమునకు దృష్టాంత ములని యెవ్వఁడుఁ బేర్కొనఁడు. వస్తువుల నిజస్థితి నిర్దేశించుట శాస్త్రముల యాప్సితము. కళయొక్క కాంక్ష యదిగాదు. ఎట్లన, కళలలోఁ ప్రధానమైన పురుషార్థము రసము. రసము భావమునకు సంబంధించినది. భావముఅ పరమైన దృష్టితోగణించి వర్ణించు టయే కళయందు శ్లాఘనీయమైన పద్ధతి. భావముతోఁ జూచుటకును భావము లేక చూచుటకును నెంతోభేదము. ఉదాహరణము: సుందరియగు నారీమణినిజూచి యువ్విళ్ళూరు వానికి నామె సొగసు

నిమిష నిమిషమునను వృద్ధిబొందునట్లు దోఁచుచుండును. వీనికిని ఆవేషము వృద్ధిబొందుట తప్పదు. "రాజు మెచ్చినదే రంభ" అనగా ననురాగముండునేని ఎవరిమీఁద నాయనురాగము వ్యాపించునో వారు, తదితరులకెంత కురూపులుఁగ గానవచ్చినను, వానికి మనోహరమూర్తులుగఁ గానుపింతురు. అట్లగుట యెంతయు మేలు. ప్రతివాఁడును మోహముకొలఁది సర్వోత్కృష్టురాలని భ్రమించి యెవతెనో యొక స్త్రీని వశ్యముచేసికొనఁ జూచుట యీ న్యాయము యొక్క మాహాత్మ్యమే. ఈ ధర్మము, మనుష్య ప్రకృతిని బాలించుచుండదేని, నిర్భావముగానే పక్షపాతము లేక యెల్లరు నేస్త్రీని నుత్తమురాలని నిర్ణయింతురో దానినే యందఱు వలచి సుందోపసుందులట్లధోగతిం జెంది యుందురేమో! భావముల యొక్క దృష్టికిని ఆలోచనా శక్తి యొక్క దృష్టికిని ముఖ్యమైన భేదమేమనగా; యోజనాశక్తిం బట్టి నిరూపించితిమేని సత్యమొక్కటియే. అనగా సిద్ధాంతీకరింపఁడిన తత్త్వము సర్వజనులచే సరియని యొప్పుకొనఁబడియే తీరవలయును. దృష్టాంతము గణితశాస్త్రము. ఏడును పదితో గుణించిన డెబ్బది యగుననుట నిర్వివాదము. ఎవండైనను నాకీమాట రుచింపదని యనినచో వానిని బిచ్చివాఁడందుము. కాని గోచరములయెడ భిన్నభావములున్నదని పకృతి విరుద్ధమని యెవరుఁ జెప్పరు. కావుననే "లోకోభిన్నరుచి" యనుసామెత. "ఎట్టి సౌందర్యవతియైన నేమి? లోకములోని వారెల్ల నామెయందే బద్ధమోహులు గావలెను. అట్లు చేయనివారిని బిచ్చి యాసుపత్రికిఁ బంపక తప్పదు" అని సిద్ధాంతముఁజేయఁ బిచ్చివాఁడు దక్క నింకెవఁడైనఁ గడంగునా? కావున శాస్త్రములలో నేక కంఠముగా నెల్లరును ఇది సత్యము తక్కినవి మిథ్యలు, అని స్థిరీకరించునట్లు కళలలోఁ జేయఁజూచిన రసాభాసము నిత్యము. ఒకేవస్తువు మానవుల ప్రకృతులంబట్టి యనేకులకు ననేక భావముల కాస్పదముగావచ్చును. మఱియు భావములంబట్టి కొంతవఱకును రూపమేర్పడును, గాన ననేకరూపములం దాల్చినదియు నగును. నానారూపమునం జెందియుండుట యొక్క భగవంతునికే చెల్లిన భాగ్యముగాదు. అతని సంతతివారముగాన మనకును నందు భాగముగలదు. భారతములోని దుర్యోధనునిఁ గూర్చి విచారింపుఁడు. ధృతరాష్ట్రుఁడు, అనుజులు, సచివులైన కర్ణాదులు, ప్రజలు, పాండవులు మొదలగు వివిధపక్షములవారిలో నొక్కొక్కరి కొక్కొక్క యవతారముగ నాతఁడు దోఁచలేదా.

ఒకరికిఁదోఁచినట్లు వేఱొకరికిఁ దోఁచెనా ? ఒకరి కనులతో నింకొకరు చూచు టెట్లు ? చూడఁబోయిన వస్తువొకటేయైనను మూర్తులనేకము లనుట కతఁడును సాక్షిభూతుఁడే. ఇంతేకాదు. తాను గొప్పగా నున్నపు డశ్వత్థామకు దుర్యోధను పైని గౌరవముండెనేమి ? గోగ్రహణసమయమున నతనిని ధిక్కరించినట్టి సాహసుఁడు. అట్లుండియు నా రాజరాజునకు కష్టములు ప్రాప్తించినది మొదలు ఆతనియెడ సేవాధర్మము నిర్వర్తింపవలయునను శ్రద్ధయేకాదు, నిజమైన భక్తియుఁ బ్రీతియు బుష్కలముగఁ దాల్చినవాఁడాయెను. తుదకు నమ్మహనీయుఁడు తొడలువిఱిగి పడియున్నపుడు, అతని పాటునకు నెరియు మనమ్ముతో నాగురుపుత్రుఁడు విలాపించిన విధము వినుండు.

ఉ. పాండవులట్లు మజ్జనకుఁ బాపవిధిందెగఁ జూచునప్పుడున్
జండతరప్రకోపము ననహ్యపుశోకము నిట్లు చిత్తమొం
డొండఁగలంపవే నిపుడయొక్కఁడు దక్కకయుండ వారి ను
ద్దండమదస్త్రవహ్నిఁ బరిదగ్ధులఁ జేయక యెట్టులుండుదున్!
(శల్య. ద్వి. 411 ప.)

చ. దురమునఁజెంపు చేవయును దుర్దమలీల వెలుంగుచుండ సు
స్థిరత శమంతపంచక విశిష్టతలంబునఁ బోరి సద్గతిం
బొరసెదు, నీకునై వగవు పుట్టదు, బంధులు రాజు దేవులున్
దిరియుదు రింక, వారిదగుదీనతకోర్వమి కుమ్మలించెదన్
(సౌప్తి. ప్రథ. 217 ప.)

ఉ. సీరియనారతంబుఁ దన శిష్యులలోపల నెల్లనిన్ను దు
ర్వారపరాక్రమాఢ్యుఁడని వర్ణనసేయుట గేలిసేసి ; యా
మారుతికిం జయంబొసఁగె మాల విధాతృఁడు! వాని గెల్వుకో
లేరికి నమ్మతంబగునె యిట్టిది! దీనను బెంపు గల్గునే? 218

చ. కురువర! నీమగంటిమియు? గోత్తలయున్ బలముంజలంబు దు
స్తరగతిఁబేర్చి భీమునకుఁ జావక పోవఁగరానియట్టిదై,
నరుబెదరించి కేశవుమనంబు గలంచి, యధర్మవృత్తికిం
జొరుఁడనిపంచె, దీనిదివిజుల్ గని రింకిట వేయునేటికిన్! 219

ఉ. ధర్మముమాని యూరులు గదంబొడిసేసినయంతఁబోక దు
ష్కర్ముఁడు వాయుజుండెడమకాల శిరంబటు దన్నెఁ! జూచి యా
ధర్మనుతుండు శాస్తిఁదగ దానికిఁజేయఁడ! యాతఁడెప్డునం
తర్మదదుష్టుఁ డీగెలుపు దైన్యము సేయదె కీర్తిమాయదే? 220

చ. కుడువఁగఁగట్ట బంధులకుఁ గోటివిధంబులఁ బెట్టజన్నము
ల్నడుప ననేకధర్మ విధులం బొగడొందఁగఁ జాలునట్టి యె
క్కుఁడుసిరియిచ్చి పేర్మినొకకొండగమన్చిన నీవుసావఁగా
నొడలిటులోమితిం గురుకులోత్తమ? యేనొక సేవకుండనే? 222

కావున వస్తువులనేకుల కనేకరీతులఁ దోఁచుననుమాయ యొకటి మాత్రమే కాదు, ఒక్కనికే కాలదేశ వర్తమానంబులం బట్టి యనేకవిధములఁ దోఁచుటయును స్వభావప్రభావమే. ఇక్కడ ఒక్కఁడంటిమి. వాఁడుమాత్రము వికార రహితుఁడా? కాఁడు మఱి మాఱుచుండు వాఁడే కావున భావంబులు ప్రసిద్ధిగనుండు నీ లోకములో నానావతార సిద్ధియు విశ్వరూప ప్రదర్శనశక్తియు సర్వ వస్తువులకు సామాన్యములు సహజములునైన లక్షణములు.

ఆలోచన శక్తిచే నుత్పాదితములైన శాస్త్రముల యొక్కయు భావబంధురములైన శిల్పములయొక్కయు దృష్టులువేఱు. గోచ రించు పదార్థముల తీరులును వేఱు. కావునన్నే శిల్పములు రచించుటలో స్వప్రతిభప్రకారము పోవలయునేగాని యలంకార శాస్త్రజ్ఞులు, ప్రాచీనకవులు వీరిని ననుకరించుచు ప్రతికల్పనలం జేయఁజూచుట పొసఁగరాని మతమని మున్నే చెప్పబడియుంట ఏలకో మనకవు లీనాఁటికిని రుక్మిణీపరిణయములు సుభద్రాపరి ణయములు వ్రాయుచుండుట. పాపము పెండ్లాడి పెండ్లాడి వార లలసి సొలసి విసుగెత్తియున్నారు. వారికి (పించన్) విశ్రాంతి ప్రతిపాదింపకున్న నెంతయు ఘోరము. శాస్త్రములలో నొకఁడు వ్రాసిన సిద్ధాంతముల నితరులును గ్రహించి ప్రచురింప వచ్చును. అది పునరుక్తిదోషంబుగాదు. కళలలో నుపజ్ఞలేనిది స్వారస్య ముండదు. భావముల ననుసరించి యాకృతులు వివిధభంగులఁ దోఁచుననుట స్ఫుటముగదా! అనఁగా శిల్పులచే నారాధింపఁబడు సిద్ధియేదన నున్నది యున్నట్టు ప్రదర్శించుటగాదు. మఱి కన్నది కన్నట్టు ప్రదర్శించుట. ఉన్నది యున్నట్టు, అనఁగా వస్తుస్వభావ మేర్పడియున్న భంగియనుట. ఇఁక కన్నది కన్నట్టన్ననో, మన భావముచే దాని స్వభావము చెందిన వికారముల ప్రకారము అనుట. అనఁగా నిరవధికస్థితిగాదు. మఱి భావమును అవధిచే నిర్ధారితమైన స్థితి.*

---

*తత్వజ్ఞులనేకులు భావాతీతమైనస్థితియుండియు లేనట్లే గాన మిథ్యయని వక్కాణించెదరు. నిజస్థితియనునది వస్తువుయొక్కయు మనుజులయొక్కయు ప్రకృతులు రెంటిచేతను నిర్ధారితము.

ఈ రెండు స్థితులకుఁగల భేదము వస్తువు దనంతట నెన్ని గుణములఁ దాల్చినదో యెవరు నెఱుఁగరు. లెక్కకు వచ్చునవి గోచరములు మాత్రమే. అగోచరము లుండినను నుండవచ్చును. మఱియు గోచరము లన్నియు వస్తువును జూచినపుడెల్ల మనకు స్ఫురించుటలేదు. ఏలయని యడిగితిరేని, ఏభావము మనస్సున నుచ్చస్థానము నధిష్ఠించి యుండునో యాభావమునకు సమ్మతములు, రుచికరములు, చింత్యములునైన గుణములు మాత్రము మిక్కిలి ప్రకాశమానములుగ నగపడును. తక్కినవి మునురు గ్రమ్మినట్లు వెనుకఁబడినవో యను గతి దూరస్థములైనవా యను మాడ్కిని స్ఫుటములుగా నుండవు. మఱి మాఁగుపాఱిన యవిగానో, ఆ సమయమున నేమాత్ర మెఱుకకు రానివిగానో యుండును. కారణమేమన, అప్పుడు వానిపై దృష్టినిలుపుట యగత్యముఁగాదు. సహజమునుగాదు. దృష్టివేనిపైఁ బాఱునో యవి ముందువచ్చి సమీపమున నిలిచినట్లు విశదములుగ నుండును. పరిసరముల నుండినవి యస్పష్టములు. దూరముగ నుండునవి యప్పటికి నగోచరములు. ఆ భావము పోయి వేఱొక భావము మనస్సు నాక్రమించెనేని మునుపు తేజోవంతములుగా నుండిన భాగము లంతర్ధానమై, యప్పుడు గ్రహణము సోఁకినట్లు మఱుఁగుపడి యుండిన భాగములు ప్రజ్వలితమైన యుదయముం దాల్చినవి యగును. ఇందులకు వేఱు దృష్టాంతములేల? చూడుఁడు. కోపముగా నున్నప్పు డెదుటివాని దుర్గుణముల మీఁదనే యవధానము స్థిరముగా వ్రాలును. శాంతముగ నున్న వేళ* వాని సుగుణ దుర్గుణముల రెంటిని గమనించి యాలోచనతో మంచివాఁడా చెడ్డవాఁడా యని నిర్ణయింతుము. మహానంద కాలములో నేర మొనర్చినవానిం జూచినను "ఏమో పాపము: కడుపాత్రమై దొంగిలించినాఁడు. ఇదియు నొక ప్రమాదమా?" యని పరుషములకు సరళము లాదేశమగునట్లు చేయుదుము. భావమును బ్రేరేపింపఁ జేసినవారిమీఁదనేకాదు, తదితరులమీఁద సైత మారాగసహితమగు చూపు పోకమానదు. భార్యతోఁ గలహించిన వాఁడామెమీఁద మాత్రమే గుఱ్ఱని యుండునా? మఱి చూచినవారినెల్లఁ గఱపఁ

*ఆలోచనాశక్తికి శాంతము మొత్తముమీఁద సహాయకారి. భావములు గొంతవఱకు విరుద్ధములు. శమదమాదిసత్త్వగుణములు పట్టువడినయెడల కైవల్యప్రాప్తి యెట్లోగాని కవితాప్రాప్తి నిందుసున్న. రాజసతామసగుణములు కవితయను మందాకినీమనోహరప్రవాహమునకు జన్మస్థానములైన మహోన్నతభావములు.

బోవుట పరమరహస్యమా? కావుననే కదా విద్యార్థులెల్లరుఁ బరీక్షకులకును వారి పెండ్లాలకును మనసులు గలపి చల్లగ నుండ వలెనని విఘ్నేశ్వరునకు టెంకాయలు గొట్టుట!

### సర్వలక్షణసమేతములుగా వస్తువుల నిర్దేశించుట తప్పు

ఈ మనశ్శాస్త్రతత్త్వముయొక్క యాదేశమేమనఁగా, ఎట్టిసమయములందును వస్తువుల సర్వసులక్షణములను వర్ణించుట గొప్ప యవలక్షణము. మఱి భావముల ప్రసిద్ధి ననుసరించి విక్షేపముం దాల్చిన గుణముల నధికముగను, సంక్షేపముఁ బూనినవానిని కొలఁదిగను వర్ణించి, నిక్షిప్తములైనవానిం బేర్కొనక విడుచుటయు కళకు శోభ. నిర్భావముగ వ్రాయుశాస్త్రకారుం డేవిషయమును విడువక సమగ్రముగ వస్తుస్వరూపము నిర్దేశించెనేని వానికది చెల్లినవిధమే. ఎందుకన, వానియుద్దేశము వేఱు. నిజస్థితిని నిరూపించుట వాని కర్మము. కవిపని యదిగాదు. మఱి భావములను వికాసమునకుం దెచ్చుట. దృష్టాంతము: వైద్యశాస్త్రము నభ్యసించువాఁడు మనుష్యుల దేహములోని ప్రతి సూక్ష్మవిషయమును గ్రహింపఁగోరి సాంగోపాంగముగ లోపలివానిని పైవానిని సర్వమును బరీక్షించును. ఈ రీతినే మోహముచే నంధుఁడో, అర్ధాక్షియో, యేకాక్షియోయైన నాయకుఁడు తన నాయికను జూచెనేని యీ సూక్ష్మములపై నతనికి మనసు పోవునా? పోవచ్చునా? అవి కంటఁడునా? పడవచ్చునా? యోజింపుఁడు! యోజింపుఁడనుట నాతప్పు! దీర్ఘాలోచనలేక యీ సంగతి నెఱుంగనేరరను అనుమానమున్న మీరు మనుష్యులా కారా యను ననుమానముండక తీఱదుగదా! యోచనయేల? ఇది స్వతస్సిద్ధమైన భావము. రసికుల కెల్లరకు సామాన్యము. అది లేనివాఁడు శుద్ధ మృగమో జడుఁడో! కొన్ని శృంగార కావ్యములలో నాయకులు నాయికలను బాగుగ విమర్శించి సాంగోపాంగముగ సంస్మరణ చేయుట గలదు. అట్లు చేయుట యానాయికలను డాక్టర్ల దృష్టితోఁ జూచినట్లు అనఁగా శవసమానముఁగ జూచినట్లనుట!

కావున గద్యమైననుసరే పద్యమైననుసరే, కావ్యముల వర్ణింపఁదగినవి భావోదయముచేఁ బ్రకాశమునకు వచ్చువస్తువుల కొన్ని కొన్ని రేఖలు, కళలు, పక్షములు మాత్రమే సర్వాంగ వర్ణనము భావభావనాశక్తులు సంపూర్ణముగ నింకిపోయిన పండిత మాత్రులు ప్రకృతిశాస్త్రజ్ఞుల యట్లు ఆలోచనాబలముచే సాధించెడు

నసహ్యము ? భావములన్నియు నేకకాలమున నుజ్జ్వలములుగావు. కావున నన్ని లక్షణములును ఏక్షణముననైన భావపరమైన చింతతోఁ జూచువారికిఁ గానఁబడవు. కళలయందు సర్వపదార్థములకును పార్శ్వగ్రహణము నిత్యము ! అట్లగుటఁ బ్రత్యక్షమైన రేఖలమాత్రము వివరించుట భావస్వభావములకు విరుద్ధములు. రసమునకు నాభాసకరములు.

## భావనాశక్తియొక్క లీలలు

కవితయొక్క రూపు నెఱుంగఁ గోరిన మనసుయొక్క రూపము నెఱుంగవలయుగదా! ఆత్మజ్ఞానము సంపూర్ణముగ నెవరికి నలవడఁ గలదు ! అందును నావంటి పామరునకేమి తెలియును ? ఏదో యొండు రెండు ముక్కలు విన్నవింప సాహసించితిని, కాని యీ సాహసము నెఱవేఱినదని నాకేమాత్రము నమ్మికలేదు. ఇఁక భావనాశక్తి యొక్క తెఱంగన్నో మనః ప్రకృతుల కన్నిటికన్నను గోప్యమైనది. దాని చర్యలను గణింపనేకాదన్న నిఁక నిరూపించు టెట్లు ? అయినను గొన్నింటి నాజ్ఞయైన మనవిసేసెద. భావములతో సాంగత్యముం దాల్చినది గదా భావనాశక్తి. ఇఁక భావముల సంఖ్యములు. కావుటం జేసి వానిని రంజింపఁజేయు భంగులును అసంఖ్యములే. కొన్నియెడల సూర్యోదయాది చిత్రములఁ దద్రూపముగ వర్ణించిన సొగసు. స్త్రీపురుష లమేయమైన దుఃఖమో సుఖమో దాల్చిన కాలములోఁ దగుమాత్ర ముత్ప్రేక్షించినం జాలును. కథ వేగముగ నడువవలసిన చోట నలంకారముల గుప్తములఁజేసిన నింపు. కవియే ముందునకువచ్చి చెప్పెడుచోట్ల మితముగఁ గొన్నియున్న దోషములేదు. మఱియుఁ గొన్నియెడల బ్రకృతికి మీఱిన వర్ణనములం జొనిపినను వికారము దోఁపకుండుటయేకాదు, అస్వాభావికమనియు సామాన్యముగ నెవరికిఁ దట్టవు. ఉదాహరణము. హితోపదేశము. ఈగ్రంథమున ఎలుకలు పిల్లులు కాకులు నక్కలు మొదలైన తిర్యగ్జంతువులు మనుష్యభాషణమువలె వర్ణముల మాటలాడుటయకాక, నీతివిధానము విప్పిచూపుటలో విదురుని యన్నలుగానున్నవి. ఇది ప్రకృతికి విరోధమని కొందఱు భ్రమించుట సహజమే. ఈ విచారముతో నిపుడేమి పనిగాని, యిట్లు విపరీతవృత్తులతో నిండియుండినను ఆ గ్రంథము ఒక దేశము ఒక కాలము నను మితము అడ్డును లేక యన్ని దేశములవారికి నన్ని వయసులవారికిని నిత్యహర్షముగా

నున్నదనుట యందఱకుఁ దెలిసిన సంగతియ. ఈ గ్రంథములోని కథలు హిందూదేశమునుండి పారసీకమున కాక్రమించి, యక్కడ నుండి ఇటాలియా మొదలైన యూరోపు ఖండములోని దేశములం దంతటను నాలుగువందల యేండ్ల క్రిందటనే వ్యాపించినందున నవి పారంపర్యముగ నాయా జాతులవారిలోఁ బ్రచారముననుండు గాథలంబోలె సర్వసాధారణములైనవి. చరిత్రజ్ఞానములేని పామరులు పరభాషనుండి దిగుమతియైన సారమనియైన నెన్నక తమ స్వభాషయందే యావిర్భవించినదనియు నెంచుటం దలపోసితిరేనిఁ మనవలె జాతి మత వర్ణాదుల వ్యత్యాసముకతన పూజ్యుఁడైన మనువుయొక్క సంతతివారో కారోయను సంశయమునకుఁ బాత్రులైన విదేశీయులచేతను, నీ గ్రంథమెంత గాఢముగ స్వీకరింపబడినదనుట విశదమవును. ఇట్లు లోకులెల్లరచేఁ బ్రీతితోను శ్లాఘముగాను జూడఁబడిన కావ్యము భావనాశక్తి విరహితమనికాని, తప్పుత్రోవలఁ బోయినదనికాని చెప్పవలనుపడునా? మఱియు నీ గ్రంథము నిరుపమానముగాదు. ఇట్టివి యింకను ననేకములు సమస్తదేశముల భాషలందును గలవు. మనదేశములోనే యీ హితోపదేశమునకు నెన్నియో మడుంగులు మిన్న యనందగు బృహత్కథ* యుండలేదా? భారత, భాగవత, రామాయణా†దులలోను మృగపక్షి వితానములు దేవ మనుష్య భావములం దాల్చినవి గావా? మఱియు, అస్త్రములు, కామరూపధారణము, భూత భేతాళ వశీకరణము, ఇత్యాది మహేంద్రజాలములు పుంఖాను పుంఖములుగ గ్రంథములనేకాదు తరతరములుగ తల్లి బిడ్డలు చెప్పుకొనెడు ఊఁకుడు కథలందును గానబడియెడి. శుద్ధముగఁ బ్రకృతి విరుద్ధములై యున్నయెడల వీనికిట్టి వ్యాప్తి సేకూరియుండదు. నిర్హేతుకజాయమానసిద్ధులు ప్రపంచ వ్యవహారములలో నహి! అట్లగుటఁ గారణము విచార్యము.

చూడుఁడు. చిన్న చిన్న బిడ్డలు, చీమలు, కుక్కలు, చిలుకలు, పిల్లులు మొదలగు హీనజాతి జంతువులకు సైతము నరత్వమారోపించి మాటలాడఁగోరుట, కోపించుట, స్నేహించుట మొదలగు చేష్టల నొకరు చెప్పక చూపకయ తమంత నవలంబించుట

---

*బ్ర. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు దీనిని మిగులఁ జక్కని వచనశైలి నాంధ్రీకరించియున్నారు.

†రామాయణములో నిది మితిమీఱినదని కొందఱ తీర్మానము.

సహజమేగదా ! ఇం దస్వాభావిక మేమైన నున్నదా ? మఱియు, బాల్యదశయందు లోకానుభవము వస్తు పరిచయమును దక్కువగాన, నీ కాలమున సామాన్యములని మన మశ్రద్ధతోఁ జూచునవిగూడ, నెంతో యద్భుతము లట్లు గానుపించు ననుటయు నెల్లరకు విదితమే. అగ్గిపుల్లను గీచిన నది మండుననుట మనకొక వింతయా? బిడ్డలకన్ననో యదియొక విస్మయము పుట్టించెడుమాయ: యక్షిణి! కాఁబట్టి పుల్లలపెట్టె దొరికినంజాలును. మఱుఁగునఁ గొనిపోయి గీయుట, వెలుతురు పుట్టఁగనే నవ్వుట, చేతులు దట్టఁబోయి క్రిందికి జాఱవిడుచుట! ఇట్లు నానారీతుల నాశ్చర్యమునం దాసక్తి గనుచున్నారుగదా ! ప్రకృతిం గూర్చిన జ్ఞానము లేనివారికి నిది సామాన్యము, ఇది యపురూపము, ఇది దైనందినవృత్తము, ఇది యద్భుతము అని నిర్ణయించు వివేకము సున్న. అట్టివారికి స్వాభావికము అస్వాభావికము అను తారతమ్య మేర్పడదుగాన, సామాన్యముల నద్భుతములుగను, అద్భుతముల సామాన్యములు గను బరిగణించుట సహజము. ఈ బాల్యచాపల్యము వయసు బుద్ధియు వచ్చిన మనలో నడఁగి మాయమైయున్నను బొత్తుగ నశించినదిగాదు. ఒక్కొక్కప్పు డాభావము మనల నావేశించును. అట్టి తరుణములఁ దదుచితమైన చేష్టలకు మనమును బ్రారంభించి పిల్లలరీతి నాడుకొందుము. కట్టుఁగతల వినఁగోరుదుము. లేనిపోని యద్భుతముల నెవఁడైన 'నేను గాశిలోఁ జూచితిని. ఉత్తరకురు దేశములోని మహాత్ములయెడఁ గనుఁగొంటిని' అని చెప్పిన నెంతో నమ్మికతోను ఆనందముతోను ఊఁపిరి విడువక విందుము. కావున మనసునకు నాయా భావముల యాదేశముచొప్పున సత్యమను భ్రమను గలిగించినఁ జాలు. భావనాశక్తి కృతకృత్యమే. నీతి చంద్రికను (అందును జిన్నయసూరిగారిది) చదువునప్పుడు అదేదో యొక లోకమైనట్టును, అందు పావురములు కాకులును గొట్లాడుట మాని మాట్లాడుట సామాన్యమయిన విషయమైనట్లును మనకుఁ దోఁచుననుటకు ప్రత్యక్షానుభవమే తార్కాణ. ఇట్లే పది తలల రావణుఁడు, మూఁడుతలల త్రిశిరుఁడు, ఖరుఁడు, మహిషుఁడు, జాంబవంతుఁడు, హనుమానుఁడు, వేయికన్నుల యింద్రుఁడు మొదలగు పురాణ పురుషులును, విపరీతములు సైతము సత్యము లను భ్రమఁ గల్పించు నాధారము లెవ్వి యనఁగా : (i) ఇప్పటి కాల దేశములకు సంబంధము లేనంత దవ్వులైన యుగములలోనో లోకములలోనో అట్టి కథలు నడిచినట్లు చెప్పుట. అట్లు చేసిన

మనకుం బ్రసిద్ధములగు హేతువులంబట్టి సత్యాసత్య నిర్ణయముం జేయంబూనము. (ii) ఇట్టి ప్రకృత్యతీతముల వర్ణించుచో నున్న ట్టుండి యాధునికములు సామాన్యములునైన సంగతులను వేయం గూడదు. వేసిన జాలమునకు భంగము. ఆ మాయను స్థిరముగం బోషించునట్టి వర్తమానములం బొందించుచు నేకధోరణినే యేగుట యుత్తమము. కళారచనలో గమనింపవలసిన విషయమేమన, రసాభాస మేమాత్రము గలుగనంత పొందిక యున్నదా లేదా యనుట. విషయము ప్రకృత్యతీతమైననేమి, ప్రకృత్యధీనమైన నేమి? విషయముకన్న రీతి శిల్పములం బ్రధానము.

కావున లోకులకెల్లరకు రుచ్యములుగానుండు భారతాది వీర కావ్యములయందును, కథాసరిత్సాగరము మొదలైన వినోద కథల యందును గల ప్రకృతిని మీఱిన వర్ణనలకు నాధారభూతమైన భావనాశక్తి గణనీయము గాదనుట తప్పు. మఱి యయ్యదియు మనుష్యుల యందు అనశ్వరముగ నుండు నేవోకొన్ని భావములకు సహజముగ ననుకూలములైన ప్రకారముల వర్తించునదియ యనుట యొప్పు. అట్లుగాదేని నా కథలయందు మన కెడతెగని మక్కువ యుండుటేల?

ఈకాలమున బిడ్డలెట్లో పూర్వకాలమునం బెద్దలునట్లే. అనగా ప్రకృతిజ్ఞానమంతగా లేనివారనుట. ఇదియెగదా ప్రాచీనగ్రంథ గాథా పురాణములలో మన నమ్మికకు నందని యద్భుతములు విస్తార ముగం జెప్పంబడి యుండుటకు మూలము! ఆ పురాణకవులకు నవి యస్వాభావికములుగం దోంచియుండవు గాంబోలు! వారు ఘనమైన నమ్మకము విశ్వాసమునుంచి వ్రాసిరి. కావుననే మనకును నవిశ్వా సము అంతగాం బుట్టకుండుట. ఇప్పటివా రారీతి వ్రాయంజూచిరేని యసాధ్యమని చెప్పంగాదుగాని* యెంతో శిల్పనైపుణ్యము లేనిది యవి కృత్రిమములుగా దోంచుంగాని నిక్కములట్లు భ్రమగొల్పం జాలవు. కావున నాటకములలోను గావ్యములలోను నాగాస్త్రము గారుడాస్త్రమును బ్రయోగింపంకుండుటయు మొత్తముమీద సుగు ణము. అట్లుగాదని వాని నావాహనము జేయువారు వానితో నాగ్నే యాస్త్రమును రప్పించి గ్రంథమంతయు నాహుతిగా నిచ్చినయెడ లోకమునకెంతే నుపకారము చేసినవారగుదురు!

---

* స్వభావాతిక్రాంతవిషయములం గూర్చి సత్యాభ్రమ సిద్ధించినట్లు వ్రాయం జాలు పాశ్చాత్యకవు లిపుడుం గొందఱున్నారు. ఆంధ్రమున నీప్రతిభగలవారున్నా రేమోగాని నే నెఱుంగను, వీరేశలింగంగారు దప్ప.

ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన

ఉ. "అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ శారదచంద్రచంద్రికా
డంబరచారుమూర్తి ప్రకటస్ఫుటభూషణ రత్నరోచిరా
చుంబిత దిగ్విభాగ శ్రుతిసూక్త వివిక్త నిజప్రభావ "భా
వాంబర వీథివిశ్రుతవిహార" నను దయఁజూడు భారతీ!"

యను సరస్వతీస్తవమున కవితాధిదేవతం గూర్చిన "భావాంబర వీథివిశ్రుతవిహార" యను సంబోధన మెంతసత్యము! మఱియు గంభీరము!

భావనాశక్తి యనేక మాయలం బన్ను లీలావినోదిని. ఈ మాయల కన్నిఁటికి సామాన్యలక్షణ మొక్కటియే. ఏ రసము నుత్పాదింపఁ జూచునో దానిని కవియే మనఃపూర్ణముగ దాల్చినఁ గాని చదువరులయందు అభిమతమగు చిత్తవిభ్రమము గలుగ నేరదు. భావము లనంతములు నగాధములుగాఁ బ్రభవిల్లినఁ గవియు నమోఘుఁ డగును.

కవితయొక్క గుణదోష నిర్ణయముం గూర్చిన యాధార తత్త్వములఁ గొన్నింటిని నివేదింప సాహసించితి. మన్నింతురుగాక! గ్రంథవైపుల్యమునకుం జడిసినవాడనై దృష్టాంతములఁ దఱుచుగా బొందింపనైతి. క్షమింపుడు! ఈ వాఖ్యానమునం దేలిన యంశములు:

(i) "అంతా కవులము గామా
యంతంతగఁ గందపద్య మల్లఁగలేమా?"

యని భాష మొదలగు వానిని మాత్రము కృషిచేయుటచేఁ గవు లగుదుమనుట బొంకు. (ii) శైలిభావ ప్రకాశకము. శైలి, భావము ఇవి వియోగములేని ద్వంద్వంబులు. (iii) అట్లగుట ప్రాచీనకవులు ఆలంకారికులు మొదలగువారు చూపిన జాడల ఉచితముగ నుపయోగించిన మేలు చేయునవియేయైనను, అవియే సంపూర్ణ శరణ్యములని యెంచి యా మార్గములను మీఱి యొక యడుగైనఁ బెట్టగూడదనుట కవితాశక్తికి భయంకరమైన యూహ. (iv) ఆది కవులు భాషాంతరీకరణముఁ జేసినవారుగావున నపూర్వ రచనా సామర్థ్యము వీరి కున్నదో లేదో తెలియదు. అనగా వీరి కుపజ్ఞ యేమాత్ర మున్నదనుట వివాదాంశమే మో! అయినను మీఁద వివరింపబడిన గుణములఁబట్టిచూడ కవుల లక్షణములు పెక్కులు వీరియందున్నవనుట స్పష్టము. అందును దిక్కన మహాకవియొక్క ప్రభావము అజేయంబు. అద్వితీయంబు!

## రెండవప్రకరణము

పింగళి సూరనార్యుఁడు మధ్యకవులకుఁ జేరినవాఁడు గావున ప్రాచీన గ్రంథములను ముఖ్యముగా భారతమును బహుశ్రద్ధతోను భక్తితోను బఠించియుండును. ఇందుల కమ్మహేతిహాసములోని గుంభనల జ్ఞప్తికిఁ దేఁజాలినంత సాదృశ్యముగల రచనలఁ దాఁజేసి యుంట యొక సాక్ష్యము. చూడుఁడు. కర్ణుఁడు తన యన్నయౌట యెఱింగిన పిదప ధర్మరాజు చింతించిన విధంబు :

"ఆ. అతని మేను గుంతి యట్టులకైవడి
యరయ నేను జూచి యాత్మ నెద్ది
కారణంబొ యిట్లుగా ననుచుండుదు
నేమిసేయువాఁడ నింకఁ జెపుమ !" (శాంతి. 1 ఆ.)

ఈ రీతినే సుముఖాసత్తియు మణిస్తంభుఁడు దన భర్తయని యెరుంగని దగుటంజేసి యతని నేమేమో పల్కి, పిమ్మట నతడు ప్రచ్ఛన్నశాలీనుఁడని యెఱిఁగినదై యతని నుద్దేశించి యాడిన ప్రకారము :

సీ. ♦ ♦ ♦ ♦
ఇందాఁక నెఱుఁగ నేనేమి యంటినొ మిమ్ము
ననుచుఁ గన్నీళ్ళు రా నడఁచికొనుచు,
నడపులమాటల నగవుల మీ యందుఁ
దొంటికైవడి గొంత దోఁచుచున్న.
వసుధమానిసిఁబోలు మానుసులులేరె
యనుచునుండుదు ♦ ♦ (కళా. ఆ. 4. ప. 165)

మఱియుఁ గణ్వాశ్రమ వర్ణనావసరమున నాదిపర్వములో :

"సీ. శ్రవణసుఖంబుగా సామగానంబులు నదివెడు శుకముల చదువుదగిలి
కదలక వినుచుండు కరులును, గరికరశీతలచ్ఛాయఁదచ్ఛీకరాంబు
కణముల చల్లని గాడ్పునపడివానిఁ జెందిసుఖంబున్న సింహములును
భూసురప్రవరులు భూతబలుల్దెచ్చిపెట్టు నీవారన్న పిండతతులు.

ఆ. గడఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు
చున్న యెలుకలుఁ బిల్లులునొందు సహజ
వైరివర్గంబులయు నహవానమవుడు
సూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది"

అను పద్యమును జూచి మణికంధరుని తపోవనము వర్ణించుచుఁ బింగళి సూరన్న పైరీతి ననుకరింపం జూచియు యమకమునకై స్వారస్యముఁ జెడఁగొట్టుకొన్న గతియుఁ గాంచుఁడు!

సీ. ఆవులునాకఁ గన్నరమోడ్చు పులులును బులుల చన్గుడు వంగఁబోవు లేళ్లు
లేళ్ళ చల్లాటరంజిల్లెడు హరులును హరులు గోళ్ళనుగోక నలరుకరులు
కరులకటాళివైఖరినాడు పాములు పాములఁ బాలించు బభ్రుతతులు
బభ్రుతతులప్రక్కఁ బాయనియెలుకలు నెలుకలఁ బెంచుపిల్లులునుగలిగి

భారతపద్యములోని సొగసు దీనియందు లేదు. ఏలన, అందు జంతువులకునుండు నన్యోన్యతను జూపుటలో నిష్కారణ చేష్టలు వర్ణింపక హేతుసంగతములగు చర్యల నారోపించుటయే కాదు. "భూసుర ప్రవరులు భూతబలు ల్దెచ్చిపెట్టు నీవారాన్నపిండతతులఁ గడఁగి భక్షింప" ఇత్యాది విశేషములచే నా మృగములకును ముని జనులకును గల మచ్చికను సూచించి యున్నాఁడు గాన నీ వర్ణనము మనోహరముగా నున్నది. సూరన్న పద్యములో పదములచే నర్థము నిర్ణయమునకు వచ్చినది గాని, యర్థవ్యక్తికై పదములు ప్రయోగింపఁ బడినట్లు గానము. మఱియు జంతువుల పట్టినిగూర్చి యది దానిని గీరెను, ఇది వేరొక దానిని గోఁకెను, అనుటలో మనోదృష్టికి నింపైన రూపములు ప్రత్యక్షముగఁ గానరావు. "కడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడుచున్న" యనుమాటచే నాటలో మచ్చికపడిన జంతువుల చెల్లాటములు స్ఫురణకు రాకపోవునా ?

భీష్మాటోపమును వర్ణించుచున్న భారతములోని కొన్నివచనముల ననుసరించి, కళాపూర్ణోదయములో అష్టమాశ్వాసములోని "ఇత్తెఱంగున నప్పార్థివోత్తముం డత్యంతచిత్రంబైన" ఇత్యాది దీర్ఘ వచనములు వ్రాయంబడియున్నట్లు దోఁచెడిని.

"సూరనార్యుడు కొన్నియెడల నన్నెచోడుని ననుక్రమించి యున్నాఁ"డని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు. శ్రీనాథుని వైఖరియు నీ కావ్యమునఁ గొన్నిచోట్లఁ గానవచ్చెడిని. కవులయందుఁ గాన్పించు నిట్టి సాదృశ్యములు విచార్యములైనను మిక్కిలి ముఖ్యములని భావించుట తగదు. పోలికలంబట్టి చౌర్యము నొడిగట్టుట తగదు. సందర్భము లభిన్నములుగ నున్నచోట్ల భాషయుఁ గొంత సాదృశ్యముం దాల్చుట యప్రకృతము గాదు. విషయము, శైలి యివి పరస్పర సమన్వితములు. అట్లగుట విషయ సంభూతమైన పదసాదృశ్యము కావలయునని తెలిసి తెచ్చిపెట్టు

కొన్ని కల్పనయని సంశయించుట పొరపాటు. అయినను సాదృశ్యములు విశేషించి బహుళముగ నుండిన నితరులం జూచి వ్రాసినాఁడను నిర్ణయ మనివార్యము. "పిల్లవసుచరిత్ర"ము లనంబడు నిటీవలి ప్రబంధము లన్నియు రామరాజ భూషణుని బిచ్చములు కావా ?

ఇట్లు మన సూరన యుత్కృష్టులైన గ్రంథకర్తల జాడల నెఱిఁగినవాఁడయ్యుఁ గొంతవఱకు నంత మంచివి గాని మార్గముల నవలంబించియున్నాఁడు. దీనికిఁ గారణమేమనఁగాఁ ఎట్టివాఁడును దన కాలములో శ్రేష్ఠములని యెన్నంబడిన రీతుల విరచింపఁ జూచుట సహజము. సమకాలికుల మెప్పులువోలెఁ దీపియైన మెప్పు లెవ్వి ? మఱియు మనకవి మిగుల బీదవాఁడు గాబోలు ! ఈ యనుమానమున కాధారములైన యంశములు గొన్ని శ్రీ వీరేశలింగము గారి కవి చరిత్రలో సూచింపఁబడి యున్నవి. కుటుంబ రక్షణార్థము ద్రవ్యార్జనమునకై యత్నించుట దోషమా ? కాదు. ఆ కాలమున నిప్పటియట్లు ప్రజలు పుస్తకములఁ గొనుటచే నాదాయము గడించి జీవింపఁ జూచుటకు వీలు శుద్ధముగ లేమింజేసి, యితఁడు రాజుల నాశ్రయింపవలయు విధికిలొంగిన వాఁడాయెను. బమ్మెరపోతన వలె "మదంబ నిను నాఁకటికిం గొనిపోయి యల్ల కర్ణాట కిరాట కీచకులకమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ" యని చెప్పఁజాలిన ధీరులు వేయింటి కొకరైన నున్నారో లేరో ! రాజాశ్రయమున బ్రదుకుపాటు గోరువారు వారి ఇష్టానుసారము వ్రాయక యేమిచేయుదురు ? ఇఁక రాజులన్ననో పరిపాలన కార్యములఁ దగిలి కాలంబు గడుపువారు. సొంతమగు బుద్ధితో విమర్శింపఁ జాలినంత పండితులగుట యరిది. కావున నట్టివారాచారముంబట్టి గుణదోషనిర్ణయముం జేయుట నైజము. సూరనార్యుని కాలములో ప్రాచుర్యమునకు వచ్చిన కవితారీతి ప్రబంధ రచన. అట్లగుటఁ దానును బ్రబంధధోరణినే వ్రాయవలసిన వాఁడయ్యె. ఐనను భావగంభీరుఁడును వివేకవంతుఁడును అగుటంబట్టి సంపూర్తిగ ప్రబంధరీతి కూపంబునం బడలేదు. ఒక యడుగు గట్టున, ఒక యడుగు పల్లమునఁగా నిలిచి, తన యిష్టమునకు రాజుల యిష్టమునకును రెంటికిని మధ్యమున, సంపూర్ణముగ నిగ్రహముగాని యనుగ్రహముగాని లేని, త్రిశంకుస్థానమున నిలిచెను. "అన్య మనముల్", నొప్పింపక తానొవ్వక తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు" గదా ! ఈ కవి ధన్యుఁడాయెనో లేదో అయన లెక్క పుస్తకములు మనకు జిక్క

లేదు గాన స్థిరీకరింపనేరము! ఎదియెట్లుండె కవితాస్వర్గమునఁ ద్రిశంకుస్థితిం దాల్చియున్నాఁడు! అయినను దలక్రిందుగా వ్రేలాడుచుండలేదు. తల మీఁదుగనేయున్నది. కావున నెల్ల విధముల మనకు సంభావనీయుఁడు. తనకు శరణ్యులైన ప్రభువుల చిత్తవృత్తి ననుసరించువాఁడనుటకుఁ గళాపూర్ణోదయము నుండియే యొకదృష్టాంతముం జూపవచ్చును. చూడుఁడు. కృతికర్త శైవుఁడు. దీనికి నితఁడు దార పుత్రాది బాధలేని యౌవన కాలములో వ్రాసినదని యూహింపఁదగిన రాఘవపాండవీయములో నితనిఁగూర్చి చినవేంకటాద్రి చెప్పిన యీ పద్యమే సాక్షి:

ఉ. దక్షతయింతగల్మి విశదంబుగఁ గాంచియు నీ మదిన్ ఫలా
పేక్షమనంబుగామి నిది యిట్టనగొంకెద నీకుపో లలా
టేక్షణభక్తిశీల, రచియించుట కష్టముగాదె శ్రీవిరూ
పాక్షున కంకితంబుగ శుభార్థము రాఘవపాండవీయమున్.

ఇఁక భర్తలైన నంద్యాలవారన్ననో వైష్ణవముకొంత ముదిరిన మహనీయులు! "శ్రీ విష్ణుపదభక్తిచే ధర్మసంపత్తి ధర్మసంపత్తి చేతను జయంబు" వడసిన పుణ్యులు. అందును గృతిపతియైన కృష్ణమహీపాలుఁడు "మాధవ పదపద్మసమారాధన విధిసాధితావిరత భద్రుండు" ఇంతమాత్రమా; "విశ్రుత తిరుమలతాతాచార్య శ్రేష్ఠాన్వయ సుదర్శనాచార్య తనూజ శ్రీనివాసగురు చరణాశ్రయణ సమార్జితాఖిలాభ్యుదయుఁడు!" మఱియు "వైష్ణవమతశీలుఁడు" కావుటంబట్టి రాఘవపాండవీయ ప్రభావతీ ప్రద్యుమ్నములలో శివస్తుతితోఁ గావ్యారంభముం జేసిన భక్తుఁడు కళాపూర్ణోదయమున విష్ణువునకు నగ్రార్చనంజేసెను! మరియు మణికందరుని తీర్థయాత్రను వర్ణించుచో విష్ణుస్థలములఁగూర్చి ప్రసంగించెఁగాని శైవస్థలముల నంతగాఁ బొగడలేదు. అచ్చోట్లను, తక్కిన శాస్త్రముల నెల్ల నాకలించి "యవి యాత్మలమెచ్చని పాంచరాత్ర సిద్ధాంత విధాసమర్థన సమర్థకృతార్థ మతి ప్రదీప్తులును" "శ్రీమహితాష్టాక్షరీ జపమంత్ర పరాయణులును" "దేవతాఁతర చింతనావిదూరులును" నీతనికిఁ గానవచ్చిరేకాని, శైవసిద్ధాంత సమర్థకులుగాని, పంచాక్షరీ జప పరాయణులుగాని యొకరైనఁ గంటఁబడలేదు. తుదకు వైష్ణవ మతముయొక్క ప్రధానతత్త్వమును బోధించుచు "లక్ష్మీనారాయణ సంవాద"మును జూపి ప్రబంధమును ముగించెను! పాపము! దారిద్ర్యముచేఁ గుందింపఁ బడనివాఁడెవఁడు; ఇట్లు యౌవనమున

స్వాతంత్ర్య మవలంబించియున్నను మధ్యకాలమున దారపుత్రాది పోషణమునకు విలులేక చాలకాలము పారతంత్ర్య ప్రవృత్తుఁడై యుండి విసిగినవాఁడౌటఁ గాఁబోలు వార్ధక్యమునందు ప్రభావతీ ప్రద్యుమ్నమున స్వాతంత్ర్య మవలంబించుటయ కాదు, గంభీరముగ నిట్లు వాక్రుచ్చుటయు :

"మ. జనముల్మెచ్చఁగ మున్రచించితినుదంచద్వైఖరిం గారుడం
బును శ్రీరామవపాండవీయముఁ గళాపూర్ణోదయంబున్ మఱిన్
దెనుఁగుంగబ్బము లెన్నియేనియును మత్పుత్రాదివంశాభి వ
ర్ణనలేమింబరితుష్టి నాకవియొనర్పంజాల వత్యంతమున్"

ఈ పద్యముం జదువునపుడు కవి యాదిని బడినపాట్లకు దుఃఖమును, తుదకు నిరంకుశక్రీడకుం జొచ్చెఁగదాయని సంతసమును బొందక మానము. ఈధైర్యమహిమచే నితఁడు సర్వజన శ్లాఘనీయుండ.

కళాపూర్ణోదయము వ్రాయుతఱిని ఒక్క కాలమును మాత్రమే ప్రబంధశైలియం కాదు, రాజుల నాశ్రయించిన వాఁడగుటచేఁ దనాదరముగలవాఁడయ్యుఁ గొంతవఱకు నాశైలి ననుక్రమించెనని విన్నవించితిని. కావున ప్రబంధముల చందముంగూర్చి యించుక దిక్ప్రదర్శనముగ వ్రాయుట యుక్తము.

## ప్రబంధలక్షణ విమర్శనము

రామరాజభూషణుఁడు వసుచరిత్రలో వాక్రుచ్చిన ప్రకారము:

"ఉ. కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
హావిరిఁబుట్టురత్నము, లవారిత సత్కవికల్పనావిశే
షావహ పూర్వవృత్తములు సానఁదీఱిన జాతిరత్నముల్
గావున నట్టిమిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్"

దీనింబట్టి వితర్కించిచూడ నాకాలమువారు రచనల కన్నిటికి ప్రబంధములు శ్రేష్ఠములనియు, ప్రాచీనకవుల కావ్యములకన్న ప్రశస్తములనియు నెంచినట్టు లనుమానమయ్యెడి. ప్రబంధము స్వకపోలకల్పితముగానున్న నదియొక దోషమట! శుద్ధముగఁ బూర్వవృత్తముగానున్న నదియు సరిపడదట! కథ ప్రాచీనముగాను వర్ణనలు నవీనములుగాను నున్న సానపెట్టిన జాతిరత్నములవలె నిగనిగలాడునని రామరాజభూషణుని యభిప్రాయము. ఈ సిద్ధాంతమ

యనివార్యమని యెంచితిమేని, కళాపూర్ణోదయము కేవల కవికల్పితమైన కథగావునఁ బ్రబంధములలో చేరనిదగును. ఈ బహిష్కారము కష్టముగాదు! నష్టముగాదు! మఱి గొప్పతనమున కొక కారణమనియుఁ జెప్పవచ్చును.

ప్రబంధములేమో నూతనమైన మహాసృష్టియని మనపూర్వులు భ్రాంతిఁ గొన్నట్లున్నది. కృష్ణదేవరాయలు మను చరిత్రకారుని "ఆంధ్రకవితాపితామహుఁ" డను బిరుదంబుతోఁ బూజించెను. అనఁగా కవిత్వమును సృష్టికిఁ దెచ్చినవాఁడని ధ్వని! అల్లసాని పెద్దనకుం బూర్వ మొక కవిబ్రహ్మ యుండెఁగాని వానిని మనవారు మఱచిరో, స్థానభ్రష్టునిఁజేసిరో, లేక యొక్కొక్క మన్వంతరమున కొక బ్రహ్మ యేర్పడుట మంచివిభాగమని యెంచిరో! నాకుంజూడ ప్రబంధములును భారతాదులఁ గొంతవరకుఁ బోలియున్నవి గాని పరమాపూర్వములుగావు. ఎట్లన: ఈ రెండువిధములైన రచనల యందు.

కథ ప్రాచీనము. భారతము మూలమునకు ప్రతిపదార్థ టీక గాదు. మఱి రససంపోషణార్థము కవిత్రయమువారు కొన్నియెడలఁ బెంచియుఁ గొన్నియెడల సంక్షేపించియు వ్రాసియున్నారు. ప్రబంధములు మాత్ర మేమియెక్కువ? నిజమే. వీనియందు వర్ణనలు బహుళముగ నున్నవి. పూర్వకవులు నాలుగు పద్యము లెక్కువ యను సందర్భమున వీరు నలువది యున్నను జాలదని ఘోషింతురు! ఈమాత్రము పరిమాణభేద మున్నంతనే వస్తుభేద మున్నదనుటెట్లు? అనఁగా ప్రాచీనకవులయు మధ్యకవులయు గ్రంథములకు భేదములు లేవని నా తాత్పర్యముగాదు. మఱి ప్రబంధములు మూలరహితములైన యాదిమ విధానములు గావనుట. ఈ సృష్టి యందును ప్రాఁతవాసనలు లేకపోలేదు. ఇంక భేదముల వివర మెట్లనిన:

ప్రబంధములలో కథ ముఖ్యము గాదు. మఱి వర్ణనలకు నవకాశ మబ్బుటకై తెచ్చిపెట్టుకొన్న నెపము. అనఁగా వర్ణనలు కథాసాంగత్యము లేనివనుట, సందర్భశుద్ధి లేనివనుటకు పర్యాయ వచనము.

కథ ముఖ్యము గాకపోవుటమాత్రము గాదు. ఒకేయంత్ర శాలలోఁ జేయఁబడిన సరకులవలె నీ కథలన్నియు నించుమించు నేకస్వరూపముం దాల్చిన యవి. అనఁగా చర్వితచర్వణమునకు

జేరినయవి. *వీని సామాన్యకథాక్రమం బెట్టిదనిన.

ప్రబంధముల కథాసారము

ఒక పట్టణము ఒక రాజు. వీరికేమి గ్రహచారముపట్టినదని తెలియకముందే ప్రథమాశ్వాసము సంపూర్ణము. చెవియో కన్నో జ్ఞానేంద్రియముగ రాజుగారు కన్యామణి యొకటున్నదని గ్రహించి యెందు మతి కొంచెమును గోలుపోవుట. తన స్నేహితునితో విరహ విషయమైన ప్రసంగము చేయుచుఁ గన్యామణి శరీర మేమాత్రము విడువక విమర్శించుట! వేఁటకుఁ బోవుట ఇత్యాదులు. ద్వితీయాశ్వాసము ముగిసెను. కన్యామణి మాత్ర మూరకుండునా యేమి? ఆ యమ్మ తబ్బిబ్బు ఇంతంత యని చెప్పఁగాదు. శ్లేషలు వెట్టన నేమి తృప్తి! శ్లేషలు వెట్టినఁ గొంత పర్వాలేదు. తనవలెనే చంద్రముఖులైన చెలికత్తెలం జేర్చుకొని నాయకుని సౌందర్యవిషయమయి యొక రెండుగంట లుపన్యాస మిచ్చువేళకు మూఁడవయాశ్వాసము ముగింపునకు రాకేమిచేయును? కన్యామణియొక్క కాఁకకు నుపశమనము చేయుటకై చెలు లామె నుద్యానవనమునకుఁ బిలిచికొని పోవుట సరోవర సందర్శనము. ఆ ప్రొద్దుమాత్ర మందఱును స్నానముఁ జేయుట, చన్నీళ్ళువడు వేళకు గగుర్పాటు వణఁకు మొదలైన శృంగారావస్థలు తిక్కెక్కినట్లు ప్రబలుటయు, యజమానురాలిని చివురుటాకుల శయ్యపైఁ బరుండఁజేసి వస్త్రములు సడల్చి శైత్యోపచారములు చేయుటయు, నవియు నిష్ఫలంబగుటయు, చంద్రోదయ వర్ణనము. ఏమో వినోదము చూతమని వచ్చిన చంద్రుని నా శుకపికవాణు లందఱుఁ గలసి యేకకంఠముగఁ దిట్టుటయు, మలయమారుతమన్మథదూషణము మొదలగు నోరూరఁజేయు సంగతులు గలిగి

"క. సర్వజనంబులు చదువ న
ఖర్వంబగు కౌతకంబుఁ గాంచెడు తెఱఁగుల్
పర్వంగఁజేసి నాల్గవ
పర్వంబది యస్తమించు భామినులలరన్!"

---

*మనుచరిత్రము వసుచరిత్రము వీనికి నడుమ వ్రాయఁబడిన గ్రంథములును ఇంత గుణశూన్యములుగావు. ప్రబంధధోరణి మిక్కిలి ప్రకటనమునకు వచ్చిన తదనంతరకాలపు గ్రంథములు హీనములు. చేమకూర వేంకటపతి కృతులు దప్ప అను సమయము గూఢము.

ఇంతైన వెనుకఁ బెండ్లికాకబోవునా! సూర్యోదయ వర్ణనము (కారణము మృగ్యము) ఇంక నెవియైన మఱచిపోయియుండిన నిదే సమయమని యీ యన్నివర్ణనములును, పరిణయము, దంపతులు పురప్రవేశము చేయుట, ఆ పురములోని స్త్రీలందఱుఁ దొట్రుపాటుతో వీరినిఁ జూడవచ్చి బదులిచ్చుటకో యనం దమ యంగ సందర్శనము అందఱకును జేసి ఋణవిముక్తులగుట! శయ్యాగృహ ప్రవేశము. చెలికత్తియలు క్రొత్తగా సిగ్గుదాల్చిన కన్యామణికి నింపైన నీతులు చెప్పుట, ప్రథమసంయోగముయొక్క సాంగోపాంగ వర్ణనము! శ్రుతి ఫలము సంతానప్రాప్తి! ఇత్యాది నానా చిత్రములం బ్రదర్శించి యైదవయాశ్వాసము సమాప్తిఁజెందును. ఈ విషయమునే ఆఱాశ్వాసముల గ్రంథముగా వ్రాసినను బాధలేదు. అయ్యాది కష్టనష్టములకు నతీతము లాభమునకు నతీతమే!

పాత్రములన్నియు నొక్క తీరుండాల్చిన బొమ్మలు. అలంకారశాస్త్ర ప్రకారము చెక్కఁబడినవి. ఆ యా కావ్యములలోని పాత్రములు నిర్జీవముల యట్లుండుటతోఁ బోయిన నెంతో పుణ్యము! అవి కావ్యముల యందలి పాత్రలును ఒండొంటి ననుకరించునట్టి ప్రతిబింబములు. పేరు ఊరుమాత్రము మార్చియుందురు. ఇంక నీమాత్రముఁ జేయక వ్రాయఁగడంగనగునా? స్వభావము, చరిత్రము, నడవడి, తీరు మొదలగు లక్ష్యగుణము లన్నియు నెరవలి సొత్తులు.

### వసుచరిత్ర

ఉపజ్ఞ మనకు ఘటిల్లదేని యది యొక గొప్ప లోపమని చింతించుట మన ప్రకృతి. రామరాజభూషణుఁడు కథాకల్పనమందు ఉపజ్ఞ లేకుండిన నెంతో మేలని యాదేశించెనుగదా! ఇది యస్వాభావికమైన తలపోఁత. వర్ణనలయం దుపజ్ఞ వ్యాప్తికివచ్చిన గృతికి సానవెట్టినట్లని యాఁతడు సెలవిచ్చి, యా పద్ధతికి నిదర్శనము నేర్పఱుచుటకో యనఁ దన రచించిన వసుచరిత్రములో నత్యద్భుతములు ననన్యసాధ్యములునైన వర్ణనలు బహు చమత్కారముగఁ జేసియున్నాఁడు. ఈ మహాకవి చందమునఁ గొన్ని రకముల వర్ణనములు చేయువారెవరును లేరు. ఈ వర్ణనలయందు దోషములు లేకపోలేదు. అందు ముఖ్యములు: అవి కథా వేగమునకు నడ్డులు. కథయేలేదు, కథావేగ మెక్కడిది యని యాక్షేపించితిరేని నాకుసమ్మతమే. ప్రత్యేకముగ జూచిన మనోహరములై

నను గథాంగములతో పొందికలేనివి. భావనాశక్తిచే నప్రయత్నము నన్గళమునుగా వచ్చిన స్వచ్ఛంద ధారలుగావు. మఱి సామ్య శక్తిచే బలాత్కారముగఁ దేఁబడిన యుపమోత్ప్రేక్షలు. సామ్య మంటిమి. వసుచరిత్రములోని సామ్యములు వస్తుస్వభావములం బట్టి తటస్థించినవియుంగావు. మఱి నామాది భాషాశక్తిచేఁ గృతము లైన యవి. శ్లేషచే నుత్పత్తికి వచ్చు నలంకారములవలె గొడ్డువారిని నీరసభావములు వేఱొండు లేవని వక్కాణింప నుద్యుక్తుడనై నందులకు మీ క్షమాపణము వేఁడెదను. ఇన్ని లోపములుండి నప్పటికిని వసుచరిత్ర మిగుల గొప్ప గ్రంథమనియు, భాషకు మండనాయమానమనియుఁ జెప్ప నెవడును సంకోచింపఁ బనిలేదు. ఇందుఁ గారణము లెవ్వియనఁగా: భాషాజ్ఞానమున కిది మంచి యాధారము. పదములలో నెంత సత్తువ యున్నదని చూడగోరువారికి దీనియంత ప్రయోజన కారియగు గ్రంథ మింకొకటి లేదని చెప్పవచ్చును. మఱియు సామ్యశక్తివలె గవితకుఁ బ్రాణంబు గాకపోయినను సమ్మాన్యార్థములైన శక్తులలో నొకండు. కావున దాని నమేయంబుగ దీపింపఁజేసిన రామరాజభూషణుఁడు సర్వజనస్తోత్రపాత్రుఁడు. ఇట్టివర్ణనల కితం డించుమించు ఆదిమ కర్త యగుటచేనవి యొకరి ననుసరించి వ్రాయబడినవిగావు. తన మనస్సున తొలుతఁ బుట్టినవి. అట్లగుటచే నైజములు. అకృత్రిమ ములు. కాన రుచ్యములు. ఆనందకరములు. శ్లేషాది దుష్కర దుర్నోధ రచనలకుం బూనినను శైలి మంజులగుణముం గలయది. అతిశ్రావ్యము. సాధారణముగఁ జమత్కారము విపరీతముగ నున్న యెడ సుఖముండుటయరది. దృష్టాంతములు. ఏకాక్షరపద్యములు. ఇందులో సుఖ మేమైనఁ గలదా? సంగీతములోఁ దలవంపులగు నట్లు దీర్ఘాలు దీయుచు స్వరములు వేయుచున్న యెడ "అబ్బా! ఏమి సామర్థ్యము! ఎంతసేపు గ్రుక్కపట్టుచున్నాఁడు!" అని ఆశ్చర్యము భరింతుము గదా! ఆశ్చర్యమునకు సమానమైన యానంద మెక్కడిది! కంఠ వ్యాయామ మింత ఘనముగచేయ లేకున్నను సొంపుగా మధురకంఠముతో సామాన్యులైన స్త్రీపురుషులు పాడిన నెంతహాయి! అనగా కళయందు రెండు గుణములుఁ జూపించవచ్చును. సుఖము, చమత్కారము. శిల్పముయొక్క యభిమతము సుఖముగాని చమత్కారము గాదని వేఱ చెప్పనేల? వసుచరిత్ర చమత్కార ప్రధానమయ్యును సుఖమును బొత్తిగాఁ బోఁగొట్టుకొన్నదిగాదు. కావుననే దానియందు మనకుండు గౌర

వాదరములు. కేవలచిత్రకవిత్వము భాషతోఁ జేయు కుస్తీవంటిది. "భాషను ఎన్నివిధముల వంగదీసినాఁడు! ఎన్ని బంధముల ద్రుక్కించినాఁడు!" అను నాశ్చర్యమును బుట్టించును. నిజమైన కవిత గలిగించెడు నాశ్చర్యము వేఱు. ఏదన "సర్వజనవేద్యములగు సామాన్యములైన ఈ సంగతులు పదములు ఇత్యాది సామగ్రులఁ గొని యెంత యాహ్లాదకరమైన కృతిగాఁ గూర్చినాఁడు! మనకు నాపదములు తెలియుఁగదా! సంగతులు దెలియునుగదా! తెలిసి యేమి కట్టుకొంటిమి!" అని చింతయు విస్మయమును దాల్చుట. దొమ్మరివాఁడు చేయు నద్భుతములనుజూచి మనము చింతఁ దాల్పము. ఏలన, పరిశ్రమముఁజేసిన మనమును వానివలె సమర్థుల మగుదుమను నమ్మిక గలదుగాన. తిక్కననుం దలంచి నపుడు నాబ్రతుకేలయని మన మనుకొందులకు! "దినదినము వాడు పదములతోనే యతఁ డెట్టికూర్పులం బన్నినాఁడు! ఇది పరిశ్రమచే వచ్చువిద్యకాదు. స్వాభావిక ప్రతిభ. ఇంకొక జన్మ మెత్తినగాని యీడేరునట్టిది గాదు!" అనువిచార ముద్బుద్ధము గావుటచే.

వసుచరిత్రములోని కొన్ని పద్యములు చిత్ర కవిత్వముం జూచినఁ బాఱిపోవలయు ననువారి సైత మాకర్షించునంత రమణీయములు. ఇంచుక యుదాహరణముఁ జూపెద:

చ. చలిత లతాంత కాంతియను చందురు కావి చెఱంగుదాఁటి స
మ్మిళిత వయోవిలాసముల మీటిన విచ్చు ఫలస్తనాగ్రముల్
వెలువడఁ గప్పెఁ దక్షిణమ వేల్లితదోహద ధూపధూమ కుం
తలముల విచ్చి దాడిమ లతాలలితాంగి నృపాలు చెంగటన్.
(1 ఆ. 164 ప.)

సీ. ధరయే యపాంసుల తలచూపరాకుండఁ
దనకూర్మి ఱేని నప్పుననె ముంచె
సతియే యచండిక పతిఁ జట్టుకూఁతురై
జగడాలు పచరించి నగముచేసె
కమలయే నిశ్చల రమణుపేరెదకు మో
పైనిల్చి యతని పేరడుగుపఱచె
వాణియే మితసూక్తి వదలదు తలవాఁకి
లి నిజేశుమాట మోచెననఁజేసె,

ఆ. ననుచు భూకాంత శ్రీకాంత హరునికాంత
నజుని కాంతను నిరసించి యా సిరంగ

పార్థివుని కాంత తిమ్మాంబ పతికిఁ గుశల
కీర్తి బలవృద్ధి నిర్మలస్ఫూర్తు లొనఁగు. (ఆ. 1. ప. 36)

సీ. చుట్టఁ జుట్టుకొని శేషుఁడు నిద్రవోవును
ముది పన్నగములలో మొదటివాఁడు
మొనయుఁ డాదిమ కూర్మము ముదుంగుమేనుమో
పినఁ బెద్దవారిలోఁ బెద్దవాఁడు
సమధికాశాప్తి హస్తము సాఁచుఁ బద్మిని
వైరిదిక్కరి తలవడఁకువాఁడు
తనయొంటి పంటిచేతనయంటునాదికా
లము ఘోణి పాండురోమములవాఁడు

ఆ. కదలలేఁడద్రి బహువయః క్రమమువాఁడ
టంచు వారల నిరసించి యవనికాంత
తనభుజాదండమున నుండఁదనరుచుండు
భావజవిభుండు వేంకటక్ష్మావరుండు. (ఆ. 1. ప. 81)

సీ. మోహాపదేశ తమోముద్రితములైన
కనుదమ్ముల హిమాంబు లునుపరాదు
శ్రమబిందుతార కాగమఖిన్నకుచకోక
ములఁ జంద్రనామంబుదలఁపరాదు
పటుతాపపుటపాక పరిహీణతను హేమ
మికఁ బల్లవపుటార్చిఁడఁగ రాదు
శీర్యదాశావృంత శిథిలతానులతాంత
మసియాడ వీవనల్వినరరాదు

తే. లలన కౌశంగ కీలికీలాకలాప
సంతతాలీఢ హృదయ పాత్రాంతరాళ
పూరితస్నేహ పూరంబు పొంగిపారలఁ
జల్లని పటీర సలిలంబు నల్లరాదు. (ఆ. 3. ప. 210)

ఉ. కొండఁటవిల్లు వేదలలకుండలిరాజఁటనారి, యమ్మనం
తుండఁట, బైటిపల్లియలు దున్మినవాఁడఁట యొండురెండు భ
గ్గుండిది నిండుపౌరుష మొకోయని గెల్వవెముజ్జగంబు ను
ద్దండత నొక్కతుంట విలుదాలిచి యంటినఁ గందు తూపులన్!
(ఆ. 3. ప. 202)

ఈ విషయ మిట్లుండె. కథావిషయమున నుపజ్ఞయావశ్యకము గాదని గురువు చెప్పె. అతని శిష్యులనందగు తరువాత ప్రబంధ కవు లెల్లరు వర్ణనలంగూడ నుపజ్ఞ పనిలేదనియేమో, వసుచరిత్ర లోని యూహలన యనుసరించువారై బిల్ల వసుచరిత్రముల ననేక ములం బ్రకటించి, యాకార్యములందు రోఁత హెచ్చించి గురువు నకుం గూడ లఘుత్వ మాదేశమగునట్లు చేసి కవిత్వము భావ సంబంధము లేని పదసంబంధిగా నొనర్చి పాడునకుం దెచ్చిరి.

## ప్రబంధముల నాటకసరణి మృగ్యము

ప్రబంధములలో నాటకకౌశలము మృగ్యము. పాత్రోచితమైన భాష శ్లేషబంధురములైన కావ్యములలో మందునకైన దొరకునే! చెలికత్తె నోరు దెఱచిన నేమి గన్యామణి నోరు దెఱచిన నేమి? బయట బడునది శ్లేషయే! శ్లేషను, అందును అభంగశ్లేషను, ఘటింప వలయునన్న సాంస్కృతిక శైలి యుండియ తీరవలయును. ఏ రసము నే భావమును వెలయింపఁ బూనినను దీర్ఘ సమాసములతోఁ జేయుట విధి. ఏక సమానమైన వృత్తముల నేడ్చునప్పుడును బ్రయోగించు కోమలాంగులఁ దలఁచుకొన్నచో వారి శ్వాసకోశము లెంత ఘనములని యాశ్చర్య మయ్యెడిని!

## ప్రబంధములకు దేశక్షయమునకు గల సంబంధము

శ్రీకృష్ణదేవరాయల కాలములో విజయనగరమెంతో విఖ్యాతి గాంచి యుండెను. రాయచూరు మహాయుద్ధమున హిందువులు మహమ్మదీయుల నోడించి వారి రాజ్యములం బ్రవేశించి యడ్డులేని యధికారము వెలయించువారైరి. దేశమునఁ బౌరుషము దేదీప్య మానముగా నున్నందునఁ గావ్యములయందును నది ప్రతిఫలింపక పోలేదు. రాయల కృతమైన యాముక్తమాల్యద, మనుచరిత్ర, పారిజాతాపహరణము, కాళహస్తిమాహాత్మ్యము వీనియందెల్ల నవ్యత యను గుణమున్నది. మఱియు గొన్ని కొన్ని భావములు కవి నిండు హృదయంబుతో వ్రాసియుండుటయుఁ దేటతెల్లంబు. తాళికోట యుద్ధమున హిందువులు పరాజితులైరి. మహమ్మదీయులు విజయ నగరమును ధ్వంసముచేసి పాడుగోడలు తప్ప నింకెవ్వియు నందు నిల్పకపోయిన వెనుక దేశమున నరాచకము ప్రవర్తిల్లెను. చిల్లర పాళయగాండ్రు స్వతంత్రులైరి. విచ్ఛేదము దౌర్బల్యమునకు మూలముగదా! అంతటితో హిందువులు మఱలనైనఁ బగసాధించి

నష్టమును బూరించుకొందమను నాశను వదలుకొనిరేమో! ఇట్టి పశ్చాత్తాపకాలమున బుద్ధి యెట్లుపారును? హృదయ మే యానందము దొరుకునని వికసించును? కావున నన్నిశక్తులుఁ బోయి పండితులకు నేకశక్తియైన జ్ఞానశక్తి మాత్రము మిగిలెఁ గాఁబోలు! అసలు పూర్తిగా నడుగంటని వసుచరిత్ర కాలములో నున్నంత ప్రజ్ఞయు, మగంటిమియు తరువాతి నాళ్ళవారమైన మనకు నందరాని వైనందున నేమో రసహీనములు, ఏకక్రమములు, అనవ్యములునైన కావ్యములు పుంఖానుపుంఖములుగ వెడలినవి! ఇవియు లేకపోయియుండిన దేశము పరిపూర్ణాంధకారముపాలయి యుండుఁగాన, నీ మాత్రము వెలుతురైన నిలపినందులకుఁ బండితులను బాళయగాంత్రను మనము కొనియాడవలయు.

ఐరోపాలో రాజులు నాశనమెత్తినను ప్రజయను నింకొక ప్రకృతి ప్రతాపవంతమై యుండుఁగావున, కవిత కేవలము నగరి నాశ్రయించి బ్రదుకు విద్యగాదు. హిందూదేశములో మనుస్మృతి దెబ్బ దగిలిన నాఁటినుండి ప్రజ యీావఱకును లేవలేక పడియున్నది. దానిది పరాశ్రయమైన బ్రతుకు! కృష్ణదేవరాయలు, శివాజీ వీరిం బోలిన మహనీయు లవతరించిరేని, జనసామాన్యమును వారివెంట కుక్కలగుంపువలెఁ బోయి యెవరిమీఁదఁ బడుమన్నను బడును గాని, నాయకులు లేనిచో దిక్కులు దెలియక మరలఁ బ్రాచీన కర్మమును బారంపర్య హీనస్థానమును అవలంబించును.

"క. ఏమీ! రాజులు మంత్రులఁ
దామతి దుర్బుద్ధులైన ధరయెల్లను గ్రిం
దై మాఁడి మడియునో! జన
సామాన్యము సంఘచరిత చక్కనిదైనన్."

మనవారిలో సంఘచరితమను భావమే యున్నదో లేదో! భావమేలేనిది ప్రవృత్తి యెక్కడిది? తమతమ కుటుంబములయు, తెగలయు క్షేమచింతయేగాని రాష్ట్రము గూర్చిన చింతలు లేని వారగుటం జేసి, వీరి ప్రారంభములచే దేశమున కేమాత్రము మానప్రాణరక్షణములు సమకూఱవు. అట్లగుట వీరి కృత్యములు గంభీరోద్యమములు. వీరిచేఁ దెలివియు విరివియుఁ గాంచు కవిత సాధారణ జనులపై నేల దృష్టియుంచును? తన కడుపుమీఁదఁదప్ప నింకెద్దానిమీఁదను గన్ను మనసుఁ బోనివానిపైఁ బరుల కన్నులు మనసులు నేలపాఱును? చీయని వాపోవుటకుఁ దప్ప! ఐరోపా

లోని కవీశ్వరులు గొందఱు కాఁపువారు. సైనికులు మొదలైన తక్కువ వృత్తులవారి బదుకులును వర్ణనార్హములని భావించి యెంతో సుందరముగఁ గావ్యములలో వ్రాసియున్నారు. మన గ్రంథముల మాత్రము చదివి యీ పుణ్యక్షేత్రమైన కురుక్షేత్రముయొక్క స్థితి గతుల నరయఁ జూచువారికి, ఈ దేశము బీదసాదలపై నాదరము గల కవి యెవఁడైన నున్నాఁడా ? తుదకు, బీదసాదలైన నున్నారా ? యను సంశయము పట్టినను దప్పు వారిదిగాదు ! శోకరసము వర్ణింప వలయునన్న ననుకూలమగు సందర్భ మెయ్యది ? క్రొవ్వు కాఱెడు నాయికానాయకుల యూహామాత్రములైన కష్టములా ? ప్రజలు దినదినమునఁ గన్నీరు గార్చుటకైన నవకాశములేక కుడుచుచుండు పరిపరి విధములైన గోడులా ? శాంతరసమునకుఁ బోషక మెయ్యది? తమకు నష్టముఁ దేనట్టివైన రాజులయొక్క యుదారచర్యలా ? ఆకఁట మాఁడి మలమల మాడుచు నింటికివచ్చి వంట సిద్ధము కాకుండినను భార్యపైఁ గోపింపక కన్నులు మూఁతపడుచుండ విధిని ధ్యానించుచు నొక మూలఁ గూర్చుండు పాలము కాఁపు యొక్క నడవడియా ? ఆహా ! జనసామాన్యముయొక్క ప్రతిదిన వృత్తములలో నెంత భావము, రసము, గుణము ఉపగతములై యున్నవో మన కవులకుం దెలియవుగదా ! రాజపుత్రులను, రాజ కన్యలను, చాలనందులకు బ్రాహ్మణులను, వేశ్యలనుబట్టి ఝుంఝూట మాడుటదప్పఁ గవితకు మేలైన యన్యకర్మములులేవా?

సామాన్యజను లీ రీతి నలక్ష్యముగాఁ జూడబడుటకు హేతువు లెవ్వియన : ఈ దేశమునఁ బ్రజ సాధించుటకుఁ జేయి, తన్నుటకుఁ గాలు, మొఱవెట్టుటకు నోరు ఏదియు లేని పశువు ! ఐరోపాలోని జనులు రాజసగుణ శోభితులు. మన పాలిటి భాగ్యము తామసమో, దాని తోఁబుట్టువగు సత్త్వమో యేదోయొక జడత్వబీజము ! జాతి భేదములవలన శ్రేష్ఠకులులకు తదితర పక్షమున మర్యాదయు గౌరవమును గలుగమి శ్రేష్ఠులకు మాత్ర మర్థింపఁదగినను నియతిని విద్య దాల్చినదగుట. దీనివలని దుర్దశలు రెండు. మొదటిది. విద్య నచ్చిన యుత్తమవర్ణులకు తక్కినవారితోడి సాంగత్యము తక్కువ గావున వారింగూర్చి వ్రాయజాలినను వ్రాయనేరరు. రెండవది. విద్యాదానమునకుం బాత్రమగాని జనబాహుళ్యము ఎంత దెలిసిన దయ్యును అక్షరములు రానిలోపంబున వ్రాయనేరరు. అథవా ఒక రిద్దఱు కవితాశక్తి నెట్లో సంపాదించిరి పో ! ప్రాశస్త్యముననున్న పద్ధతి రీతిఁ జెప్పి యగ్రజాతివారిని మెప్పింపవలయునని గదా

వారు ముఖ్యముగాఁ దలంతురు ! అట్లగుట నల్పజీవితమును వారు సరుకుసేయుదురా ? చేయరు. జాతికి జాతికి స్పర్ధయేర్పడుట వలన పాండిత్యము ప్రకటించి బ్రాహ్మణుల మీఱవలయునని రామ రాజ భూషణుఁడు యత్నించె నేమోయనుట విచార్యము ! ఏది యెట్లున్న నేమి ? అగ్రజాతులవారి యహంభావము, అశ్రద్ధ, ఆచారము ఇవి వేరుగను, అన్యజాతివారిని దమ మార్గమునకు నధీనులఁగా జేయుటయు, కవిత్వోచితమైన విషయమును మిక్కిలి సంగ్రహపఱచినవి. ఒక్క రాజులను రాజకన్యలను వదలినయెడఁ గవితకు గతిమోక్షము లుండవుగాఁబోలు ! ఆంధ్ర కవిత్వము రాజు లను రాణులను నమ్మి జీవనము జరుపుకొనునది గసుక, వారైశ్వర్య మును గోలుపోయినతోడనే తానును వైరస్యమును వికృతవేషమును దాల్చవలసిన దాయెను. ప్రజలలో సత్త్వము స్థిరముగలేనిది కవిత నిత్యసౌభాగ్యము పడయనేర్చు టెట్లు ?

మనయొక్క రాజుల దినములలో సైత మలవడనంత విన్యాసము నేఁడు ఆంధ్రమును జెందియుండుటకు, బ్రిటిష్‌వారి పరిపాలనమాహాత్మ్యమును, దానిచే మనయందు ప్రభవిల్లిన వృద్ధి నతిశయముగఁ జెందుదమను నుత్సాహమును ముఖ్యకారణములు. విద్యయు నెల్లరు శక్తికొలఁది నిరాటంకముగ గ్రహింపవచ్చును. ఔనత్యమునకు సంఘదురాచారముల నిర్మూలముజేయుట విడువ రాని సమయము గావున, నాంధ్రసాహితీపునరుద్ధరణ ప్రభావులైన శ్రీ వీరేశలింగముగారిచే దారి చూపఁబడిన యనేకులు, ప్రజల యొక్క మేలిమినాసించి, వారలకు, దెలియనట్లు అనేక ముఖ్య విషయములఁగూర్చి వ్రాయుచుండుటచే, భాషయందలి ప్రీతియు గౌరవమును, అభిలాషయు, కుతూహలమును మును పెన్నఁడుఁ దాల్చి యుండనంత వ్యాప్తినిఁ బెంపును వహించుచున్నవి. ప్రకృతము కావ్యములు, నాటకములు, ప్రహసనములు ఇత్యాది కృతులతో నివేదింపఁబడు విషయములసంఖ్యములు. సర్వజన హితములు. ప్రాతమార్గములనే యాపద్ధతు లరిగిపోవునట్లు గొఱ్ఱెల మందలవలెఁ బోవునవిగావు. మఱియు దేశాభ్యుదయమను మహో ద్దేశము గలవౌటఁ బౌరుషోద్దీపకములు. నాయికా నాయకులు సగమునకు సగము పలాయితులైరి. రాజులు రాణులును ప్రచ్ఛ న్నులై యేమూలం దాఁగిరో యెందడఁగిరో ! వెతకఁబడువారులేరు. వెదకువారును లేరు ! కలియుగాదినుండి యింతదాఁక జమకు ఖర్చునకురాని సాధారణజనులు నేఁటికిఁగదా గణ్యులైరి ! ఇఁక

ముందు పూజ్యు లగుదురుగాక !

"తే. అక్కజంబుగ నిప్పు డత్యంత దీప్తి
వెలుఁగుచున్నావు భారతీ! విమలమహిమ
నాంధ్రదేశంబుతో మార్పు లనుభవించి,
యేమి చెప్పుదుఁ? గలకాల మింక నెట్లొ!"

## మూఁడవప్రకరణము

### కళాపూర్ణోదయము

కళాపూర్ణోదయ మాంధ్రంబున నద్వితీయమైన గ్రంథము. ఏజాతికిం జేరినదిగాదు. తనఁతట నొక క్రొత్తరకము. ఆంధ్ర భారతాదులు సంస్కృతేతిహాసములకుం బరివర్తనములు. మన వసుచరిత్రాదులయందుఁ గథలు నవీనములుగావు. ప్రాచీనగ్రంథ ములనుండి గ్రహింపఁబడినవి. ఈ విమర్శనములకు గుఱియైన కావ్యమన్ననో కవియొక్క స్వసృష్టి. బాణునిచే సంస్కృతమున రచింపంబడిన కాదంబరివంటిదని యందురుగాని, దానినుండియైన సూరనార్యుఁడు విషయముల గ్రహించినట్లు గానము. ప్రబంధ కవు లెవ్వరిలోనూ గనఁబడని ప్రతిభయు, భావనాశక్తియు, సందర్భ శుద్ధియు, పాత్రోచిత పద్యరచనయు నిందు సుప్రసిద్ధములు. ఇంత భావగాంభీర్యము గలదియు నూతనపద్ధతులం బోవునదియునైనను కాలదోషము నెట్లు పూర్ణముగఁ దప్పించుకొనఁ గల్గును ? ప్రబంధ కవులయందలి స్ఖాలిత్యములు నిందును బెక్కులు గలవు. కాని దోషములకన్న గుణములెన్నియో మడుంగు లెక్కువయని దృఢము గను మనఃపూర్తిగను జెప్పుట కేయాతంకమును లేమి చదువరుల కెల్లను స్పష్టము. దీనివలె భావనాశక్తిచే నిర్మింపబడినదియు, తేజ రిల్లునదియునైన గ్రంథము తెనుఁగులో లేదు. పరదేశ భాషల యందలి పుస్తకములతోఁ బోల్చిచూచినను దీనికి గౌరవహాని యేమాత్రమును గలుగదని నా యాశయము. మనకు నిదియేకము తనవంటిది లేనిది. ప్రశస్తములగు దేశాంతరకృతులతోఁ దుల దూఁగఁ గలదియగుట, నన్యులు పరీక్షించినను దలవంచుకొన వలసినదిగాదు.

భావనాశక్తి స్వచ్ఛంద ప్రచారములలో నొకటి. అట్లగుట దానిని సమగ్రముగఁ దాల్చినకవులకు నదియొక గొప్పవరముగాఁ దోఁపదేమో! కావుననే కదా మహాకవులును శిల్పులును హనుమంతునివలెఁ దమ యౌన్నత్యమును దామెఱుంగకుండుట! కాళిదాసు వ్రాక్రుచ్చిన విధము నెఱుంగరా?

"కడుశిక్షితులైనను దమ
యెడనమ్మిక దమకుఁ గలుగ దెన్నఁడు మదిలోన్"

వారి కేమో వారి వాక్కులు సహజములుగ సాధారణములుగఁ గాన్పించును. వినువారికన్నో యాయద్భుతము చెప్పఁదరముగాదు! సూరనయు కళాపూర్ణోదయము తన రచించిన గ్రంథములలో నుత్తమోత్తమమని యెంచినాఁడో లేదో యనుట సందిగ్ధము. ఎట్లన: నంద్యాల కృష్ణవిభుఁడు తన్నుద్దేశించి పల్కినట్లుగా

"మ. ఇటమున్నారుడ సంహితాదికృతు లీ వింపొందఁగా జెక్కిన
ర్చుటవిన్నారము, చెప్పనేలయవి, సంస్తుత్యోభయశ్లేష సం
ఘటనన్ రాఘవ పాండవీయ కృతి శక్యంబే రచింపంగ నె
చ్చట నెవ్వారికి, నీక చెల్లెనది భాషాకావ్యముం జేయఁగన్."

అని వ్రాసియుండుటయేగాక, రాఘవ పాండవీయములో కృతిపతియైన పెదవేంకటాద్రి తన్నుఁ బ్రశంసించుచు

"శా. రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండున్, దద్గతి; గావ్యమెల్ల నగునే నోహోయనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగుఁ గబ్బంబద్భుతంబంద్రు, ద
క్షుం డెవ్వాఁడిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్."

అని సెలవిచ్చినట్లును వర్ణించియుండుటఁజూడ శ్లేషకావ్యములం గల గౌరవము తదితరములయెడ నతనికుండెనాయని సంశయింపనందు గలదు. కాని రాఘవ పాండవీయ రచనానంతరమున నతఁడు శ్లేష నంతగా వాడక చాలించుటం జూడ దానియందలి యాదరము లాఘవ మయ్యెననియు నూహింపవచ్చును. ద్వ్యర్థి కావ్యములకెల్ల శిరోమణి యనందగుదానిని ఘటించినవాఁడయ్యు, కళాపూర్ణోదయ ప్రభావతీ ప్రద్యుమ్నములలో ప్రబంధకవులవలె శ్లేష నంతగా వాడకయుంట కతన నదిశక్తిలేమిచే విసర్జింపఁబడినది

గాదు. మఱి రక్తిలేమిచేనని యనుమానించుట సహేతుకము. ఏది యెట్లుండె. లోకులును, అనఁగా పండితులన్నమాట, రాఘవ పాండవీయమును బంచ మహాకావ్యములలో నొకటిగా ననుగ్రహించిరే కాని అఖండభావగాంభీర్యమైన కళాపూర్ణోదయమునకు నట్టి పట్టము గట్టరైరి. ఐన నిదియొక యెదురుచూడఁబడని వింత గాదు.

### కవియొక్క ప్రతిజ్ఞయుఁ దత్ఫలములును

ఈ కావ్యముయొక్క గుణదోషములు రెండింటికిని నాస్పదమైనది సూరనార్యుఁడు ప్రారంభమునఁ జేసికొన్న ప్రతిజ్ఞయు. కృతినిర్మాణ విషయమైన సంకల్పమును గవియే వివరించియున్నాఁడు. చూడుఁడు. "సకల లక్షణ లక్షితంబైన మహాప్రబంధంబు కీర్తి కారణంబని....యెద్దియేనొక్క సరసప్రబంధ నిబంధనమునకుఁ" గౌతూహలియై యుండునపుడు, రాజుగారు "నిర్నిద్రలీలావిచిత్రంబగు దానిం" జేయుమని యాజ్ఞాపింపఁగా, ప్రభువుగారి గౌరవమునకును దన శక్తికిని దగినరీతి "నపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయంబును, శృంగారరసప్రాయంబును, బుణ్యావస్తువర్ణనాకర్ణనీయంబును నగు కళాపూర్ణోదయంబను మహాకావ్యంబు" రచింపఁ గడంగెను! కవియొక్క యుద్దేశమే యీ గ్రంథ మిన్ని లక్షణములఁ గల్గియుండవలయునని. కవి తన యభిమతము నెఱవేర్చికొన్నాఁడు గాని, యిట్లు పంతముఁబట్టి వ్రాసినందున నిష్కళంకమైన కృతి యేర్పడినదా లేదా యనుట సందేహము! కథయు ప్రకృతియందలి వస్తువులవలెఁ దనంతటఁ దనయందలి సత్త్వముంబట్టి పుట్టి పెరుగు గుణముగలది. దానిని సాజముగ పెరుగనిచ్చి, యప్పుడప్పుడు సవరించుచు సంస్కరించుచు దోహదము చేయుచువచ్చిన మేలా? మొదటినుండియే యీయా రసములు తప్పక యిచ్చెడు దానిని గల్పించెదను అని సంకల్పించుకొని పిమ్మట దాని యుత్పత్తిఁ జేయఁజూచుట మేలా? యోజింపుడు. భావనాశక్తి కారణశక్తి యొక్క సేవనమునకు నిల్చిన మహత్తుగాదు. మఱి స్వైరిణి. గుఱ్ఱముల నడిపినట్లు గతి వేగము గుదించి త్రిప్పి కొంతకుఁ గొంత వశ్యము చేసికొననగుఁగాని, యపరిమితముగా దాని స్వేచ్ఛావిహారమును నివారించితిమేని అది చెడును. పరిశ్రమము తగినంత లేమి మందమగును. కృశించి నశించినను నశించునేమో! సకల లక్షణ లక్షితములు ఐహిక సంప్రదాయముల ప్రకారము నిర్లక్ష్యములు.

నిర్లక్ష్యములు గాకున్నను నిర్దోషములు గావు.

సూరనార్యున కీ యుద్యమముచేఁ గలిగిన మేలు గీడు లెవ్వి యన: అపూర్వకథా సంవిధానమునకుం బూనుటచే నుపజ్ఞకు భావనాశక్తికిని మంచి ప్రవేశము దొరకినది. ప్రాచీనకవు లితరుల కథల భాషాంతరీకరించిన వారగుటను, ప్రబంధకవు "లాద్య సత్కథ" లైకొని కై సేఁతలకుం దొడంగుటచేతను, ఆ యిరు దెఱఁగుల కృతికర్తలయందును మాతృకలులేని యెన్నికలును భావనాశక్తియు వ్యాపించుటకుఁ దరుణము కఱవాయెను. కళా పూర్ణోదయము సామాన్య ప్రబంధములకంటె నెక్కువ రసవంత ముగ నుండుట కిదియొక కారణము. మఱి భారతమంత సరసము గాని దగుటకు మూలమేమనఁగా సర్వలక్షణములును బలాత్కార ముగనైన దెచ్చి రాసివేయవలయునని కవి సంకేతము చేసికొన్న వాఁడగుటచే కథ సహజముగఁ బక్వమునకు రాక యచ్చటచ్చట నూఁదరవేయఁబడి యుండుట. అయిన నొక్కటి. కథ కంటికిఁ గనఁబడనంతటి కృశత్వము నొందియుండుట ప్రబంధములలోని కొఱతలలో నొకటియని మునుపే చెప్పఁబడియెఁగదా! ఈ లోప మును చాలమట్టునకు పూరించి ఈ కావ్యములోని కథకుఁ బుష్టి తెచ్చిన తంత్రములలో "సర్వలక్షణసంపన్న"తా సమయము ప్రము ఖము, ఎట్లన, రసములు తొమ్మిది. "శృంగార వీర కరుణాద్భుత హాస్య భయానక భీభత్స రౌద్ర శాంతము"లని. ప్రతియొక్క రసము నకుఁ జెందిన భావానుభావము లెన్నియో యున్నవిగాని, మనవారు శృంగారమునకుఁ జెందినవానిం దప్పఁ దక్కినవాని నంతగాఁ దలపోయరైరి. అందుచేత ప్రబంధములలో నన్నిరసములుఁ బ్రదర్శింపఁ బడవయ్యె. అట్లు చేయవలయునన్న వివిధములయిన కార్య జాలములతో నిండిన విస్తృతకథయొక్క ప్రాపు తప్పక యుండవలయు. ఒక యుద్యానవనమునందు ఒక జత నాయికా నాయకుల కన్న నొకటి రెండు రసములకన్న నెక్కువ పుట్టించుట దుర్లభము! రమారమిగా నిర్ణయించితిమేని, ప్రబంధములలో అద్భుతహాస్యభీభత్సభయానక రౌద్రరసములు మృగ్యములు. వీర శాంత కరుణా రసంబులును శోషితంబులు. మనవారిచే శృంగార మనఁబడు* నొక్క రసముమాత్రము దట్టముగఁ గాఁబుచుండును.

---

*ఇది నిజముగా శృంగారమనుట నిర్వివాదముగామి యిఁక ముందు సూచింపఁబడును.

మన సూరకవి కళాపూర్ణోదయమున నీ యన్ని రసములకును స్థానము లేర్పఱుచు కోరికగలవాఁడౌటచే వాని కన్నింటికిఁ జోటుదొరకునంత విశాలమగు కథ గల్పింపవలసినవాఁడయ్యె. అందుచే నిట కథ తుచ్ఛముగాదు, మఱి మిక్కిలియు ప్రాబల్యము గలయది. అయిన నొక దురదృష్టము. ఒకే కథలో నన్నిరసములు నిముడ్పవలెనన్న నా కథను దాఱుమాఱుగ నీడ్వనిదిగాదు. అనఁగా అసంగతమైన యంగములఁ దెచ్చిపెట్టి స్వారస్యము నక్కడక్కడఁ జెడఁగొట్టి కథకు వికారము గల్పించినాఁడని నా మనవి. సమగ్ర పరిపూర్ణత మనుజులకు సుఖముగ జీర్ణమునకుఁ దెచ్చికొను నాహుతిగాదనుట మాటి మాటికిఁ జెప్పుటయేల? అట్టి కఠినంపుఁ బదార్థముల కాసించి కవి కష్టముల పాలైనాఁడు. అయినను మొత్తముమీఁద నీ యిచ్ఛయు శుభకరము. ఇది లేకున్నఁ గళాపూర్ణోదయము ప్రబంధములలోఁ గలసిన గ్రంథముగా నుండియుండునేమో! ఆ దుర్గతికిం దప్పించిన మంత్రము నింద్యమనరాదు!

కల్పనాసామర్థ్య మీకవికింబలె నాంధ్రులలో మఱెవ్వరికిం గానము. తిక్కనాదులకు నుండవచ్చునేమో! ప్రత్యక్షమునకు రా నవకాశము లేనివారగుటకతన వారింగూర్చి యీ యాలోచనఁ బెట్టు కొనుటలో ఫలములేదు. ఇఁక ప్రబంధకవులన్ననో, ఒక్క కథ యొక్క ప్రధానాంశములయందకాదు. సందర్భముల నేర్పఱుచుట యందును గల్పనఁ గలవారుగారు. గొఱ్ఱెలమంద రీతి నొకరు పోయిన దారినే తల వంచికొని యందఱుఁ బోయరిగాని, స్వేచ్ఛా గమనముఁ దాల్పరైరి. సూరనార్యునియందు ప్రబంధకవులకుంగల వర్ణనాశక్తితోడ కథాకల్పనాశక్తియు, వివిధములైన సందర్భములను సంధానమునకుఁ దెచ్చు ప్రతిభయు, సహవాసములు, మఱియు భావనాశక్తికి దోడు భాషాశక్తియుఁ గలవాఁడగుటఁ దానే యించు మించు సర్వకవితాలక్షణసంపన్నుఁడనం జెల్లుగాదె? కవిత్వము భవ్యంబగుటకు భావము భాష రెండును గలసి మెఱయవలయుట. నిత్యసమయము. సూరనార్యుఁడీ రహస్యము నెఱింగినవాడనుటకు నిదర్శనమేమనఁగా: కవితాస్వరూపమును ప్రభావమును వర్ణించి తా వ్రాసిన

"లయవిభాతి. చలువగల వెన్నెలలు చెలువునకు సౌరభము
గలిగినను, సౌరభముఁ జలువయు దలిర్పం,
బొలుపెనఁగు కప్పురపుఁ బలుకులకు గోమలత
నెలకొనిన, సౌరభముఁ జలువపనయుం, గో

మలతయును గలిగి జనముల మిగుల బెంపెనఁగు
మలయపవనంపు గొదమలకు మధురత్వం.
బలవడిన నీడుమఱి గలదనఁగ వచ్చుఁ గడు
వెలయఁగల యీ సుకవి పలుకులకు నెంచన్."

(కళా. ఆ. 1, ప. 186)

అను పద్యము. భావము శైలిని మించినదా, శైలి భావమును మించినదా యని వెఱఁగొనరించు నగ్రగణ్య పద్యములలో నిది యొకటి! కవిత్వ ప్రశంసల నెన్నింటినో చూచియున్నానుగాని, మనోహరములైన యిన్ని యాకృతుల నెదురనిల్పి మైమఱచునట్లు చేయుమాటల నింకెయ్యెడను గనలేదు, వినలేదు! ఊహనుండి యూహకుఁగా భావము మీఁదికెగయుచుఁ దుదకుఁ గంటికి గనరాని యంత యౌన్నత్యమును వహించినది గదా!

## కవికృత శైలివిషయక విచారములు

సూరనార్యుఁడు శైలివిషయమై చేసిన చర్చలను, బహు చమత్కారముగఁ బాత్రము లొకళ్ళొకళ్ళ వాక్యములం బ్రశంసించినట్లు వ్రాసియున్నాఁడుగాని, తానేనేరుగఁ జదువరుల సంబోధించినట్లు వ్రాయలేదు. ఈ కవితో సమకాలికుఁడైన 'షేక్స్పియర్' అను నాంగ్లేయ కవిచక్రవర్తి కొన్నియెడలఁ దన శైలింగూర్చి సగము నవ్వుటాలకుంబలెఁ బ్రసంగమ్ముఁ జేయందలంచి స్వయముగ వ్యాఖ్యానంబుఁ జేయుట యనుచితంబుకాదు. కథాగమనమునకు విరుద్ధము నని యెంచి, పాత్రముల యొండొరుల వచనముల విమర్శించినట్లు సేసి, యా మార్గమునఁ గొంతకుఁ గొంత దన యభిప్రాయంబు వెలువరించుట గలదు. సూరన్నయు నీ మార్గ మవలంభించినవాఁడే. నేరుగా కవియే కథలో మాటాడుట కథయందు మన కుండవలయు నవధానమునకును దానిచేఁ గలుగు మైమఱపునకును విచ్ఛేద హేతువు. కావునఁ గవి బోధనలు సైతము పాత్రముల మూలమునఁ బ్రచురించుట నాటక సందర్భమునకుఁ బోషకము. కావ్య మనునది జగత్తురీతి నుండవలయును. ఎట్లన, జగంబు మన యెదుర నున్నది. దానిమీఁదఁ దృష్టి చెదరకుండుటకో యన జగత్కర్త యదృశ్యభావుఁడయి యున్నాఁడు. కావ్యమును జదివి యానందించుచుఁ గవిని మఱచితిమేని, యది కృతఘ్నతయే మోగాని, యవియే కవియొక్క కృతార్థతకు గుఱుతు. మఱియు, పాత్రల మఱుఁగుననుండి వారిచేఁ జెప్పించినఁ దనకు గర్వము,

ఆత్మస్తుతి మొదలగు నేరములు మోపఁబడవు.

సూరన శైలింగూర్చి చేసిన విచారములన్నియుఁ బాత్రముల చాటున కథకును దనకును, భంగమురాని మాడ్కిఁ జేసి యున్నాఁడు. అనఁగా బయటఁబడకయ తనకృతినిదానే విమర్శించి యున్నాఁడనుట.

దృష్టాంతరము. మణికంధరుఁడు చేసిన దండకరూపమైన కృష్ణస్తవముంగూర్చి కలభాషిణి ప్రశంసించిన తెఱంగు:

"సీ. పొసఁగ ముత్తెపుసరుల్పోహళించినలీలఁ
దమలోన దొరయు శబ్దములఁ గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్య వ్యంగ్యభేదంబు
లెఱిఁగిఁ నిర్దోషత నెసగఁ జేసి
రసభావములకు నర్హంబుగ వైదర్భి
మొదలైన రీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లింపుగాఁ బాదుకొల్పి

తే. యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టి యర్థశబ్దాలంక్రియలు మటించి
కవితఁ జెప్పఁగ నేర్పు నత్కవి వరునకు
వాంఛితార్థంబుం లొసఁగనివారు గలరె?" (కళా.ఆ.1, ప. 185)

ఇది వ్యర్థ పద్యంబు గాదు. ఎట్లన ఇందులోని విశేషముం జూడుఁడు. కలభాషిణి యింక ముందు మణికంధరుని మీఁదఁ దాను దొలినుండియు మోహము దాల్చినదని చెప్పఁబోవుచున్నది. కాన వాని కా మాటయందు నమ్మిక పుట్టుటకై యీ పొగడ్త యను వయ్యెడి. మఱియు మనసు దగిలినవారల చెయ్వులు బహుప్రశస్తముగ మనకుఁ దోఁచుట స్వాభావికము. అట్లగుట శైలి యంత బాగుగలేదని పండితులు నిరూపించినను, నీశ్లాఘనకుఁ గొఱఁత రాదు. కారణము లేమనఁగా: అది కలభాషిణి వచనము. ఆమె మనసు ప్రకారము వ్రాయఁబడినది. అత్యుక్తిగా మీకుఁ దోఁచినను గలభాషిణికి దోఁచియుండదుగదా! మఱియు నామె వారాంగన. వారాంగనలకు, ముఖస్తుతులు అతిశయోక్తులును జీవనాధారముగాన నైజములు. కాఁబట్టి యహంభావముచేఁ గవి యాత్మస్తుతిఁ జేసి నాఁడని స్థాపింప వలనుగాదు. అతని శైలి చెడ్డదిగా నుండినను సరే ఈ పద్యము సమయోచితమ. ఇఁక శైలి యీ వర్ణనకుఁ దగినదిగా

నుండిన నసలు దోషమే లేదు చూచితిరా! ఈ కవి మహిమ! ఈ సీసముయొక్క సొగసు కథయొక్క పెంపకమునకు ననుకూలము. కవియెడం జెల్లినను జెల్లవచ్చును. చెల్లదన్నను అనిమిత్త ప్రసంగము గాదు!

## ప్రభావతీప్రద్యుమ్నము కొన్ని సందర్భముల గళాపూర్ణోదయము ననుక్రమించెడును

కళాపూర్ణోదయములో భావనాశక్తి యఖండమన్న నా విజ్ఞప్తికి నిదియొక తార్కాణ. ఒక్క యఖండమగుటయకాదు. కొన్నియెడల మితినిమీఱి యతిశయదోషముం జెందియున్నదన్నను, గవియెడ నన్యాయముఁ జేసినవారముగాము. ప్రభావతీప్రద్యుమ్నము నం దన్నో కవిత్వవిద్య యింకను బక్వమునకు వచ్చినది. అనఁగా శుద్ధరచననుమాత్రము గమనించిచూచిన వెనుక వ్రాయఁబడిన యీ గ్రంథము దానికిఁ బూర్వమగు కళాపూర్ణోదయమునకన్నఁ గొన్ని విషయముల మిన్న. ఎట్లందురో, శైలి యింకను మంచి పాకమునఁ బడియున్నది. లోకోక్తులు మొదలగు నలంకారము లెక్కువ యగుటయుకాదు, రమ్యములును. అన్వయ సౌలభ్యము నధికమ కాని భావనాశక్తి యెంతయుఁ దక్కువ. బహుశః కవి వయసు ముదిరినవాఁడైనందున రాగములు కృశించియుండును. రాగాదుల విజృంభణము లేనిది భావనాశక్తి యడరనేర్చునా? ఏది యెట్లుండె. కళాపూర్ణోదయ సందర్భములఁ గొన్నింటిని ప్రభావతీప్రద్యుమ్నము లోను అనుకరించి యున్నాఁడు. తొల్లిటి గ్రంథమందుఁగల నూతన కల్పనలు వెనుకటిదానిలో లేవు. మఱియు నందలి కల్పనలు గొన్ని చిల్లర మార్పులతో నిందుఁ బొందింపబడి యున్నవి. భావనాశక్తి వ్రాలెననుట కింకను సందేహమేల?

చూడుఁడు, మణికంధరుని తపోభంగముఁ జేయుటకై వచ్చి కార్యసిద్ధి గడించిన రంభ యా మోటుదపసి శృంగారములకుఁ గరంగని దగుటను, నలకూబరాయత్తచిత్తయగుటను, జేసి యొకా నొకప్పుడు

"క. కళలంటి కఱఁచి తన చె
య్యులఁ జొక్కెడు తపసి మది చివుక్కురుమనఁగా
నలకూబర! విడువిడురా!
యలసితి ననిపల్కె మన్మథాతి వివశతన్." (కళా.ఆ. 3, ప. 47)

అన్యనాథునిఁ బేర్కొనుట మణికంధరుని కోపమునకు గారణము గదా! ప్రభావతీ ప్రద్యుమ్నములో నాయికానాయికు లకుఁ గోపముఁ దెచ్చిపెట్టవలయునని యుద్దేశించి కవి యీ కళా పూర్ణోదయము సంగతివంటి దానినే చేర్చియున్నాఁడు.

"శా. ప్రద్యుమ్నుండు ప్రభావతీ రతి విహారప్రౌఢి సారస్య సం
పద్యుక్తిం గడుజొక్కి 'దక్కితి రతీ! మత్ప్రాణమా! నీకు' నం
చుద్యత్ప్రేమ సమృద్ధిఁ బల్కె నదియాయోషాలలామన్ శ్రవ
స్పద్యఃపాత నిశాతశూలసమమై చాలంగ నొంచెన్వెసన్." ఇత్యాది.
(ప్రభా. ఆ. 8, ప. 106)

ఒకచో రంభ 'నలకూబరా!' యని స్మరించుట. వేఱొకచోట ప్రద్యుమ్నుఁడు 'రతీ!' యని పల్కుట. సామ్యము స్పష్టము. కాని మొదటి సందర్భముయొక్క కౌశల్యము రెండవదానియందు జూపట్టదు. తారతమ్యము లేమనఁగా: ప్రభావతమ్మగారికి వచ్చిన పొలయలుక వర్ణనకై దిగుమతి కాఁబడిదేకాని కథాసాంగత్య మే మాత్రమును దానికి లేదు. వచ్చిన నెవరికి లాభము, రాకున్న నెవనికి నష్టము! చాలీచాలనిదానికి శ్లేషవాసనయు మిగుల గాటు! ఇఁక కళాపూర్ణోదయ సందర్భమన్ననో సర్వవిధముల నుత్కృష్టము. ప్రభావతి రాజకన్య. వయసున నెంతో చిన్నది. రతీదేవి పురుషున కన్న పెద్దమ్మకదా! కాఁబట్టి కోమలాంగియైన ప్రభావతితో ముచ్చటించునపుడు ఈ జ్యేష్ఠాదేవిని దలఁచుకోవలిసిన విధియేమి? పాపము. రంభగతివేఱు. మోటుదపసి యెక్కడ? రసికశిఖా మణియు ధనవంతుఁడునైన నలకూబరుఁ డెక్కడ? ఇంతేగాదు. మణికంధరుఁడు నలకూబర రూపముందాల్పఁడేని కథ సాగదు. ఇరువురు రంభలు, నిరువురు నలకూబరులు నుండుట యావశ్య కము. రంభ 'నలకూబరా' యని కనులు మూసికొనుట, యింకను గామతృప్తి వడయని మణికంధరునికి నలకూబర వేషముందాల్చు టకు నమోఘమైన హేతువు! కావున నీవైరస్యము దండుగప్రణయ కలహముగాదు. మఱి కథావృద్ధికి నావశ్యకము.

## శైలిని గూర్చిన తర్కములు

కవియొక్క శైలివిషయముం గూర్చిన చర్చయు నిట్లే. కళా పూర్ణోదయములో నిది కథా కల్పనకుం జేరిన యవశ్యక్రియలలో నొకటి. ప్రభావతీ ప్రద్యుమ్నములో నిట్టిది యొకటున్నది గాని,

యది విడువఁబడఁ గూడని యంత కలయికతో వెలయునదిగాదు. ఆపద్య మేదన, ఇంద్రుఁడు శుచిముఖిని కొనియాడుచు నాడిన ;

"సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగ నీక
పదమైత్రి యర్థ సంపదలఁ బొదలఁ
దలఁ పెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తి దోషంబు పొంతఁబోక
యా కాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖా చంక్రమ క్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాదు కోనదుకుచు
నుపపత్తి యెందు నత్యూర్జితముగ

తే. నొకటఁ బూర్వోత్తర విరోధ మొందకుండఁ
ద త్తదవయవవాక్య తాత్పర్య భేద
ములు మహావాక్య తాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుటబహుతపః ఫలము గాదె!" (ప్రభా. అ. 2, ప. 3)

అనునది. రెండు గ్రంథములలోని యీరెండు పద్యములం బోల్చి చూచితిమేని నీరెండవకృతి రచించులోపలఁ గవి కొంతమట్టునకు శైలింగూర్చిన యభిప్రాయము మార్చినాఁడనియుఁ జెప్పుట కవకాశ మయ్యెడి. కళాపూర్ణోదయ పద్యముంబట్టిచూచినఁ గవి యలంకార శాస్త్రములయెడ బహు భక్తిగలవాఁడనియు, నర్థాలంకారములు మాత్రము గాక శబ్దాలంకారములును అవశ్యానుష్ఠేయములని భావించినట్లును, గానంబడియెడి. ప్రభావతీ ప్రద్యుమ్న పద్యములో నలంకారశాస్త్రముం గూర్చిన విచారచిహ్న లెవ్వియును లేవు. శబ్దాలంకారములంగూర్చి కవి యువ్విళ్ళూరకపోవుటయే కాదు, అర్థాలంకారములనైన ధ్యానించినట్లు పొకడగానము. భావములు, అర్థములు, తాత్పర్యములు, అవయవసంయోగము మొదలగు తలఁపులతోఁ జేరిన లక్షణములమీఁద నేకాగ్రమగు దృష్టిని నిలుపుట మేలని యెంచెనేమో! ప్రభావతీ ప్రద్యుమ్నములో చిత్రకవిత్వ మత్యల్పము. ఇంచుమించు శూన్యమును, కళాపూర్ణోదయమున నంత యెక్కువ గాకున్నను దానియందుకన్న నధికము. ప్రబంధ ములయందుంబలె నమితముగాదు. రసనాశ మొనరించునంత విపరీతపు వాక్సరణి యీకవి యెంతదపసుచేసినను సాధ్యమగు వరముగాదు. ఏలన, భావగంభీరుఁడుగాన. ప్రభావతీప్రద్యుమ్నము విషయమునఁ బ్రబంధసంబంధి శైలిలోఁగాదు. కళాపూర్ణోదయము

మొత్తముమీఁద విషయమున ప్రబంధసంబంధిగాదు. శైలియం దచ్చటచ్చట నావాసనం దాల్చినదియ. మొత్తముమీఁద ననుటచే నాఅవయాశ్వాసముయొక్క యంత్యభాగము మొదలు గ్రంథ సమాప్తి పర్యంతము తుచ్ఛమైన ప్రబంధధోరణిలో నేకారణము చేతనో వ్రాయంబడి యుంట సూచితము. సూరనార్యుని రచనా పరిణామముం జూచిరా! అఖండ శ్లేషపూరితమైన రాఘవ పాండవీయముతో ప్రారంభించి, తుదదాఁకు సరికి ప్రభావతి యందు శ్లేషకవిత్వము వచ్చునో రాదో యనునంత తక్కువ పఱచి యున్నాఁడు.

## సూరన్నయొక్క చిత్రకవిత్వము

భారతము నత్యంతాదరముతోఁ బఠించినవాఁడయ్యు, కాల దోషంబుచే శబ్దచిత్రములం బ్రకటించుటకు నేర్చిన వాఁడయ్యె ననుటకు నిదర్శనముగఁ గొన్నిపద్యము లుదాహరింతము :

"సీ. విశ్రాంతి విరతిఁ గావింపక సారవ
త్సాహిత్య సౌమనస్యంబు లెఱిఁగి
సమయంబుఁ దప్పక శ్రవణ కఠోరంబు
లైన శబ్దముల నత్యాకులాత్మఁ
జేయక, సత్పరిచిత సుకుమార వా
క్సరళితాభిప్రాయఁగా నొనర్చి
పదబంధ శిథిలతఁ బాటిల్లఁగా నీక
యేచందములయందు నేమరిలక
తే. పఱఁగు కవియు దోహ కరుఁడును యశము దు
గ్ధమును బడయు, నట్లు గానినాఁడు
కృతి దురావ మొదవు కీర్తియుఁ బాలు నీ
కుంట గాదు, హాస్యయోగ్యఁ జేయు." (కళా. ఆ. 1, ప. 8)

ఇందు శ్లేషప్రధానము.

"సీ. శేషు దర్పము చివ్వి శీతాంశు రుచి నవ్వి
పాలమున్నీటిపైఁ గాలు ద్రవ్వి"
(కళా. ఆ. 1, ప. 76)

"సీ. మెఱుఁగుటద్దపుమించు మించుబాగులనింపు
నింపుచక్కనిముద్దు నెమ్మొగంబు"
(కళా. ఆ. 1, ప. 135)

"క. మాయమ్మానను నీవే,
రాయలవై కావదేవ రాజే జే జే
మాయాతుమ లానినయది
పాయక సంతోషమున్న పలమిలసామీ." (కళా. అ. 6, ప. 161)

ప్రథమాగమాదులు మదాశయుని పురోహితాదుల నోడించుటకై సంస్కృతాంధ్రభాషాశ్లేషములతో నీపద్యమును బల్కి వారిని వెగడువఱిచి రాజునకుం దమ్ముం దెలిపికొనిరి. ఈ సందర్భము కాళిదాసుని చరిత్రచే సూచితంబు. చిత్రకవిత్వమైన నేమి ? కథా వృత్తముతో ననుసంధించినదియు ప్రధానమును గావున నిది సమంజసమే. ఇంతటఁ గవి విరమించి యుండిన నెంతో బాగుగ నుండె. ఇంకను నీలాటి పద్యము వినవలయునని కళాపూర్ణుండు కుతూహలుఁడయి వీరి నడిగినట్లును, ఆ రాజు యొక్క వినోదార్థముగా

"క. తా వినువారికి సరవిగ,
భావనతో నాను నతివిభావిను తేజా
దేవర గౌరవ మహిమన,
మావలసినకవిత మరిగి మాకు నధీశా." (కళా. అ. 6, ప. 172)

అను పద్యము ప్రథమాగముండు నివేదించినట్లును వ్రాసియున్నాఁడు. ఈ రెండవకల్పన పనిలేని పాండిత్య ప్రకటనమేగాని, యప్పటి వృత్తాంతముంబట్టి సహజముగ నేర్పడిన సరసముగాదు. మణికంధరుని తీర్థయాత్రాభివర్ణనములో నతఁడు సేవించిన క్షేత్రముల కనేకములకుఁ గవి యంత్యప్రాస నియమమాపాదించి యుండుట బమ్మెర పోతన విలాస ప్రభావమేమో !

"మ. యమునం జూచెను పీచి కాచయమునం బ్రాంచద్ఘన శ్యామతో
యమునన్ సారసకైరవోచ్చ్రయమునన్ ... ..." ఇత్యాది
(కళా. అ. 2, ప. 111)

మఱియు రగడలేనిది రాగము గుదురదని కాఁబోలు శ్రీరామ స్తోత్రము నొకటి వ్రాసి మణికంధరుని జిహ్వకు నంటించినాఁడు. ఇట్లనేకరీతుల శబ్దచిత్రము సంఘటించి యున్నాఁడుగాని, యిది కావ్యమునకు వన్నెఁదెచ్చు పద్ధతియనుట గడుసాహసము.

## ప్రభావతీ ప్రద్యుమ్న విమర్శనము

ప్రభావతీ ప్రద్యుమ్నమునం దిట్టి విఱుపు లపురూపములు.

మఱియు కథా ప్రారంభముననే పాత్రములను ప్రవేశింపఁ జేయుటఁబట్టి కవియే నేరుగ మనకు బోధించుట యేమాత్రము లేదు. అట్లగుటచే వర్ణనలు పాత్రముల మూలమునఁ జేయఁబడి కథలో మిళితములై యున్నవి. చూడుఁడు. మొదలెత్తగనే

"క. శ్రీరమణీ రమణీయమ
హారస్థలుఁ డచ్యుతుఁడు సముజ్జ్వల మహిమన్
ద్వారక నుండఁగ నొకనాఁ
డారూఢాదరత నింద్రుఁ డవ్విభుకడకున్."

అని యింద్రకృష్ణులకు ప్రవేశముఁ గల్పించి, ఇంద్రమాతలి సంవాద రూపమునఁ బురవర్ణనముం జేసియున్నాఁడు. ఇంద్రుఁడు చింతాక్రాంతుఁడై యుండఁబట్టి పురవర్ణనాదులచే నతనికి మఱపుఁ గల్పింపఁజూచుట సారథి ధర్మమేకదా! కావున నియ్యది ప్రబంధముల నెల్ల సర్వసాధారణములగు దిక్కులేని వర్ణనలకుం జేరినది గాదు. మఱి సార్థకము.

కథతో గాఢాన్వయములేని సంగతులు ప్రభావతీప్రద్యుమ్నము నందు మృగ్యములు. అవయవముల సంయోగము పరస్పరతయు నిందుంబలె నాంధ్ర గ్రంథముల నెచ్చటం గానము. త్వరపడు వారికి శ్రీకృష్ణుని యజ్ఞము అశ్లిష్టవృత్తాంతముగాఁ దోఁపవచ్చుఁ గాని, యదియుఁ గార్యసాధనమున కుపకరణప్రాయము. ఎట్లన, దైత్యరాజు ననుమతిఁ బొందిగాని యేరికిం జొరరానిపురము నేరీతిఁ బ్రద్యుమ్నుఁడు ప్రవేశింపఁ గలఁడని, శ్రీకృష్ణుఁడు తలపోయుచుండఁగా నాయజ్ఞములో భద్రుఁడను నటునికిని బ్రాహ్మణ వటువులకును వాగ్వాదము జరుగుకాలములో, వటువులు భద్రునుద్దేశించి

"సీ. ఏము ప్రముచ్చులమె యూహింప ప్రముచ్చుఁదనాల
పుట్టిన యిండ్లు మీ బోంట్లకాక
యాటవాండ్రని నమ్మి యనుమతింపఁగ నెట్టి
పురమైన నశ్రమంబుననుఁ జొచ్చి
పగలెల్ల నాటల భ్రమయించుచును సందు
గొందులెల్ల నెఱింగి కొనుచురేలు
కన్నగాండ్రగుచు నంగళ్ళు ప్రవేశించి
యందు నెంతటివార లడ్డమైనఁ

తే. జిక్కడఁచుచుఁ బేను గ్రుక్కిన పాటిగా
నిష్టమైన యర్థ మెల్లఁ బడసి
బ్రతుకుచునికి మీ స్వభావ మింతయును ద
ప్పదు యథార్థ మనుచుఁ బలుకుటయును.”

(ప్రభా. ఆ. 1, ప. 108)

ఆ మాటలనే తనయపేక్ష కుత్తరంబుగ వనజాక్షుఁడు గ్రహించి తన యుపాయము సిద్ధించెఁగదా యని సంతసించి ప్రద్యుమ్నాదుల నటవేషమున వజ్రనాభపురికింబంప నిశ్చయించెను. నటవేషముననున్న ప్రద్యుమ్నుఁడు వజ్రనాభుసభలో నటించుచుఁ జెప్పిన

“చ. సకలవిశేషశోధనకుఁ జాలినయో నెరజాణ వజ్రనా
భకులవతంసరత్నము ప్రభావతిరోహిత కంటకంబు తా
వకమగు చూపునాపయిఁ బ్రవర్ధితరాగతఁ బర్వెఁగాన న
త్యకలుషవృత్తి నా సుకృతమంతయు నేఁడునుమీ ఫలించుటల్.

తే. నీకు నామీఁదఁగల యట్టి నెయ్యమును, మ
హాదరము నీవు పనిచిన హంసి చెప్ప
నాత్మలో ననవరత నాట్యప్రసంగ
మున నిను భజించు వేడుక మనము నాకు.”

(పభా. ఆ. 4, ప. 105, 106)

అను పద్యములును మఱుఁగుననుండి చూచుచున్న ప్రభావతికిఁ దనకూర్మిఁ దెలుపునట్టివ కాన కథకు ననుకూలములే. ఇట్లే యన్ని విషయములును గథానుసారము వచ్చునవియేకాని, 'ముగ్గురు మూఁడు లోకములైన ముసలిది యమలోక మను మాడ్కిఁగథను జీల్చి చెఱుపునవిగావు.

## భావలోపములు

రచనాదోషములు లేకున్నను గళాపూర్ణోదయమునకన్న నిది నికృష్టమనుటకు భావలోపములు కారణములు. ఇందులో వచ్చు స్త్రీపురుషులు గొందఱే. అందును గృష్ణాదులు పురాణపురుషులు. వీరి సమాచారము ప్రాఁతకథ. ఇఁక ప్రద్యుమ్నుఁడన్ననో విరహాది వేదనలకు నిదానమైన ప్రబంధపురుషుఁడేకాని యెక్కువ పరివృత్తి గలవాఁడు గాఁడు. ఇఁక ప్రభావతియన్ననో, నాకుం జూడ నెంతయు నసహ్యురాలు! రూపమున్నది. నాథుఁడెప్పుడు వచ్చి

పైబడునను తహతహ దట్టముగ నిండియున్నది. రూపమును గామావేశముం దాల్చిన పాతివ్రత్య మున్నం జాలునా ? ఇందులోని శృంగారమనునది జావళులకుఁ దోడుపోయినది ! తండ్రికిఁ బతికిని యుద్ధము సంభవించెఁగదా ఎవరు గెల్చినను దనకు దుఃఖమేగదా యను నాలోచన యీ పతివ్రతా శిరోమణి మనసున కేల తట్టును ? ప్రద్యుమ్నుఁడు భార్య నుద్దేశించి 'నీ తండ్రిని జంపకున్న మన బ్రతుకు నిలుచు మార్గమెద్దియులేదు' "ఒండొకత్రోవఁ ద్రొక్కఁగాఁ గూడద, యేమి సేయుదును ఘోరవిచారము పుట్టె నాత్మలో" నని పలుకగా, దేవిగారు, "విభునిం దముఁ గాచికొనంగ వేఱు త్రోవ నెమకి కానకంతఁ బితృవత్సలభావముఁ బాఱనూకిన" దఁట ! ఈ భావము నీ మహాకావ్యమున నింతకుముం దెక్కడను జూపినది కాదు. అణుమాత్రమైనఁ దాల్చియుండె ననుటకుఁ జిన్నె లెవ్వియును లేవు. మఱి యెంతో గారాబముతోఁ జూచుచుఁ, గోరిన కోర్కెలెల్ల నడిగిన మాత్రన దీర్చు కన్నతండ్రి కనుగప్పి గాంధర్వ వివాహక్రీడకుఁ జొచ్చిన కన్యామణి ! అట్లగుట నీమెకుఁ బితృ వత్సలభావ మెక్కడిది ? ఉండెఁబో, ఎంతో భద్రముగ మన కెవరికి నెఱుఁగఁబడకుండునట్లు ఎక్కడనో పాతిపెట్టినది ! తండ్రిం గూర్చిన హృదయాందోళన మేమేని గలదా ! హిందూపతివ్రతలకు నుండరాదేమో ! మన శాస్త్రఘోషలలోఁ బరిచయముగలవారి నడిగి తెలిసికొనుండు. ఇట్లు ప్రభావతి మన సన్యాసులవలె తనకు లేని దాని ధైర్యముతోఁ బారనూకి

"క. తాన చని మూల నున్న య
నూన తదీయాసిఁ దెచ్చి యొసఁగి గెలువుమీ
దానవపతిఁ దక్కిన యను
మానము మానుమని పలికె మానవతి పతిఁ!"

(ప్రభా. ఆ. 5, ప. 198)

అదిరా ! సౌకుమార్యము, సౌమనస్యము మొదలగు కోమల గుణంబుల యపరావతారముగదా యీ మానవతి! ఈపరమపవిత్రు రాలితో ద్రౌపదిఁ బోల్చి చూడుఁడు ! భీమసేనుఁడు కీచకవధార్థమై ప్రతిజ్ఞఁ జేయుచు

"తే. ఎల్లి యెల్ల విధంబుల నెందుఁజొచ్చె
నేని, నాధర్మతనయుండు దానవచ్చి

యడ్డపడెనేని, నీవ పెంపారు కరుణఁ
గాచితేని నాచేఁ బడుఁ గీచకుండు."

(భా. విరా. అ. 2. ప. 232)

అని ద్రౌపదితోఁ గఠినాక్షరంబుగాఁ జెప్పుటలో, నాపాంచాలి, తనకట్టి యవజ్ఞ సేసినను, నాసూతుఁడు కామాంధుండు గావుటఁ బశ్చాత్తాప పాత్రుండని కనికరించి క్షమించి కావఁజూచునంత యుదారచిత్తురా లని ధ్వనిఁ గల్పించినందున నామహాదేవికిఁ గొఱఁతఘటిల్లెనా ?

## పాతివ్రత్యతత్త్వము

నడవడియను వస్త్రమమూల్యముగా కుదురవలయునన్న నొకే తరగతి పోగులు రంగులుఁ జేర్చినఁ జాలునా ? నానావిధములైన వర్ణములుఁగల తంతువులు విచిత్రరీతి నొండొంటికి వన్నె యలవడు మాడ్కి మిశ్రపఱిచినఁగదా నాణెము సిద్ధించును ? ఈ తత్త్వము నెఱుంగమింగాదె పతివ్రతలన్న నొక్క పతిచింత దప్ప నింకేదియు లేని మూఢురాండ్రని భ్రమించియుండుటయు, తద్ద్వారా దేశమునకే కాదు స్త్రీలకుసైతము దైన్యకారణములైన నీతుల బోధించుటయును! ఒకానొక పతివ్రత పురుషుఁడెవతెనో యొక స్త్రీని గోరిన దానిని వలపించి తేఁబోయెనఁట ! అందుచే నామెకు పంచభూతములను వశపరచుకొనునంత మాహాత్మ్యము సేకుఱెనఁట ! భార్యను దూతిక గాఁ జేయువాఁ డెంతమాత్రపు మగవాఁడో భర్తకై యన్యస్త్రీలఁ జెరుప జూచునదియు నామాత్రపు టాఁడుదియే ! పతియేయఁట దైవము ! వేఱు దేవుఁడు, దయ్యము, దేశము, జాతి, మానము, గౌరవమును దేనిని సడ్డసేయరాదఁట ! ద్రౌపదీదేవి ఉద్యోగపర్వములోను మరి కొన్నియెడలను జేసినరీతిఁ బురుషులకు వ్యతిరిక్తముగా మాట్లాడుట మహాపాపము ! పురుషుని వాక్యము నపౌరుషేయమగు వేదముగా భజించుటయ శాస్త్రవిహితధర్మము, కర్మము ! ఈ దౌర్భాగ్యప్రలాప ముల మొత్తపు టర్థమేమనఁగా "మగవారమైన, మాకు నాఁడువారైన మీరు బానిసలుఁగా నుండుఁడు. మఱి మా పనులన్ననో కారణముఁ జెప్పి న్యాయములు గౌరవప్రాప్తములు అని చూపఁగాదు. ఏలనన, రాష్ట్రము, స్వాతంత్ర్యముఁ గోలుపోయి దాసులమై యుండుటఁబట్టి యొరుల కనుసన్నల మెలఁగవలయునేకాని, క్షాత్రభంగిని మానము మనస్సాక్ష్యము నిరూపించిన త్రోవఁబోవ మా వలనఁగాదు. అట్లగుట మా చర్యలంగూర్చి చర్చింపకుఁడు, ఏమీయని యడుగకుఁడు, మీ రట్లు చేసితిరేని బయటనేగాదు, మూలింటఁగూడ మాకు గౌర

వము దక్కదు. అందఱియొద్దఁ దన్నులు వడి వచ్చువారము. మీరైనఁ బూజింపకున్న మా కభిమాన మబ్బు టెట్లు? మేము దాసులము. మీరు మాకు దాసులైనచో దాసానుదాసు లయ్యెదరు. అనఁగా దేవసన్నిభులరు, సేవచేత దేవతలగు సూక్ష్మము ఈ కర్మ భూమిలోఁ దొలుతఁ గనిపెట్టఁబడిన హాయియైన తంత్రము! దాని లాభమంతయు ధారాళముగ మీరే యనుభవింపుఁడు!" అనుట! పతిని దప్ప నింకేమియు స్మరింపఁగూడదఁట! ఈస్వరూపములనే యవికలమగు దృష్టితోఁ జూచుచుండిన నెటువంటివారికైనఁ గనులు నిల్చునా? ఎంతగొప్ప ప్రతాపమూర్తులైన శూరులు వీరులని వీరినే యెంచుచుండుట సాధ్యమగును! దేశము గొప్పగానుండు కాల ములో స్త్రీలకు నొక కుటుంబము మీఁదనే కాదు, రాజకార్యములు, చరిత్రాది శాస్త్రములు, సైన్యములు మొదలగు మానరక్షకప్రకృతులు ఇత్యాది లౌకికగణంబుల యందెల్ల శ్రద్ధాదృష్టి వాఱుచుంట సహజము. గాంధారి ద్రౌపది మొదలగు భారతస్త్రీలను, గార్గీ మైత్రేయీ ప్రభృతులగు ఋగ్వేద యుగములోని లోకోత్తరచరిత లును, మనవారినుండియే యీవిషయమునం జూపఁదగు సాక్షులు. రాజ్యము స్వాతంత్ర్యములేని దయ్యెనేని నిల్లువిడిచి బయటికి వచ్చుటకు భయము. ఏలన, తమవారికిఁ దమ మానము రక్షించు శక్తిలేమిం జేసి పౌరుషోద్ధరులైన పతులయెడ స్త్రీలకు స్వాభావికమగు తవులు మెండు. అదిలేని పతులు ఇఁక నీతిశాస్త్రములచేతనైనను దమయందు వారి హృదయములను భద్రపఱచికొందమను యుక్తిఁ బన్ని పతివ్రతాలక్షణములం బ్రకటించిరేమో! సాహసవంతుఁడు జనముల నాకర్షించుట నీతిచేఁగాదు. మఱి ప్రకృతిచే. మఱియు, 'ఇల్లు గ్రామము కులము వీనిం దప్ప, పెఱవాని జోలి మనకేల? అధికప్రసంగము లీనాళ్ళలో నపాయకరములు.' "ఉడుమున కేటికయ్యా ఊరిలో పెద్దతనము!" అని యన్ని పరాక్రమములు నుడిగి గుమ్మము కచేరీలకు దిగిరేని స్త్రీలకే కాదు పురుషులకు సైతము గృహచింత దప్ప మఱేమి యుండగలదు? పాతివ్రత్య మొక్కండు దక్క స్త్రీలకే ధర్మములు కూడవను సిద్ధాంతము దేశమునఁ బురుషులు భంగమునకు లోనయి నిరాశచే నిరుద్యోగులై యుంటచే వచ్చిన చేటేగాని, బాగుగా విచ్చలవిడి వర్తించు ఋషుల శాసనముగాదు. ఇది యట్లుండె.

ఒకవేళ ప్రభావతీదేవి రాక్షసరాజు కూఁతు రగుటం జేసి కఠి నాత్మురాలుగ నుండుట ప్రకృతి నిషిద్ధముగాదని యందురేమో;

ఆయమ్మయొక్క జననవృత్తాంతమును వర్ణించుచు, నీ త్రిలోక సుందరి సామాన్యజనులను వేగిరము వేగిరముగ వక్కముక్కలుగా సృజించు బ్రహ్మచే సృజింపఁబడినది గాదనియు, నిష్కారణముగ నా త్రిపురసుందరి స్వయముగ నిదానించి చూచి సర్వసామగ్రులం గూర్చి బాగునకుఁ దెచ్చిన కన్యామణియనియుఁ గవి చెప్పియుండు టంబట్టి, యా వాద మొప్పుకోఁదగినది గాదు.

## ప్రాచీనుల మోహతాపము

నిజము చూడఁబోయినఁ బ్రభావతీప్రద్యుమ్నము శైలి నొక్క దానిం దప్ప తక్కిన విషయములలో సామాన్య ప్రబంధముల మీఱి నది గాదు. కథ మిక్కిలి సన్నము. చిత్రరూపములు, దూతికలు మొదలగు మధ్యవర్తులమాటలు, వీనిచే నాకాలమువారికిఁ గామాగ్ని యున్నట్టుండి ప్రభవిల్లి మనసులను దేహములను దహింపఁజేయు నంత తైక్ష్ణ్యమును బహుత్వరలోఁ గాంచుట సర్వసాధారణమే మో! బహుశః వారెల్ల నెండిన కట్టెలో! ఇప్పు డింగ్లీషు ముక్కలు చదువు వారు 'నేరుగాఁ జూచి మాట్లాడిననే కాని యీ దందహ్యమానత మాకుఁ బట్టుపడదు' అని యాక్షేపించుటఁ జూడఁగా కాలవైప రీత్యము బోధపడియెడిని. మనది ప్రత్యక్షమోహము. మన పెద్ద లింతకన్న నుద్రేకముగలవారగుటంబట్టి వినిననేచాలును! గుప్పున మండెడివారు. వకళ్ళమూలమైె పరోక్షమోహమువారికి ప్రధానము. అయిన నాకొక సంశయము. మన పెద్దలు వేదవేదాంత వికాస భాసుర విచిత్ర చరిత్రులే! రాగరహితులే. శమదమాది సంపత్స మేతులే! అట్టుండియు నీయొక్క విషమసమయంబున మాత్ర మేల యింత చాంచల్యము వడసిరో తెలియఁజాలముగదా! అవ్యా జాద్భుతములలో నిదియొకటి. నిర్హేతుక జాయమాన చిత్తవిభ్రమ మును వేదాంతవిచారమును సమ్మేళించి యుండుట యాశ్చర్యము గదా! ఆశ్చర్యమైనను అప్రకృతమా? కాదేమో! ఎట్లన, ఇంద్రి యముల నిగ్రహింపవలయు నిగ్రహింపవలయునని జపముచేయు చుండువారు, ఆ యింద్రియములయందే నిగాయుంతురుగాన, నదియొక విధమైన యున్మాదహేతువు. కాకున్న నందఱకన్న ముందుగ జితేంద్రియులైన మహర్షు లప్సరసలఁ జూచి చూడక యున్న యేల యువ్విళ్లూరుదురు! గంతులు వేయుదురు! మఱియు భరతఖండము క్షీణదశకు వచ్చినదిమొదలు గొప్ప గొప్ప ప్రయత్నములు గొంతెమకోరికలైనందుననేమో కాని తుచ్ఛములు

వము దక్కదు. అందఱి యొద్దఁ దన్నులు పడి వచ్చువారము. మీరైనఁ బూజింపకున్న మా కభిమాన మబ్బుటెట్లు? మేము దాసులము. మీరు మాకు దాసులైనచో దాసానుదాసు లయ్యెదరు. అనఁగా దేవసన్నిభులరు, సేవచేత దేవతలగు సూక్ష్మము ఈ కర్మ భూమిలోఁ దొలుతఁ గనిపెట్టఁబడిన హాయియైన తంత్రము! దాని లాభమంతయు ధారాళముగ మీరే యనుభవింపుఁడు!" అనుట! పతిని దప్ప నింకేమియు స్మరింపఁగూడదఁట! ఈస్వరూపములనే యవికలమగు దృష్టితోఁ జూచుచుండిన నెటువంటివారికైనఁ గనులు నిల్చునా? ఎంతగొప్ప ప్రతాపమూర్తులైన శూరులు వీరులని వీరినే యెంచుచుండుట సాధ్యమగును! దేశము గొప్పగానుండు కాలములో స్త్రీలకు నొక కుటుంబము మీఁదనేకాదు. రాజకార్యములు, చరిత్రాది శాస్త్రములు, సైన్యములు మొదలగు మానరక్షకప్రకృతులు ఇత్యాది లౌకికగణంబుల యం దెల్ల శ్రద్ధాదృష్టి వాఱుచుంట సహజము. గాంధారి ద్రౌపది మొదలగు భారతస్త్రీలను, గార్గి మైత్రేయీ ప్రభృతులగు ఋగ్వేద యుగములోని లోకోత్తరచరితలును, మనవారినుండియే యీవిషయమునం జూపఁదగు సాక్షులు. రాజ్యము స్వాతంత్ర్యములేని దయ్యెనేని నిల్లువిడిచి బయటికి వచ్చుటకు భయము. ఏలన, తమవారికిఁ దమ మానము రక్షించు శక్తి లేమింజేసి పౌరుషోద్ధరులైన పతులయెడ స్త్రీలకు స్వాభావికమగు తవులు మెండు. అదిలేని పతులు ఇఁక నీతిశాస్త్రములచేతనైనను దమయందు వారి హృదయములను భద్రపఱచికొందమను యుక్తిఁ బన్ని పతివ్రతాలక్షణములం బ్రకటించిరేమో! సాహసవంతుఁడు జనముల నాకర్షించుట నీతిచేఁగాదు. మఱి ప్రకృతిచే. మఱియు, 'ఇల్లు గ్రామము కులము వీనిం దప్ప, పెఱవాని జోలి మనకేల? అధికప్రసంగము లీనాళ్ళలో నపాయకరములు.' "ఉడుమున కేటికయ్యా ఊరిలో పెద్దతనము!" అని యన్ని పరాక్రమములు నుడిగి గుమ్మము కచేరీలకు దిగిరేని స్త్రీలకే కాదు పురుషులకు సైతము గృహచింత దప్ప మఱేమి యుండగలదు? పాతివ్రత్య మొక్కండు దక్క స్త్రీలకే ధర్మములు కూడవను సిద్ధాంతము దేశమునఁ బురుషులు భంగమునకు లోనయి నిరాశచే నిరుద్యోగులై యుంటచే వచ్చిన చేటుగాని, బాగుగా విచ్చలవిడి వర్తించు ఋషుల శాసనముగాదు. ఇది యట్లుండె.

ఒకవేళ ప్రభావతీదేవి రాక్షసరాజు కూఁతు రగుటం జేసి కఠినాత్మురాలుగ నుండుట ప్రకృతి నిషిద్ధముగాదని యందురేమో;

అయమ్మయొక్క జననవృత్తాంతమును వర్ణించుచు, నీ త్రిలోక సుందరి సామాన్యజనులను వేగిరము వేగిరముగ వక్కముక్కలుగా సృజించు బ్రహ్మచే సృజింపఁబడినది గాదనియు, నిష్కారణముగ నా త్రిపురసుందరి స్వయముగ నిదానించి చూచి సర్వసామగ్రులం గూర్చి బాగునకుఁ దెచ్చిన కన్యామణియనియుఁ గవి చెప్పియుండు టంబట్టి, యీ వాద మొప్పుకోఁదగినది గాదు.

## ప్రాచీనుల మోహతాపము

నిజము చూడఁబోయినఁ బ్రభావతీప్రద్యుమ్నము శైలి నొక్క దానిం దప్ప తక్కిన విషయములలో సామాన్య ప్రబంధముల మీఱి నది గాదు. కథ మిక్కిలి సన్నము. చిత్రరూపములు, దూతికలు మొదలగు మధ్యవర్తులమాటలు, వీనిచే నాకాలమువారికిఁ గామాగ్ని యున్నట్టుండి ప్రభవిల్లి మనసులను దేహములను దహింపఁజేయు నంత తైక్ష్ణ్యమును బహుత్వరలోఁ గాంచుట సర్వసాధారణమేమో! బహుశః వారెల్ల నెండిన కట్టెలో! ఇప్పు డింగ్లీషు ముక్కలు చదువు వారు 'నేరుగాఁ జూచి మాట్లాడిననే కాని యీ దందహ్యమానత మాకుఁ బట్టుపడదు' అని యాక్షేపించుటఁ జూడఁగా కాలవైప రీత్యము బోధపడియెడిని. మనది ప్రత్యక్షమోహము. మన పెద్ద లింతకన్న నుద్రేకముగలవారగుటంబట్టి విననేచాలును! గుప్పున మండెడివారు. వకళ్ళమూలమైన పరోక్షమోహమువారికి ప్రధానము. అయిన నాకొక సంశయము. మన పెద్దలు వేదవేదాంత వికాస భాసుర విచిత్ర చరిత్రులే! రాగరహితులే. శమదమాది సంపత్స మేతులే! అట్టుండియు నీయొక్క విషమసమయంబున మాత్ర మేల యింత చాంచల్యము వడసిరో తెలియఁజాలముగదా! అవ్యా జాద్భుతములలో నిదియొకటి. నిర్హేతుక జాయమాన చిత్తవిభ్రమ మును వేదాంతవిచారమును సమ్మేళించి యుండుట యాశ్చర్యము గదా! ఆశ్చర్యమైనను అప్రకృతమా? కాదేమో! ఎట్లన, ఇంద్రి యముల నిగ్రహింపవలయు నిగ్రహింపవలయునని జపముచేయు చుండువారు, ఆ యింద్రియములయందే నిగాయుంతురుగాన, నదియొక విధమైన యున్మాదహేతువు. కాకున్న నందఱకన్న ముందుగ జితేంద్రియులైన మహర్షు లప్సరసలఁ జూచి చూడక యున్న యేల యువ్విళ్లూరుదురు! గంతులు వేయుదురు! మఱియు భరతఖండము క్షీణదశకు వచ్చినదిమొదలు గొప్ప గొప్ప ప్రయత్నములు గొంతెమకోరికలైనందుననేమో కాని తుచ్ఛములు

స్వాత్మైక విషయములునైన సుఖములం దప్ప నింకెందును బుద్ధిపాఱుట యరుదాయెను. చిల్లరచింత లెక్కువ. కీర్తికరము లసాధ్యము లైనందున భోగములే పరమార్థములని గణింపవలసిన వారమైతిమి. జీవితమనునది యుండఁగా కాలక్షేపము పొంటెనైనఁ బురుషార్థ మొకటి యుంచుకొనక తీఱునా! "వ్రతముపోయె. యశస్సు పోయె! ఇంద్రియానుభవమైన దక్కనీ" యని మనకుం దెలియక మన మనసీజాడల కుపక్రమించెనో! చూడుఁడు. ఐరోపా వారు శృంగారవర్ణన మెంతో దివ్యముగఁ జేసియున్నారు. వారు రాజసతేజులు. మనలో నాలుకంబట్టినది సత్త్వగుణము. మనసున బట్టినది తమోగుణము.

## పాశ్చాత్యుల శృంగారవర్ణనము

వారియొక్కయు మనయొక్కయు శృంగారమునకు ముఖ్య తారతమ్యము లేవనగా: మనవలె వారంగవర్ణనమంతగాఁ జేయరు. చేసినను మొగము కన్నులు మొదలగు బాహిరభాగములమాత్రము ప్రశంసింతురు. మనలో నఖశిఖపర్యంతము విప్పివిప్పి చూపుట యందఱు నాశ్రయించిన కావ్యలక్షణము. పడకటింటిలోనికి వెళ్ళిన వెనుకఁగూడ చెలికత్తె లామెను వదలినను వదలుదురుగాని కవి యేమో యొక నిముసమైన వదలఁడు. ఱెప్పవేయక యట్లే చూచు చుండును. 'రవిగాననిచోఁ గవిగాంచుట' మనలోని ముఖ్యసంప్ర దాయము. వేదాంత విద్యాదీప్తిమంతమైన యీ పుణ్యభూమిలో నీ రుచి ముదిరి యుండుటకుఁ గారణమేమన, స్త్రీలను జాగ్రత్తగ మఱుఁగున నుంచుటయే! శీలరక్షణార్థము చేయఁబడిన యేర్పాటే యశ్లీలములకెల్ల మూలము! ఎట్లన, నివారింపఁబడిన దానికుండు చవి యనివారితముల కుండదు. చూడవలదన్ననే గదా యన్నింటి కైన నందము! సమ్మోహనాస్త్రమన్న నిదే! వలదని యడ్డగించితి మేని దానియందలి వలపు అనర్గళమగును. దమమును జెఱుచునది నిర్బంధము. నిలుపునది స్వాతంత్ర్యము. 'అతిరహస్యముఁ బట్ట బయలు' అన్నట్లు ఎయ్యది గుప్తమో దానియందే యందఱకు దృష్టి. ఇంకను బరిష్కారముగ సాంగోపాంగముగ విమర్శించి చూతమను కుతూహలము సహజము. మనదేశములో నెవతెయైన నొక స్త్రీ నాగరికత గలయది వీథిలోఁ బోవునేని, ఆ యూరివారి కన్నులన్నియు బిఱ్ఱబిగిసి యామెపైఁబడు. మీకుఁ దెలియదా? ఈ మర్యాదలేమి కేమి కారణమో పచ్చిపచ్చి విశదవర్ణనలకును

నదియె కారణము. చూపునకుండు తహతహను దెరలచే నాఁప వచ్చును. మనోదృష్టి మేరమీఱి చూడఁ బ్రయత్నించిన నివారక సాధనమేమి? సౌమనస్యము. అది మనవారిలో నింకను దగినంత వృద్ధికిరామి తెల్లంబు.

అంగముల వర్ణించునపుడును, ఐరోపాలోని కవులు ఆ యంగము లేరీతిభావమును బ్రదర్శించుననుటఁ జూపుదురేకాని, భావస్థగీతంబులుగాని యవి యసంభావ్యములని వానిమాటఁ దలపెట్టరు. భావములను వెలువరించుట ముఖనేత్రాదులకుఁగల చక్కందనమున కాదిమమైనట్టియు హృద్యమైనట్టియు లక్షణము. వీనిలోఁ గొన్నింటిమాత్ర మనుభావము లనుపేర మన శాస్త్రకారులు గణించి, వారాంగనల యభినయము రీతి, శిక్షమేరకు నడుపఁబడు త్రిప్పుటలలోఁ జేర్చిరిగాని, మొత్తముమీఁద నంగవర్ణనమును మనసుతోఁ గలసినట్లు చేయుశక్తి, యీ యాధ్యాత్మికదేశములో బ్రుంగుడువోయి యెన్నో శతాబ్దములైనవి.

స్త్రీల గుణగణములను శ్లాఘనతో వర్ణించుట పాశ్చాత్యుల లోని సదాచారము. ఏలన, గుణముల గణింపక యాకారమును మాత్రము చూచి వలపుగొనుట యా జనములలో నభావ్యము. స్త్రీపురుషులు ధారాళముగ నొండొరులతోఁ గలసి మెలసియుందురు; కాన. రూపమునకుఁ దళుకు తక్కువ. ఇఁక వలపు జనింపవలయు నన్న నడవడి, చరిత్రము, చదువు, సద్గుణములు, కీర్తికరములగు కార్యములయం దాసక్తి మొదలగు నాత్మ సంబంధములైన యోగ్యత లావశ్యకములు. కావున నాయికా నాయకులకు ివి యుద్దీపనవిభావములగుట వీనిని వర్ణించుట శృంగారకావ్యములలో ముఖ్యము.

మనవారిలో స్త్రీలకు మనోవికాసములేనిగతి పట్టినది. కావున రూపమొక్కటియ మోహమున కాలంబనము పశుప్రాయకృత్యమే కామితార్థము. వీనికిందగిన వర్ణనలమాట చెప్పవలయునా! అపారములు.

పురుషులు గడింప నెంచు సాహసోద్యమములలో సైతము స్త్రీలు తోడుపడఁగలవారని పాశ్చాత్యులనమ్మిక. ప్రకృతిశాస్త్రములు, తత్త్వములు మొదలగు విద్యలఁ గృషిచేయుటయందును భార్యలు భర్తలతో సంగమింతురు. వారు సహాధ్యాయులైన స్నేహితు లట్లు నానావాంఛితంబుల సఫలముఁ జేయఁ జూచుచుందురుగాన, శృంగార కావ్యములు శుక్రాచార్యుల రీతిని ఒంటికంటితో నొకే

స్థలముననే తిక్కెక్కినట్లు చూచుచుండునవి గావు.

హిందువులలో స్త్రీలకుండు స్థితిని నేనేల వివరింప? వంటిల్లు పడకటిల్లు ఈ రెంటికి వెలియైన నెందులకుం బనికిరాదు! పురుషులకు వారికిని దేహసాంగత్యమేకాని మనస్సాంగత్యమెక్కడిది? వారు చేరి మాట్లాడుట యరుదు. మాట్లాడవలయునని నవీన నాగరికులు పంతము వట్టినను అన్నవస్త్ర విహారాది సరసములు దప్ప నింకేపలుకులకు వీలులేదు! కావుననే కావ్యకన్యకలు సంభోగ విషయములందప్ప నింకే ప్రపంచముఁ దెలియనట్టి వారుగా నుండుట. రాజకన్యలు గావున పాపము వంటపనియుం దెలియదు. మఱి తెలిసిన దొక్కటే. ఈ దేశములోని స్త్రీలు విషయవాంఛాపూర్తికి ననుకూలములయిన పాత్రములుగఁ జూడఁ బడుచున్నారేకాని, పురుషులతో సమానముగ నన్నివిధముల వెలయు శక్తిగలవారుగాఁ జూడఁబడుటలేదు. ఇప్పటివారిస్థితిలో నట్లు చూచుటకును గాదు. బ్రిటిష్‌వారి ప్రోత్సాహము సౌరాజ్యము వీనిచే నిఁకముందు బాగుపడుదురేమోకాని, యా యౌన్నత్యము వారధిష్ఠించువఱకు జీవించి యుండి సుఖించుటకు నావంటివారు మార్కండేయులుగారు!*

కామమనునది పురోవృద్ధిహేతువని యూరోపియనుల భావన. ఎట్లన వరించు స్వాతంత్రముండఁబట్టి యేదేనొక హృదయాకర్షకమగు విశేషము గలిగియో నేర్చియో యున్నంగాని యేకాకులుగా జీవనము గడుపవలసినదే. కాఁబట్టి స్త్రీల మెప్పుకొఱకై యెల్లరు శ్రమకోర్చి శక్త్యనుసారము గొప్పతనము నందఁజూతురు. మఱియు స్త్రీలును దెలివి తేటలఁ దేఱినవారుగాన నట్టివారి సావాసము శ్రేయోహేతువు. ఒకానొక కవి యాదేచించినరీతి శూరుని లక్షణమేమనఁగా.

"తే. ఒక్క కాంతనుగోరి, మహోద్యమములఁ
బూని సాధించుటలచేతఁ బూజసేసి
రాజ్యమును దైవమును భార్యరాగమడరఁ
బ్రీతులం జేయుటయ కాని వేఱుగాదు." (టేనిసన్)

అట్లగుట స్త్రీలమీఁది మోహము వీరకృత్యములకుఁ బ్రేరేపకము. అభ్యుదయకారకము. హిందూదేశములో స్త్రీలు అధఃపతితలై యున్నందున వారి వెంటం బోవుట పాతాళ యాత్ర. మఱి వెంటం బోకున్నఁ దీఱదు గనుక, వారిని, విద్య, స్వాతంత్ర్యము మొదలగు

---

*గాంధీమహాత్ముని ప్రభావముచే నీ పరిణామము ఇటీవల సృష్టికి వచ్చినది. ఇందునకు దేశసేవిక లొక దృష్టాంతము.

దానంబులచేత, నుత్తమ పదవికిం దెచ్చిననేకాని యీ దేశ మెన్నటికి శుభములకుఁ బాత్రంబు గాదు. ఇపుడు వేయి సంవత్సరములుగ మన దేశములలో నుత్పన్నములగు గ్రంథములలో స్త్రీలు గొప్ప దశకు బురికొల్పు వారనుమాట తుత్రాగాలేదుగదా! ప్రబంధములలోని నాయికలు 'నామీఁద వచ్చిపడు' మనుటదప్ప నింకే యశస్కరములగు పాటులకైన నాయకులఁ బురికొల్పుట చూచినారా? ఇది శుద్ధ పశుప్రాయమైన కేళి. దీనిఁ గామ మనరాదు. అన్నచోఁ బురుషార్థమును సూచించు నా పదము చెడును! కామినులు గర్హణీయ లనియు నికర్షహేతువు లనియు విరక్తివ్యాఖ్యానము లెన్నియో యున్నవి. తొలుత మగవారు మగతనము గోలుపోవుటచేఁగదా యాడువా రీ పాడుస్థితికి వచ్చిరనుట మఱచి తమ దోషములచేఁ దప్పులై, కీడ్వడినవారిని, దామే దూషించుటం జూడ, మనవారు మనుష్యులా కారా యను సంకోచము రాకమానునా? ఇఁకనైన వారిని మీఁదికిఁ దేవలయునన్న ప్రోత్సాహ వాక్యములచే ధైర్యవతులం జేయవలయునేగాని తిట్లచే వారు ముందుకు రాఁజాలుదురా?

## మిశ్రరసములుగాఁ గావ్యములఁ దీర్చుట మంచిది

వట్టి శృంగారమును మాత్రము వర్ణించుట యా రసమునకు వైరస్యముఁ గలిగించుట. మనుష్య ప్రకృతి యెట్టిదనఁగా నే మార్పునుజెందక యేకరీతినియుండు వస్తువులయందు అవధానము చాలకాలము నిలుపఁజాలనియది! అవధానమును సుఖమును సమన్వితములు. ఎయ్యది తృప్తికరమో దానియందు మనసుంచుట సులభము, సహజమును. క్లేశకరముల మీఁద బలవంతపెట్టినను మనసు నిలకడఁ గాంచదు. భోజనపువేళ మితముగ నేయి వేసికొనిన రుచి, అది దప్ప వేఱేమియు లేకున్నను, మఱి యమితముగ నయ్యది స్వీకరింపఁబడినను దానియందు రోయింపు జనించును, ఆరోఁతతోడ మనసును ఇతర పదార్థము లేమే నున్నవా యని కోపముతో నలుదెసలను భార్యను పరికించును. ఐరోపాలోని కవులు* ఈ తత్త్వము నతిక్రమింపక వ్రాసిరి. అనఁగా కావ్యము లనేక

---

* ఇచట నైరోపాలోని కళలఁగూర్చి చెప్పఁబడిన స్తుతియంతయు భారతాదుల రచించిన మనపూర్వులయందును జెల్లును. చెల్లనివారెవరనఁగా దేశక్షయకాలపు హిందూకవులగు ప్రబంధకారులు.

క్రమముగఁ బోనీక రసముల మిశ్రము చేసి యన్నింటియందు నభిరుచి స్థిరముగ నెలకొను నట్లొనర్చిరి. మన శృంగారకావ్యములు ఏకరస ప్రధానములగుట నీరసములు, వెగటు, రోఁత ఇత్యాది జుగుప్సారసములకు నాకరములు.

## నీతికిఁ గవితకుఁ బ్రత్యక్ష సంబంధము లేదు

ఇట్లనుటచే నిటీవలి మన శృంగార కావ్యములు నీతి బాహ్యములు, చెడ్డవి యని రేఁగుట కారంభించిన పరమపార్యశుద్ధ్య ధురంధరులలోఁ జేరినవాఁడనని యెన్నబోకుడీ! కావ్యము, శిల్పము, నీతిశాస్త్రము గాదు. ధర్మశాస్త్రముఁ గాదు. శిల్పముయొక్క యుత్కర్ష నికర్షముల నేర్పఱుప వలయునన్న దాని రచనా సంవిధానములఁ బట్టి నిరూపింప నగునే గాని, 'భగవద్గీతలయంత పారిశుభ్ర్య మిందులో లేదు. రామానుజ భాష్యమువలె ముక్తిదాయకము గాదు' అని వాపోవుట నిర్నిమిత్త ప్రలాపము. తుదకు గోప్యములఁ బచ్చిగా వర్ణించినను నీతిశాస్త్రముంబట్టి ఖండించుట తెలివితక్కువ. మఱి రసభంగమా కాదా యనుటయే శిల్పవిమర్శనముయొక్క ఒక్క పరీక్ష. తక్కిన పరీక్ష లిట యధిక ప్రసంగములు. ఆభాసములు. నాకుం జూడ ప్రబంధములయందు మనకుఁ బ్రీతిలేమికిఁ గారణము వానియందు నీతిలేమి గాదు. మఱి రససంపోషకములగు స్థితిగతులకు వెలియై, రసికులకెల్ల నవి వైరస్యము మెండుగఁ గల్పించుట. శిల్పముయొక్క ముఖ్యోద్దేశము మనసును హరించుట. ఈ వశీకరణ శక్తి యుండినయెడ నీతి లేకున్న నేకొదువయు లేదు. అదిలేసిచో నుపనిషత్తుల నుడకఁబెట్టి ధృతియంతయుఁ దీసి యందు నించినను నే ఫలమును లేదు. కావున మన భాషకు నీతి ముదురునట్లు చికిత్స, దోహదము, ప్రాయశ్చిత్తము జేయవలయునను పరమ పారిశుద్ధ్యధురంధరుల కొక దండము వెట్టి దూరముగఁ బొమ్మనుటయే కర్తవ్యము. ఇష్టములేకున్న నీ గ్రంథముల వారు చదువనేల? ఎవరును బతిమాలుకో లేదుగదా! ఇంట్లో గొళ్ళెమువేసి పాపములఁ జొరనీక భద్రముగా నుండినను సరే. మఱి ధర్మోద్ధరణక్రియకై పోలీసువారి శరణుఁ జొచ్చినను సరే! మనత్రోవ మనది.

## కవిత దేశీయుల నడవడిక సూచకము

పాశ్చాత్త్యులయొక్కయు హిందువులమగు మనయొక్కయు శృంగారవాక్యముల తారతమ్య విమర్శనముచేఁ దేలినవి కవిత్వ

తత్త్వ విషయములే కావు. మఱి కాలదేశములచే సిద్ధాంతములైన జనుల జీవితములకును గృతులకును నిత్యసంయోగ ముండుట యింకను ప్రధానమైన యంశము. కావ్యములు ఊహామాత్రము లనుట గొంతవఱకుఁగాని సమగ్రముగ నిజముగాదు. ఎంత యూహింపఁ జాలిననేమి? మనచుట్టుఁబట్టువారల భావముల గతుల స్పర్శ యే మాత్రమునులేని యూహలఁ జేయ మనకు సాధ్యమా? జనుల నావరించియుండు స్థితులు కొంతకుఁగొంతయేని దప్పక కావ్యదర్పణమునఁ బ్రతిబింబింపకపోవు. కావ్యపరిశీలనము చక్కఁగఁజేసితిమేని జనుల నడవడి, చరిత్రము, జీవించువిధము లును బొత్తిగా గోచరింపకపోవు. ప్రబంధములయొక్క దౌర్భాగ్యము దేశదౌర్భాగ్యముయొక్క ప్రతిబింబము. నిష్కారణముగ భాషను బట్టి పీడించిన పిచాచిగాదు.

ప్రభావతీదేవి వర్ణనము తుచ్ఛము

ప్రభావతీప్రద్యుమ్నము నానారస శోభితంబుగాదు. ఉండు నొకరసము సైతము తగినరీతుల విలసనములుగల్గి నానాకారములం దాల్చిన మహోత్తరమాయగా నుండమిచే విసుగు నిచ్చుచున్నది యని తోఁచెడివి. "లోకోభిన్నరుచి" నామాట నా మట్టుకు. ఐనను గారణములజూపుట విధి. శుచిముఖి ప్రభావతీదేవింగూర్చి ప్రద్యుమ్నునితోఁ జేయు దీర్ఘ ప్రసంగముం జూడుఁడు.

"సీ. నెత్తమ్ములనుచుఁ గ్రుస్నెలలంచు
వటఫలశ్రీలంచుఁ దాబేటి చిప్పలనుచు"

అను రెండవ యాశ్వాసములోని 64వ పద్యము మొదల్కొని

"క. ఏయంగకమును భావన
చేయక వ్రాయంగరాదు చేసిననానం
దాయత్తమదిఁ జొక్కఁబ
రాయత్తపు బుద్ధిఁ జెలువ నలవియె వ్రాయన్."
(అను 96వ పద్యము వఱకును)

ఇందుఁగల యశ్లీలదోష మటుండ నిండు. అది మన సదాచారములలో నొకటి. చెలువము శుద్ధముగలేని కుయుక్తులు నుపమాభాసములు నెన్ని! నాభియనునది గంభీరమైన చెఱువఁట! నూగారు మన్మథుని చిమ్మనిఁ గ్రోవియఁట! పయ్యెదయను వలలో

బయటఁ బోయి విహరించి వత్తమని కుచకుంభములు పక్షులరీతిఁ గొట్టుగొనుచున్నవఁట! బొడ్డు నొక సొగసు! అది పొన్నవిరి! ఆయమ్మయూరువులు ఏనుగు తొండములకంటె నెక్కువ! అన్నిఁటి కైనను మీఱిన తుచ్ఛసామ్యముం జూడుఁడు. జంఘలు శాలిగర్భ ములు. వజ్రాల కాంతి నీళ్ళు. అందెలు మళ్ళు. మీఁగాళ్ళు కచ్ఛపములు! బురదయేమో కవి చూపలేదు! ఒకవేళ నీవర్ణనమే కాబోలు! ఇట్టి బలత్కారోపములకుం బూనినచో, గాడిదె, గుఱ్ఱము, క్రోఁతి, కొంగ మొదలగు ప్రపంచకములోని యేవస్తువుతో నైన స్త్రీలఁ బోల్చి వర్ణింపవచ్చుగదా! సరేకాని నాకొక సందేహము. ఇంత విశదముగ భాగభాగమును బెదవుల చప్పరించుచు శుచిముఖి వర్ణించెఁగదా! దాని కీయంగోపాంగదర్శన మెట్లబ్బెనో! పూర్వము కన్యామణులు కోకలువిప్పి తాండవమాడుచుంట గలదా! లేక యందఱికిని వస్త్రములను మానమును వ్యర్థముచేయు దివ్యదృష్టి యుండెనా? మఱియు, పింగళిసూరన్న కృతులలో పాత్రములు సాధారణముగ దీర్ఘచర్చలఁ జేయరు. కవి బహుచమత్కారముగ మాటమీఁద మాటవచ్చి విషయము విశదమగునట్లు సంభాషణ లేర్పఱుచును. నాటకకౌశలమని పేర్కొనఁబడిన ప్రతిభలో నిది యొక కళ. ఈ శక్తిలో నితఁడు తిక్కనతో సమానుఁడన్నను బైమాటగాదు. నిదర్శన మికముందు నివేదింతును. ఇంత సమర్థు డయ్యును అంగవర్ణనాశృంగారమునకుం బూనెనేని యాశక్తిఁ గోలు పోయినవాఁడౌట యెంతయుఁ జింతనీయము. శుచిముఖియొక్క యుపన్యాసము ముప్పది పద్యములకన్న నెక్కువ. ఇంతసేపు ప్రద్యుమ్నుఁడు నోరుచచ్చిన జీవంబుపలె నిలుచుండుటఁ జూడ, అతనికేకాదు, మనకుఁగూడ నలసట! పాత్రములను ముందు నిల్పిన పిమ్మట నెల్లరు నప్పుడప్పుడేమైనఁ జేయుచున్ననే వినోదము. ఒకరు నోరు బ్రద్దలగునట్లు మాటాడుచు తక్కినవారు కొయ్య బొమ్మలరీతిని, పల్లెటూరివాఁడ్రవలెను, నోరుదెరచికొని ఱెప్ప వేయక నిలువఁబడియుండిన ప్రకృతికి రసమునకు రెండిఁటికిని కీడు. సామాన్యులగు కవులలో నీ దోషము లుండిన విచారము లేదు గాని, మహాకవియు సంభాషణరచనలలో దక్షుఁడునైన సూర నార్యుఁడీ లోపమున వ్రాలుట మనసునుగుందించు చెడుగు.

ప్రభావతియొక్క కామనిర్భరత యేవంపుఁబాటుగా దోఁచునే కాని రమణీయమని యెన్నుట దుస్తరము. వచ్చిన యావేశముం జూడుఁడు.

"ఉ. ఇట్టి మనోహరాంగుఁ డొకఁ డెందయినం గలఁడేని, కల్గియుం
గట్టిగ నాకతండు బిగి కౌఁగిటఁజేర్పఁగ వచ్చునేని, నే
నిట్టట్టుఁ గొంకినన్ విడక యిష్టవిహారము లెల్లఁ గాంక్షఁ జే
పట్టి యొనర్చునేని, రసభావము లెట్టివి యొక్కొ యత్తఱిన్!"

(ప్రభా. ఆ. 3, ప. 41)

మఱి చెలికత్తె ప్రభావతియొక్క విరహచిహ్నములను శుచిముఖికిం జూపుట దిలకింపుఁడు.

"సీ. నెలఁత ముక్కరయందు నీలంబుగాదు సూ
తెలిదళుకొత్తు ముత్తియము గాని,
యువిద సందిళ్ళ బాహుపురులు గావు సూ
మితిచూడ నిడిన యూర్మికలుగాని,
సుదతి పాలిండ్లఁ గస్తురి నల్పు గాదు సూ
కనుదోయి కాటుక కప్పుగాని,
రమణి కర్ణికల వజ్రపు దీప్తిగాదు సూ
ప్రాగెంపుదునకల రంగుగాని,
తే. యూర్పువేఁడిమిఁ గృశత బాష్పోదయమున
గండపాండిమ దత్తత్ప్రకారములను
గానఁబడియెడు నోవిహంగమ పురంధ్రి
యింక నీచేతనున్న దీ యింతిబ్రతుకు"

(ప్రభా. ఆ. 3, ప. 87)

చెలికత్తెలీరీతిఁ జెయివేసి విప్పిచూపుటకోర్చెడు రాజకన్యక లెంత సుకుమారులు! పూర్వము అవికెల ధారణమే యున్నట్టు లేదు. రాణివాసములో నేమైలయు సోఁకక పెరిగిన కన్యామణి తన భావము ప్రకటించురీతి వినుండు.

"సీ. ఆ రతికిఁ గరంబు లైతిరే నవ్విభుఁ
గౌగలింపఁగ నబ్బుఁగరములార!
ఆ యింతికిఁ గుచంబు లైతిరే నతని వ
క్షనిపీడన మబ్బుఁ గుచములార!
ఆ లతాంగికిఁ జెక్కులైతిరే నారమ్య
శీలుచుంబన మబ్బుఁ జెక్కులార!
ఆ నెలంతకు వీనులైతిరే నా కళా
విదు మంతనం బబ్బు వీనులార!

తే. యట్లుకా నోచనేల నాకైతి రకట
యనిన నిజావయవంబుల కాత్మవగచు
బాల్యమునఁ దన్ను రమణి సౌభాగ్యకలిత
యనిన సాముద్రికుల మాట లరసితిట్టు."

(ప్రభా. అ. 3, ప. 104)

ఇట్లు అంగములంగూర్చి పలవించుట గణికలకైనఁ దగునా? మోహమనఁగా వీరికి దేహక్రీడయేకదా ! ఇదియాశృంగారము ! 'అయ్యో ! నాకుచములారా ! మీరు అయమ్మను జేరియుండిన సుఖపడుదురుగదా !' యని యెవరైనఁ దలంతురా ! ఆత్మతృప్తి గోరుదురేకాని, యంగాంగములకుఁ బ్రత్యేక సుఖ మున్నదని భ్రమించి వాని ప్రారబ్ధమునకై విలపించు వారున్నారా? శృంగార ప్రకృతి మన కవులకు నగోచరార్థము. సుఖ మెఱుంగునది మనసు. ఇంద్రియములకు నెఱుక నహి. అవిజ్ఞానము కర్మము మొదలగు క్రియల కుపకరణములు. మనసు ప్రపంచముం దెలిసికొనుటకు, నిచ్ఛారీతిఁ గార్యముల జేయుటకు ననువైన మార్గములు. వానికి ప్రత్యేకముగ సుఖము ననుభవించు ప్రభావము లేదు.

"సీ. ఓ హంసి ! నిన్ను నేనొక్కటి తుదిమాట
యడిగెద నీహృదయంబు నందుఁ
గలయట్లు చెప్పుమీ కల్లలాడిన నీకు
నాతోడు సుమ్ము ప్రాణసఖీ వీవు
తడయక ప్రద్యుమ్ను కడకింక నొకమాఱు
పోయి దుస్తరమైన నా యవస్థ
చెప్పి చేరికఁ గొంత చేయవచ్చునొ రాదొ
యీ దురాశాపాశ మెందుఁ దెగని

తే. బంధమై ప్రాణముల వెలువడఁగ నీక
యాఁగి పెంచెడు మదనాగ్ని నహరహంబు
నీవు చని యవుగాములు నిశ్చయించి
యాశఁ దెగఁ గోయుమదియె మత్ప్రాణరక్ష."

(ప్రభా. అ. 3, ప. 107)

వరుండు వలచివచ్చిన నుత్తముఁరాండ్రు సంతసింతురు. ఒడంబడుదురు. ఈ కన్యయో వాఁడు, కరుణ, పశ్చాత్తాపము వీనిమై వచ్చినను జాలుననుచున్నది ? వలపునఁగూడ బిచ్చమడుగు

రెట్టివారు ? దానితోఁ దుష్టిజెందువా రింకను నెట్టివారు. ఈ లసత చిత్తవికారముగాదు. మనోవిభ్రమముగాదు. ఆత్మస్పర్శ ని శరీరతాపము. రోగికి మందువలె, వినికిచేతనే ప్రజ్వరిల్లు న్నెలకు నాయక సంగమమును తాపహరము. మనోహర మనుట ంకు. మన్మథుఁడు మనోభవుఁడట! దానికన్న సంగభవుఁడనుటలో ర్థ ముత్కటము !

"క. అని నిజ శంకల కన్నిటి
కిని బరిహారములు సెప్పి గెంటక యుండఁ
దనయాస నిలుప దితిసుత
తనయ రమణుఁ గవయ మిగులఁ గమకించు మదిన్."

వ. హంసిం జూచి.

"సీ. నీ చెప్పినట్ల యిన్నియునైన మొదలఁ ద
త్పుర మెంత దవ్వో నీ వరుగుటెపుడు
పోయి వేళయెఱింగి పొసఁగ నవ్విభున కీ
దృశమైన నాకోర్కెఁ దెలుపు టెపుడు
తెలిపిన నేవిఘ్నములకు లోపడక నా
పై నతఁ డనుకంపఁ బూనుటెపుడు
పూని తా నిచటికి రానొక్క నెపమున
గురునాజ్ఞ దొరకించు కొనుటయెపుడు
తే. వట్టి పెనుమత్సరపురాశి వజ్రనాభుఁ
డస్మదిచ్ఛకు ననుకూలుఁ డగుటయెపుడు
విరహవారిధి నేఁగడ వెళ్ళుటెపుడు
వలవని దురాసిలను గుమారిలుటెగాక."

(ప్రభా. ఆ. 3, ప. 120, 121, 122)

ఇది గఱువతనము ! మితభాషలేని జావళీ సరసము ! కల హంస ప్రద్యుమ్నునితో నమ్మగారి వేదనల నెంత మఱుఁగువెట్టి పడివెడినో యాలకింపుఁడు !

"చ. కొనరక చూపుచేతఁ గడుఁగ్రోలిన నీ చెలువంబు చెల్వమా
నసమున నెంతమిక్కిలి ఘనంబుగ హత్తెనొ కాని యప్పుడో
రసిక శిఖావతంస! యదురత్నమ! కాకరకాయ రీతిగాఁ
గినలయపాణి చన్నుఁగవ క్రేవ గగుర్పొడిచెం బొరింబొరిన్."

"ఉ. వావిరినెల్ల ప్రొద్దును భవత్పరిరంభణచుంబనాది నా
నావిధభోగలీలకు మనంబున నువ్విళులూరుచున్కి ప్రీ
డావతి దెల్పెఁ గొన్ని నిశలం గనుమూసినయంతమాత్రఁబై
పై విలసిల్లు కుట్టమితభావ విశేష విజృంభణంబులన్."

"ఉ. కలలం గూడినవేళ నెట్టి పాలయల్కల్పుట్టెనో, యేమి నీ
వలనం దప్పు ఘటిల్లెనో, యెఱుఁగఁ, దత్స్వప్నాగమామర్షవి
హ్వలిత స్వాంతయుఁబోలెఁ నిద్రనెఱయన్ వర్జించెఁ బద్మాక్షి య
క్షు లహోరాత్రములందుఁ బద్మకుముదస్ఫూర్తిన్విడంబించుచున్."

(ప్రభా. అ. 4, ప. 75, 76, 77)

ఇది జావళీలకన్న నికృష్టమైన పాళయగాంధ్ర శృంగారము! ఇట్టి యనౌచిత్యములఁ బలికిన జనబాహుళ్యమునకు వేదాంత వాదములచే నగుదానికన్న నెక్కువ విరక్తి తటస్థించును. ఇదియ సరససల్లాపమని భావించు మృగప్రాయు లింకను మన దేశమున నున్నారా?

ప్రభావతీదేవి కన్నెయయ్యు నారితేఱిన గణికలకృత్యముల శ్రద్ధగాఁ జేయుటయం దెంత ప్రౌఢయో యీ పద్యమునఁ దెల్లం బయ్యెడిని.

"సీ. కేళీ గృహంబు ముంగిట గర గరికలా
లోకించు గంధాంబు సేకమరయు,
నలుకు పూఁతలఁ బరిమళముఁ బరీక్షించు
రంగవల్లికల తెఱంగుఁ జూచు,
నకినల మంచంబు జాడ విమర్శించుఁ
గుంకుమ పఱపు భంగులు గణించు,
హొంబట్టు తలగడ యొప్పు విచారించు
నగరు ధూపముల సోయగములెంచు,
తే. నలరు టోవర్లుమేల్కట్లు నంగరాగ
పూర్ణపాత్రికలును గందవొడి బరణులు
జాలవల్లిక లాదిగా సముపభోగ
సాధన శ్రీలు పరికించు సారెక బల."

(ప్రభా. అ. 4, ప. 144)

ఇట్లు భోగసాధనములెల్ల సమకూర్చి సర్వసన్నాహ సమేతు రాలయ్యు ప్రియుఁడు రాఁ గొంత దామసించినందున, మఱియొక్క విరహప్రలాపమునకు మొదలుజొచ్చి యేమనుచున్నదనఁగా.

"క. వత్తు నవశ్యము నేఁడని
చిత్తము తమిరేఁచి యంతఁ జింతయొకతె పై
హత్తిన నదివృథ వుచ్చినఁ
బుత్తురు మగవారిమాట పొనగదు నమ్మన్."

(ప్రభా. అ. 4, ప. 147)

ఇట్లుత్కంఠఁ గొనియుండియు శాస్త్రప్రకారము చంద్రోపాలంభనము సమకూర్చిన యీపెయొక్క మనస్థైర్యమును, కవియొక్క సందర్భశుద్ధిని పొగడుటకు నాదిశేషునకైన నలివియా? పిమ్మట చంద్రునివదలి దక్షిణానిలునిఁ బట్టినది. అటుతర్వాత నతని కొకింత విరామదానంబొసంగి, మన్మథునిపైకి దూఁకి, యాయలసట చేత శాస్త్రక్రమముగఁ, బ్రాణములు కంఠగతములుగాఁగా, 'ఇదే చచ్చెదను జూడు' మని "తెప్పలు దేలవైచుచు" క్రిందబడిన నొప్పి గదాయని "పూలపాన్పున వ్రాలబోవుటయు" పూర్తిగా వ్రాలలేదు! ఈ తమాషానంతయు ప్రచ్ఛన్నరూపముతో డ్రామారీతిగఁ జూచుచుండిన ప్రద్యుమ్నుఁడు ప్రత్యక్షమై పట్టుకొనఁగా, అమ్మకు నెక్కడలేని సిగ్గువచ్చినది. పాపము! ప్రభావతి యెంత మంచిది! తన బాధలు దనకుండఁగా నలంకార శాస్త్రమున కే బాధయు రాఁగూడదని పరోపకారవృత్తియై, ప్రతిదూషణమును, ప్రతిదశను దప్పక యాదరించి చూసినది గదా! వరుఁడును ఎంత ధీరోదాత్తుఁడు! ఈ నాట్యములన్నియు ముగియువఱకుఁ దమిని బిగఁబట్టిన యోర్పుకాఁడు! అయ్యో! దరిద్రమా! అనివార్యమైన మోహమును గోఁతిఁవలె నాడింపఁజూచుట శృంగారమా! వికారమా! ఇంతటితోఁ బోయెనా? ప్రభావతి ముప్పది పద్యముల రోదనము శ్వాసము బిగబట్టి, పూజారులు మంత్రములనేకరువు పెట్టినట్టు త్వరత్వరగాఁ జేయుచుండఁగా, 'ఏమమ్మా' యనియైన నడిగినఁ గాలయాపనముగదా యని యుచితమౌనముం దాల్చిన శుచిముఖీరాగవల్లరులు, వధూవరులు పడుకటింటికిం బోయిన వెనుక వెన్నాడి మధ్యస్థలములకుం జొచ్చుట మనవంటివారికి ఱోఁతయనిపించును. వారెంతో దయతో నా గాంధర్వపుఁ బెండ్లికూఁతును బిలుచుకొనివచ్చుట, బుద్ధులు గఱపుట మొదలగు వేడుకలున్నవి "తిగిచినరాక యీడిగిలంబడిన"దఁట! చెలికత్తెలును శాండో కుస్తీచేసిన బలశాలినులుగావున నెట్లో తుట్టతుదకు దేవిగారిని "ఏనుగుఁ గంబానకుఁ దెచ్చినట్లు" తెచ్చి విభునిముందఱ నిలిపి యొక చిన్న యుపన్యాసమిచ్చి వెళ్ళినారు. వెళ్ళినారని

తోఁచుచున్నదిగాని నిజము చెప్పలేను! ఇవియ మనవారి రాగములు. కోమలత, మార్దవము, సౌకుమార్యము మొదలగు సౌమనస్యంబులకు వెలియైనవగుట నాగరికపుఁ జందముగలవారికి నింపుగావు. మఱి పూర్వకాలపు నవాబులు, రాజులు, పాళయ గాండ్రు మున్నగు మోటువారికి తగియుండునేమో. భావించు టయు బహుప్రయాసమ. ప్రభావతీదేవి తరువాత శాస్త్రోక్తరీతిని బొలయలుక దాల్పగా నాయమఁదేర్పం బ్రయత్నించి, యెంతకుఁ దేఱకున్న (నియమితకాలము నిండని దా యమ్మ తేఱిన నది తప్పుగదాయని? యోజింపనంత మూఢుఁడు) ప్రద్యుమ్నుఁడు నిష్ఠురముగా "దానవునకు నుదయించినదానవుగావున లతాంగి! దయ చాలదు" అని, భార్యమీఁదఁ గోపమువచ్చిన నామె పుట్టు పూర్వోత్తరాల నెల్లఁ దడవి తడవి వాపోవవలయు, నను సనాతన హిందూగృహస్థధర్మము నుద్ధరించుటయు మిక్కిలి చిత్రమ. ఈ పొలయల్కకు ప్రేరకము శ్లేష. మగఁడు ఒకయర్థము నూనిన వాఁడై "రతీ! భవదుత్తమరతీ!" అని ధ్యానించుచుండఁగా, నందు వేఱొకయర్థము గనిపెట్టిన ప్రభావతి

"పట్టపు దేవియైనరతి
భ్రాంతినె పల్కెదవేమొ నాథ! నే
గట్టిగ నారతిప్రమదఁగాను!
ప్రభావతి యండ్రు నన్నిలన్!"

అని యతనికిఁ దన పేరెత్తి చెప్పునంత కోపనయగుట సహజమ. ఈ ప్రణయకలహముచే ప్రద్యుమ్ననికి విరహవేదన రెండవ తరంగము రీతిఁ బొంగి పొరలఁగా, హంసకు దనకష్టముఁ దెలుపుచు, నామాటగాఁ బ్రాణేశ్వరితోఁ జెప్పుమని యేమని వ్రాయుచున్నాఁడు.

ద్విరదగతిరగడ "ఓహంసి నీచేత
నీమోవి చిగురుఁ దేనియలు గ్రోలెడి యాస
నీమొల్క నవ్వువెన్నెల చలువగొను నాస
నీమృదు కపోల సన్నిధిని మోమిడు నాస
నీమోహనశ్రోణి నిమురఁగలిగెడు నాస
నీదు పాలిండ్ల నానెడు వక్షమను నాస
నీదు శృంగార కళలెలవులంటెడి యాస
నీదు మణితామృతమునింతుఁ జెవిననునాస."

(ప్రభా. అ. 5, ప. 152)

పశుకృత్యమే కామమనుట యిందుచే సువ్యక్తముగదా! మఱి యిట్టి వ్రాఁతల నితరులకు వ్రాయువాని మనశ్శుభ్రత యెట్టిదో! కవి ప్రద్యుమ్ను నిట్టి నీచపాత్రముం జేయుట యాతఁడు గొల్లఁడనియా?

దోషవిచారము చాలదూరము చేసితిమి. ఇందునకుఁ గారణములు రెండు నిష్పక్షపాతబుద్ధితో నారయుట విమర్శకుల ధర్మము. రెండవది కళాపూర్ణోదయముయొక్క గొప్పతనము కొలఁత యెత్తఁగోరిన సాధారణ ప్రబంధములకుం దానికింగల వ్యత్యాసము ప్రకటించుట యావశ్యకము. ఇంతేకాని దోషములఁ జూపినందున గుణములు లేవను సన్యాయ్యాపవాదము మోపువారము గాము.

## కావ్యములోని మంచిగుణములు

ఎంత దక్కువపడినను స్వభావమును బూర్తిగఁ బోగొట్టుకొననౌనా? అట్లే యెన్నిలోపములున్నను సూరన తన నైజమునేల విడుచును! ఈ కావ్యములో కొన్ని యద్భుత విశేషములున్నవి. అవి యనితర సాధ్యములు. మానవ ప్రకృతి నద్దమువలెఁ జూపించునవి. సంభాషణములు విస్మయావహములు. నాటకధర్మములను బోషించియున్నాఁడు. స్ఖాలిత్యములతో మిశ్రమైనదను చింతయేగాని నాకు గుణము మగ్నమైనదని క్షణమైన నెంచినవాఁడఁగాను. ఈ గ్రంథమున నాశ్చర్యకరమైన పాత్రము శుచిముఖి. ఈ హంసియొక్క దిట్టతనము, బిగువు, నేర్పు, తీఁపిమాటలు, మెత్తమనసు, చమత్కారము నాహ్లాదకరములు. అనేక పాత్రములు ప్రదర్శింపఁబడు స్థానముల వర్ణనలు తఱుచుగ సంభాషణమూలముగఁ జేయఁబడియున్నందున నివి పాలుపెక్కినవి. సంభాషణములనఁగా దీర్ఘ ప్రసంగములుగావు. అవి సామాన్య ప్రబంధకారుల విలాపములు. మఱి యిందుఁ గలసి మెలసినట్లు పలుకఁబడు వచనములు. మాట మీఁదుగా మాటవచ్చిననే యందము. బడిపంతులవలె అరగంట వ్యాఖ్యానముం జేసిన నాటకసరణి చెడును. కథయందు నిరర్థకాంగములు మెండుగ లేవు. కల్పనయొక్క జిగిబిగి కళాపూర్ణోదయమునకన్న సాంద్రమని నా విజ్ఞప్తి. ప్రత్యేక వర్ణనలు భావ సమృద్ధములు. చూడుఁడు. ప్రద్యుమ్నుఁడు 'పోలో' యనఁబడు గుఱ్ఱపుసవారి చెండాట నాడుచుండుట కవి యెంతరమ్యముగ వర్ణించియున్నాఁడో!

"సీ. తొలుదొల్తనయ్యేక తురగంబు మండల
గతిచారియగుచు నిక్కంబు దోఁచె
నావెనుకను నశూపాశ్వాలి చెదరక
చక్రాకృతిని బర్వునరణిదోఁచె
నంతటననతిస్ఫుటావయవంబుగా
నెనసియేకాంగ వేష్టనతఁ దోఁచెఁ
దుదిఁ దద్విభూషణ ద్యుతిరాజి మాత్రంబు
కొఱవి త్రిప్పినరీతి మెఱసిదోఁచె

తే. నంతకంతకు గతివేగ మగ్గలింప
రాఁగవాగె యెచ్చరిక పరాకుజియ్యా
యను జనులు రిచ్చవడి తమపని మఱువఁగఁ
బరఁగునమ్మేటినెఱరౌతు ప్రౌఢికతన."

(ప్రభా. ఆ. 2, ప. 32)

ఇట్టి వేగము అనుభవమున లేకున్నను, ఒకవేళ నంతవేగము తటస్థించినయెడల కవి వర్ణించిన యాకృతులు గోచరించుట 'రఁకల్ రాట్నము' జూచినవారికెల్లఁ దెల్లము. అత్యుక్తియుండిన నిట్లుండ నొప్పు, శుద్ధముగ నసాధ్యమని తోఁపఁగూడదు. మఱి యపురూపములైనను భావ్యములుగనున్న స్వారస్య మెక్కువ. విరాళిపాలైన ప్రద్యుమ్నుఁడు నిర్హేతుకములగు నుత్సాహ నిరుత్సాహ స్థితులందాల్చి లేనిపోని కారణముల నూహించుట మోహగ్రస్తులకు స్వాభావికమైనస్థితి. ఇది యాకవి వర్ణించినట్లు లితరు లెవ్వరుఁ జేసినజాడ నాకుం దెలియదు. వినుండు.

"చ. శుచిముఖి మాట యొండరసి చూడఁగ నెంతయు నానపా టొన
ర్చుచుమదిఁ ద్రిప్పుచున్న యది, చూడ్కికి నన్ను నె పోలువాని నా
రుచిరతరాంగి చిత్తరువు రూపొకటిన్ రహిఁజూడఁ జెప్పెఁ ద
ద్వచనము చొప్పు నేమినియతంబు సమాకృతులెందుఁ గల్గవే."

(ఆ. 2-4)

"చ. ఇది పదిలంబుగా నడుగకే నపుడక్కట కోర్కి దాఁచిన
ట్టిదొరతనంపు నీటు ప్రకటించితిఁ, బాపపు లజ్జ నన్ను నో
రదిమె, ననాదరంబు తెఱఁగై యది హంసికిఁ దోఁచె నేమొ! ని
ల్వదమఱియించుకైన, గఱువల్చవి గాని కథల్వచింతురే!" 5

ఉ. ఏనొక యించుకంత మనసిచ్చిన మాటలు పల్కకుండగాఁ
గాని మరాళి యద్దనుజ కన్యకకైనను నొత్తిచూచి యే
మైన ననంగఁ బూనునని యాత్మకుఁ దోఁచుచునున్న దిప్డు, కా
దేని ప్రసంగముం దిగిచి యేల నుతించుఁ దదీయరూపమున్. 6

మ. అటుగాకద్భుత రామణీయక గుణాఢ్యంబైన సద్వస్తువుం
బటువాచారసికుల్ ప్రసంగమయినన్ బారంబుముట్టన్ రసో
త్కటతం జెప్పక మానఁజాల రను పక్షంబొందు భావించినన్
మటియిల్లున్ వనితాంగ వర్ణనకు నిక్కం బన్యథా సిద్ధియున్. 7

చ. హరియును వానవుండు, దము నంపిన కార్యము హంసి దానయై
ధరణికిడిగ్గి చెప్పి మదుదగ్రమనస్థితిఁ గాంచు టెన్నగా
సురరిపుఁ జంప నన్ననుపు సుద్దులు పుట్టఁగ బోలు నెల్లడన్
సరసిజనేత్రు దక్షిణ బుజంబవు నీవని పల్కినందునన్. 8

ఉ. అన్నియు నేకవాక్యముగ నారయ నాసలు వెంచుపక్ష మే
యున్నది కొంతమించి యిది యోజన సేయఁగ నాదురూపె యా
కన్నియచేతి చిత్రఫలకంబున నున్నది యెవ్వరట్టిచో
నన్ను నెఱుంగవ్రాయననినన్ శివవ్రాయుట వింటిఁజూడఁగన్. 9

ప్రభావతీ రాగవల్లరుల యేకాంతగోష్ఠులు బహు రమ్యములు. అందఱకన్న నుత్తమపాత్రంబగు శుచిముఖిం బ్రశంసించి ప్రభావతీ ప్రద్యుమ్నుల నింతటితో వదలుదము. వారును వదలినఁ జాలునని యుత్కంఠమై గ్రుక్కిళ్ళు మ్రింగుచున్నారు!

శుచిముఖీ చరిత్రము

వజ్రనాభుని పురంబులోని విశేషంబులు మీ రెఱింగి తెలుపుడని మరాళముల నింద్రుఁడు నియమించు నపుడు, ఈ హంసి కథలోఁ బ్రవేశించి, యతనితోఁ జిత్రఫలక వృత్తాంతముఁ దెల్పి, యిఁక దైత్యునకుఁ గాల మాసన్నమయ్యెనని ధైర్యము చెప్పినది. ఆ సందర్భములో నింద్రునితోఁ జెప్పినట్లు రాగవల్లరీ ప్రభావతులకు ప్రద్యుమ్నుని విషయమై నడచిన సంవాదమును నివేదించినది. పిమ్మట ప్రద్యుమ్నునికి వలపుపట్టునట్లు నాయకురాలిని వర్ణించుట పూర్వమే తెలిపియున్నాము. అందును బింకమును స్త్రీ స్వభావమును వెల్లడిసేయుచున్నది. ఎట్లన, ఈ కార్యమునకై యేతెంచినదయ్యు ప్రద్యుమ్నునితో "రహస్యమైనవియె యౌను

భవత్పరిపృష్ట మెంతయున్, జనక నిమేషముం దడయసంగతి గాదును మాకు నైన నీ, వనఁగ జనార్దనుండనఁగ నారయభేదము లేదుగావునన్, వినుపింతు" నని బిగువ బేరము గనఁబఱచినది! మఱి కన్యామణి సౌందర్యముంగూర్చి నిమిషము నిలుపనోపని దయ్యు గంట పట్టెడు వివరముల లెక్క ప్రకారము వినుతించియు, తన ప్రతిభను గొంత చెప్పునదియై

"ఉ. ఎమ్మెయిఁ బ్రజ్ఞ మీఱ వచియించెదనన్న వచింపలేన య
క్కొమ్మ బెడంగులోన నొక కోటితమాంశమునైన, నంత మా
త్రమ్మ మదుక్తిశక్తి యనరా దతివాఙ్మహిమాఢ్యనేను, మా
యమ్మ సరస్వతీసతి తనంతటిదానిగ నన్ను దిద్దుటన్."

"చ. నలినజురా వాన మొక నాఁడు ననుం దనచేతి బ్రోదిరా
చిలుకను వాదుకుం గవితఁ జెప్పఁగఁ దా నియమించి యందునా
పలుకులఁ గొంతవాసిగని భావమునంగడు మెచ్చుచున్న ఖాం
చలమున నాదురెక్కలను చక్కఁగ దువ్వుచు గారవింపుచున్."

చ. ప్రబలములైన కౌతుక కృపారస వత్సలతాదరంబులని
శబలితచిత్తయై యపుడు నా 'కుపమాతిశయోక్తి కామధే
ను' బిరుదమిచ్చి తల్లిఖితనూపురమున్ భువనైక మాతయు
య్యాబల మదంఘ్రిఁదా దొడిగె నాబిరుదం బదిచూడుమేర్పడన్.

(ప్రభా. ఆ. 2, ప. 90,92,97)

అని విడిచి బిరుదమునకు దర్శనప్రాయ వాక్యములాడినది! అన్నింటికైనను సొగసైన ఘట్టము ప్రభావతీ శుచిముఖుల వాగ్యుద్ధము. తన రహస్యము ప్రకాశముగచేయుక ప్రద్యుమ్నుని వృత్తాంతముఁ దెలిసికొన వలయునని ప్రభావతియు, అగుట్టు దీసికాని యాపెకోర్కె నెరవేర్చగూడదని హంసియు, నొండొరులఁ జఱచి మల్లయుద్ధ నైపుణింజూపుట (అనఁగా మాటలమాత్రము) యుత్తమోత్తమ ప్రదర్శనములలో గణ్యము. స్త్రీ స్వభావము నెంత నేర్పుతోఁ గనుపఱచుచున్నాఁడు, ఆ ఘట్టమునంతయుఁ జదివినఁ గాని దాని చవిగ్రోలలేము.

(మూఁడవ యాశ్వాసము 44 వ పద్యము మొదలు 75 వ పద్యమువఱకు)

క. ఇటు గాక లోకముల నిం
తటిచెలువుఁడు గలఁడె గలిగినను నుబ్బెద యి

చ్చట నచ్చట గలఁ డని య
క్కట నన్నిట్లేచు టంబకరుణ తెరంగె.

సీ. అని పల్కు పలుకు నాయవసరంబనఁ దత్స
మీపంబునం దనురూపవతిని
శుచిముఖి సంచరించుచు విని యిత్తన్వి
చిత్తంబు వడసి యేఁ జెలిమికలిమి
హత్తించుకొనుటకు ననుగుణం బగువేళ
యిదియ యటంచు నూహించి మదిని
దగునుపాయంబు వితర్కించి యపుడు య
దృచ్ఛనవోలె నా తెఱవయెదుట

తే. నడ్డముగ నల్లనల్లన యరుగుచు నవి
మర్శదృష్టిచేఁ బలుమఱు మరలి మరలి
చిత్రఫలకంబు వంకవీక్షించెఁ గొంత
సరిగడచుదాక నొకవింతసరణి మీఱ.

క. అపు డమ్మరాళి చందం
బుపలక్షించుచుఁ గపోలయుగ్మము దరహా
సపుఁ గాంతిఁ దనరఁగా నా
చపలేక్షణ తనదు ప్రాణసఖి కిట్లనియెన్.

క. కఱదులపులుఁ గిది తానే
మెఱుఁగునొకో తిరిగి తిరిగియాఫలకముపైఁ
బఱపెడుఁ జూడ్కుల నా నా
మెఱుఁగుంబోఁడికి మరాళి మృదుమధురోక్తిన్.

వ. ఇట్లనియె. నోపడంతి నీపలికినట్లు మా యట్టితిర్యగ్జంతువు లేమియు నెఱుంగమి యథార్థంబయైనను నేను నీచేత చిత్రఫలకం బబ్రపడి చూచుటకుం గారణంబు వినుము. మున్నొక్కచోట నొక్కపురుషుం జూచి తత్సమాన రూపునిమఱి యెందునుం గానక యిప్పు డిందు నతని కైవడి దోఁచిన నిది తదీయ రూపంబెఱింగి వ్రాసిన తెఱంగో యటు గాక యట్టివాఁడె వేఱొక్కఁ డెక్కడనైనం గలిగెనోయని యించుక విమర్శించి వీక్షించితి నన విని ప్రభావతి యద్భుత ప్రమోదసందేహంబులు డెందంబునం గ్రందుకొనుచుఁ గందళింప నప్పలుఁగుందప్పక చూచి యిట్లనియె.

శా. ఏ మేమీ యిఁక నొక్కమాటు చెపుమా యీ వున్న రూపిట్లయో
యేమైనం గలదో విభేద మిట రమ్మీక్షింపు మింకన్ వచ

స్సామర్థ్యం బరయన్ మహాత్మవని యస్మద్బుద్ధికిం దోఁచె దా
హా మాభావము గానలేవె మదిలో హంసీ భయం బేటికిన్.

వ. అనిన నది మదిరాక్షి నీక్షించి యిట్లనియె.

క. నీ వనినయట్ల యేను భ
యావహులను గానివారి నాకృతిన కనం
గా వలఁతినైనఁ బిలువక
యేవెట్టినె చేర నిరువు రేకత మాడన్.

వ. అనిన వెఱఁగంది యా యిందుముఖి సఖియునుం దానును నొండొరుల మొగంబులు చూచి నగుచుఁ జెవులకుం జవులు మివుల నలవరించి గులుకు టెలుంగుగల కలికిపలులకె వలచిమొలచు కుతుకంబున నతివశంవద హృదయలై తమకిద్దఱకుం దాని పెద్దబుద్ధులు సుద్దులు ముద్దు రప్పించుచుం దద్దయు నుద్దీపిత రాగంబు లగుచుండు రాగవల్లరి యాగఱువతనంబులాగు లేగరితలందును మున్నుకన్న విన్నయవియె దీనికఱుదు లెంత యరుదులు. చూచితే యంచు నాయంచపై నాదరాహ్లాద మేదురనిరీక్షణంబుల నీక్షించి యోపక్షికులభూషణంబ నీభాషణంబు నిక్కంబ మిక్కిలి నక్కఱపడి వేఁడక ప్రోడలగుగఱువ లిరువు రేకాంతమాడుచోటి కేటికిఁ బోయెద రిది యట్లుగాదు గదా యేమొక్క సందియంబు నివర్తించుకొనఁగోరి యిత్తఱి నత్యంత ప్రార్థనంబు గావించుచున్నవారము గావున నీ కన్న యప్పురుముని యొప్పు నిప్పలకపై వ్రాసినరూపంబు చొప్పు నొక్కటియగునో కాదో యాదండకు వచ్చి నిచ్చలంబుగాఁ జూచి నిశ్చయించి చెప్పు మిప్పడుచు నేను నిట్టివాఁడెందును లేఁడుకలఁడను వివాదంబునం బన్నిదంబు చఱచినవారము.

క. అనుటయుఁ బందెముకొఱకై
నను వేఱొకపనికి నైన నా కది తెలియం
బని గలదె మీకు నాచే
వినవలసినయర్థ మరసి వినిపింతుఁ దగన్.

తే. అనుచు శుచిముఖి తనమాట కాపడంతు
లీక్షితాన్యోన్యవదనలై యెంతదూర
మరుగుచున్నది దీనివాక్యాశయ మని
మివుల వెఱఁగందఁ గొంత చేరువకుఁ బోయి.

క. సవిమర్శదృష్టి నాటిత
కవిధాన మొకింత నడపి కడుఁ బదిలముగా
వివరింప నతనిరూపమ
యవు నౌ నదీ యిందు సందియము లేదనియెన్.

చ. అనుటయు రాగవల్లరి మహత్తర మోద విశేషసంభ్రమం
బునఁ బఱతెంచి యప్పులుఁగుముద్దియ, దద్దయు ముద్దు గారవం
బును జిగురొత్త నెత్తుకొని పోయి ప్రభావతిదండఁ బెట్టి యె
య్యనఁ గొనగోళ్ళఁ దత్తనురుహంబులు దువ్వుచుఁ గూర్మి నిట్లనున్.

ఉ. అంచవు గావు నీవు నను నారసి ప్రోవఁగ మూర్తిమత్త్వముం
గాంచిన భాగ్యదేవతవు గాని మదుక్తి తెఱంగు నేఁడు గె
ల్పించితివే జగంబునను లేఁడిటువంటి మనోహరాంగకుం
డంచుఁ గలంచు నిజ్జలరుహానన మానక నాదుచిత్తమున్.

వ. అనిన విని ప్రభావతి నిజవయస్యం జూచి.

తే. రాగవల్లరి నీ వేల వేగిరించె
దింతమాత్రంబ చాలునే యీప్సితార్థ
సిద్ధి కతనిలక్షణము లీచిత్రమూర్తి
యందు నేమైనఁ గల వేమొ యడుగవలయు.

వ. అనిన విని యాహంసి యాచిత్రరూపంబు నిరూపించి ప్రభావతి నుద్దేశించి యిట్లనియె.

ఉ. అరయ నింక నే మడిగె దల్లవె యాతఁడు శంబరుం డ్రిలో
కారిన ద్రుంచునప్పటి ప్రహారకిణంబు లురంబునందు నా
హా రతికంక ణాంకములు నల్లవిగో మెడయందు వీరశృం
గారకళాఢ్యు నిట్లతని గట్టిగ నెవ్వ రెరింగి వ్రాసిరో.

వ. ఈలక్షణ కథనంబుచేత నతనినామజాత్యాదు లత్యంతప్రసిద్ధంబులు మీరు మీయంతనె యెరింగెదరు గావలయు నంతఃపురవాసినిలు గావున నెఱుంగరో యని యెఱింగించెద నంటినేని.

చ. ఎనయఁగ నెవ్వ రెంతమన సిచ్చివచించిరి తాను వారితోఁ
బనుపడ నంతమాత్రప్రతిభాషణ మాడుట యుక్తమండ్రు మీ
కొనరఁగఁ బన్నిదంపు గెలుపోటలు దీర్పఁగ నిప్పుడేను జె
ప్పినదియ చాలు నింకఁ దలపెట్టుట చెల్లద యెక్కుడేమియున్.

తే. నీవ కద ప్రభావతి యన నిన్ను మున్ను
తరుణి నే వింటి, రాగవల్లరియె బోటి
పేరు నీ విపు డన వింటి మీరిరువురు
నీ యెఱుక మఱచెదరు నూ పోయివత్తు.

ఉత్సాహ. అనుచు గగనభాగమునకు నంచ యెగయఁ జూచినన్
దనుజకన్య కాలలామ తనదు రెండుచేతులన్
వినయ మొప్పఁ బొదుగఁ బట్టి వేనవేలు భంగులన్
దనరఁ బ్రియము జెప్పుచును ముదం బెలర్ప నిట్లనున్

సీ. నిద్దంపుఁబండువెన్నెలగాయు తెక్కల
యొప్పు చూడఁగ నొక్కయుత్సవంబు
మెఱుఁగుఁదీగెలబాగు మించుపక్షాంత హా
టకరేఖ లరయ నొండొక ప్రియంబుఁ
గమనీయ మగు మహాగమనగాంభీర్యాది
విలసనం బీక్షింప వేఱయింపు
మాధుర్యధుర్యకోమల వచనామృతం
బనుభవింపఁగఁ గౌతుకాంతరంబుఁ

తే. గలుగఁ జేయుచు నువ్విళ్ళు గొలుపునీదు
సంగతి యొకింత గని యెట్లు జారవిడుతు
నింక రాగవల్లరి పేరు నీవు నిజము
ననగ నీతో నొనర్తు నెయ్యంపుఁజెలిమి.

ఆ. ప్రణయ మొప్ప మిగులఁ బ్రార్థించుచున్నట్టి
నన్ను నను(గ్ర)హించి నాదుచెలిమి
కొడఁబడంగవలయు నోహంసభామినీ
యనుచు వేఁడుకొనఁగ నంచ పలికె.

ఉ. ఇప్పుడు నీవు చెల్మికిని హేతువుగాఁగ గణించినట్టి నా
యొప్పును గిప్పుఁ దా నెచట నుండు రహస్యవిచారవిప్ను మౌ
లెప్పుడు నీకుఁ దోఁచె నపు డింతయు రోసెదు దీనిచేత మీ
యిప్పటిమంతనంపుఁబని యేమఱ కంపుఁడు పోయివచ్చెదన్.

వ. అనిన విని రాగవల్లరి హంసీమతల్లికం జూచి యిట్లనియె.

క. పోయెదఁ బోయెద నం చి
ట్లోయంచలతల్లి యేల యుద్దాడింపన్
మా యేకాంతపుఁబనికిని
నీయునికి విరోధిగాదు నిర్వాహకమున్.

వ. ఇదే నిమిత్తంబుగా సంఖ్యంబు గావలయునని ప్రార్థించెదము గాని కేవలంబైన తాపక రామణీయకంబుననకాదు. నీదుపలుకుం దెరువులు పరికింప నిది నీవును దెలియుట విస్పష్టంబ యైనను శుద్ధాంతస్థితి దోషంబునం

జేసి యేమయియీ మాట మాటు పెట్టక గొబ్బునం జెప్ప నేర కున్నవారము చెప్పి వేఁడికొనక యేపనికిని నీవు చొరమి మొదలన పదిలంబుగాఁ దెలిపిన దానవు గావున.

ఉ. పట్టిమఱుంగుఁ బెట్టి నుడువం బని లే దది యెల్లభేరి జో
కొట్టుట కాకని న్గెలువఁ గూడునె మాటల నీవు గంటి న
న్నట్టిశుభాంగుఁ డీరమణియాసల కాన్పద మిప్పు డాతని
న్గట్టిగ నన్వయాది కథనంబున దెల్పి యనుగ్రహింపవే.

తే. ఇప్పుడిది చెప్ప కెడ సేయు టీలతాంగి
ప్రాణసంకటపఱుచు టోపక్షిరమణి
కావునను గానవలయు శీఘ్రంబ చెప్పి
వెనుక నెఱిఁగింతు నీకు మావృత్తమెల్ల.

వ. అనిన శుచిముఖి వచనవక్రత చాలించి యిట్లనియె.

ఉ. అంతిపురంబుకన్యలఁట యాత్మ తెఱం గభిధాప్రయుక్తి నొ
క్కింతయు నేర్పరింపరట యిట్లన నిట్లని నాకు నాకె య
ర్థాంతరము ల్గడించుకొని యంజక యెట్లు యువస్తుతుల్ ప్రపం
చింతు నటంచు నుంటి నికఁ జెప్పెద మీరలు గుట్టుదెల్పుటన్.

ఈ భాగము కవి వ్రాసినదియా ? స్వభావసిద్ధమా ? స్వభావమును మఱపింపఁ జేయునట్టి శిల్పమ. శిల్పముగాని యన్యము కృత్రిమము. ప్రకృతి ననుసరింపనిచోఁ గళకు సత్యమురాదు. మఱి యనుసరించుటఁ దప్ప నింకేవిషయములేకున్న సత్యమున్నను సొగసుండదు. అనుసరించినట్టేపోవుచుఁ గ్రమక్రమముగ మీఱి మెఱయుట కళాసామ్రాజ్యము. ఒకానొకరు చెప్పినరీతి, ప్రకృతి యాకారము. ఆ యాకారమును చక్కఁగా నలంకరించి మెఱుఁగు పెట్టినరీతిని తగిన విషయముల సంగతిని బొదిగి సజీవమై లేచి వచ్చునట్లు చేసిన నయ్యది కళ. ఈభాగము దివ్యము. పాముజాడ పామునకు గుర్తు. స్త్రీలజాడ స్త్రీలకే యెఱుక. శుచిముఖియొక్క బిగువు బింకములు పొడుపుమాటలు, యుక్తులు వర్ణింపఁదరమా ? ప్రభావతిని బొమ్మరీతి నాడించునామె వాచాలత స్తుత్యతీతము.

## కల్పనా స్ఖాలిత్యములు

కల్పనయందు నీకావ్యము నిర్దుష్టమని యంటిమి. అమ్మాటకు బాధకము లొండురెండు గన్పట్టెడి. సునాభుని కూఁతులకు గదసాంబులు పతులగుదురని నారదు లాశీర్వదించి పోఁగా,

నాకన్యలు "ఎక్కడిద్వారక, ఎక్కడి గదసాంబు లిదివిన్నఁ బెనుచేటు స్వామిచేత, నసురులకుఁ బగవీడఁట యాపురంబు" అని. యాశీర్వాద బలముచే వెల్లివిరిసిన తమి "భోగయోగ్యమగు ప్రాయము" నకు మున్నే తమ్ముఁ దొందరపెట్టఁ జాలఁ బరితపించిరట! ఋషుల యాదేశము విన్నమాత్రన మనసు చెప్పిన దిక్కునకుఁ ద్రిప్పుట, మనవారి సాధుగుణమును వినయమును జూపు చిత్రమేమో! భోగయోగ్యమగు ప్రాయము కుదరక మునుపే పతిచింతందాల్చు సామర్థ్యము గలవారౌట గాఁబోలు, బాల్య వివాహములకు నిజమైన నిదానము! ఈ విషయము లటుండ నిండు. ద్వారకాపురిలోని గదసాంబులంగూర్చి సునాభుని కూఁతులకుఁ దెలిసిన యా మాత్రము వారియక్కగారైన ప్రభావతికిఁ దెలియకపోనేల? ప్రద్యుమ్నుఁడు భర్తయని యెఱింగియు దిక్కులేని పక్షిరీతి నాపె రోదనముఁ జేయుట కృత్రిమ ముగ్ధత్వమా? మఱియు, కృష్ణుఁడు అనామధేయుఁడు గాఁడు. దనుజ శత్రువు! అట్లగుట నతనియు నతని యింటివారియు సంగతులు గడు రహస్యములుగానుండునా? అందును ముఖ్యముగా విరోధుల యిండ్లలో! అందును ఇంద్రునిపై దండెత్తి గెల్చిన వజ్రనాభుని పురిలోను, గృహములోను!

వజ్రనాభుని పురింజొచ్చు నుపాయమునకు సూచకముగ నుంటయ భద్రుని చరిత్రము యొక్క ముఖ్యోద్దేశము. ఉపాయాంతరము లున్నయెడల నీచరిత్రంబు వ్యర్థంబగును. కాననితరములగు వెరవులు సాధ్యములని కవి కనఁబఱచియుండుట గొప్ప పారబాటు. కథయొక్క కూర్పు బిగి తప్పిన దనుటకుఁ దార్కాణములు.

"తే. అప్పుడు ప్రభావతికి నొక్కయతివ విరులు
గొనుచుఁ బోవంగ నందు నింపునఁ జరించు
తేఁటిగమిలోనఁ దానొక్క తేఁటియగుచు
నేగె మాయామనుండు రతీశ్వరుండు."

(ప్రభా. ఆ. 4, 127)

తేటియైనవాఁడు హంస యేల కాఁ గూడదు! ఆ పురిఁ బ్రవేశము హంసలకు సుగమము. అవి వాలాయముం బోవుచు వచ్చుచుండునవి.

"చ. తడవులఁ బట్టియేము సతతంబును బోదుము వాని వీటికిన్
గడుమతి చాలమిం గడుపు గక్కుఱితి న్సురలోకనాథ
(ప్రభా. ఆ. 1, ప. 118)

అని శుచిముఖి యింద్రునితో నివేదించి యతని కొఱకై వేగుపని నడపుట కొప్పుకొన్నది. కావున "మాయాఘనుఁడు రతీశ్వరుండు" భద్రవేషముఁ దాల్చినదిచూడఁగా "గోటితోఁ బోవుదానికి గొడ్డలి తెచ్చినట్లు!" సునాభుని తనయలకు నీప్సితసిద్ధికిఁ గారణము చిలుక రాయబారము. ఇంతేకాదు. వజ్రనాభుఁడు ప్రాణములతో నుండఁగానే

"శా. ... ... ... ... ... ... ... ... సంగ్రామవృ
త్తాంతంబుల్ విని తార్క్ష్య వాహనుఁడు చక్రాద్యాయుధ ప్రోల్లస
త్కాంతిక్రాంతదిగంతరుండయి వడిన్ దావచ్చె నచ్చోటికిన్.
(ప్రభా. ఆ. 6, ప. 212)

సమారాధనకు బ్రాహ్మణులవలెఁ దండోపతండములుగా నింకెందఱు వచ్చిరో ఇఁక వజ్రనాభుని పురమన్ననో "తపమున బ్రహ్మఁ బ్రసన్నుఁజేసి, మేరువుపొంత మారుతాతపములకు న్నిజాను మతిఁ దక్కఁ బ్రవేశ మొనర్పరానిది" గా నతనిచే నిర్మింపఁ బడినది! అనుమతిలేక కృష్ణుఁ డిప్పుడు చొచ్చినట్లు ఇఁక గొంత ముందుగావచ్చియుండిన నెవరైనఁ దలఁ దీసియుందురా? విష్ణువు యొక్క మహాత్మ్యమున కతిశయముఁ గల్పఁబోయి, బ్రహ్మ సంకల్పమునకు కథాకల్పనమునకును విచ్ఛేదముఁ దెచ్చి పెట్టికొని యుండుట మంచిబేరముగాదు. మఱియు ప్రభావతియొక్క గది నుండి తనవిడిదివఱకు రాకపోకలు నిర్విఘ్నముగ నెఱవేఱుటకై ప్రద్యుమ్నుఁడు భూవివరమొకటి గల్పించెనఁట! ఇదియు నిరర్థక శ్రమము. కాకి, పిల్లి, ఎలుక ఇత్యాది గృహజంతువుల రూపముం దాల్చి యథేచ్ఛముగ నేల సంచరింపరాదు? ఈ కావ్యములో నొక్క కామముచేతనే గాదు, ఊరకయు నిట్టి చిత్రభ్రమ లప్పు డప్పుడు గల్గుచుండును.

ఈ గ్రంథములో జాతీయములు లోకోక్తులును విశేషముగా వాడఁబడియున్నవి. సంఖ్యయందకాక గుణమునందును నవి గొప్పలు. కాని 'అతికిఁబోయిన నెగ్గు తప్ప' దనుట నీరీతి శైలి నుండియుఁ జూపవచ్చును. ఈయుపమానముం జూడుఁడు!

ప్రభావతీ దేవియొక్క సౌందర్యమును ప్రద్యుమ్నునికి

శుచిముఖి వాగ్దర్పంబున విప్పి చూపుటలో

"చ. కొనరక చూపుచేతఁ గడుగ్రోలిన నీచెలువంబు చెల్వమా
నసమున నెంత మిక్కిలి ఘనంబుగ హత్తెనొ కాని యప్పు డో
రసిక శిఖావతంస యదురత్నము కాకరకాయ రీతిగాఁ
గినలయపాణి చన్నుఁగవ క్రేవ గగుర్పొడిచెం బొరింబొరిన్."

'కాకరకాయ' యఁట! ఎండుజిల్లెడుకాయ యనరాదా! పంతముఁబట్టి యేపైన గుణములు బలాత్కారముగ లాగివేయఁ జూచినచో విఱుపులు తప్పవు.

ఈ కథలోనుండు పక్షులకు వంశమూలములైన పాత్రములు కళాపూర్ణోదయములోని చిలుకలు. ఈవిషయమునందును ప్రభావతీ ప్రద్యుమ్నము తత్పూర్వగ్రంథము ననుసరించియున్నది. సరస్వతీదేవి చిలుకయు, ఇంద్రుఁడు రంభతో మణికంధరుని తపోభంగ విషయమైన సందేశము నానతిచ్చిన విధంబును గలభాషిణితోఁ దెలుపు చిలుకయు, శుచిముఖికిని, సునాభుని సుతలకు దూతికయైన కీరమునకును గొలము సాములు. ఈ కవికిఁ బక్షులయం దాదరము ఎక్కువ కాఁబోలు!

### తుచ్ఛ శృంగారములకుఁ గారణములు మన యనాచారములు

ప్రభావతీప్రద్యుమ్నములోని దోషములంగూర్చిన ప్రస్తావము మనసు గట్టిచేసి యెట్లో చేసితిమిగాన, కవిపరమైన ప్రతివాదములను ఇట సమర్పింపంబూనుట సహజమును సంతోషకరమునైన ధర్మము. శృంగారరసవిషయములగు నాభాసములకుఁ గవికాదు ఉత్తరవాది. మఱియట్టి యనిష్టములే యింద్రభోగములని రోతఁ జెందక గ్రహించు మన సంఘము! భావనాశక్తి యెంత యుద్ధురమై యుండిననేమి? హనుమంతుఁడు సముద్రము దాఁటఁ జాలినను దన నీడఁ దా దాఁటఁజాలునా? అట్లే, తన యావజ్జీవము నెట్టి స్థితిగతుల నడుచునో వాని సాంగత్య మేమాత్రములేని తలంపులను దెచ్చుట తరముమీఱిన కోరిక. ఇందులకు మతతత్త్వములనుండియే ప్రబలప్రమాణములఁ జూపవచ్చును. దేవలోక మననేమి? ఈ లోకములోని సుఖములు లభించుటకు నాస్పదమైన పదవియేకదా! అనఁగా నీ లోకములోని దుఃఖములు నిర్మూలింపఁ బడినట్లును సుఖములు అమేయములైనట్లును భావించిన దేవలోక మేర్పడును. పర మనునది యిహముచే సృజింపఁబడిన ప్రతిబింబమేగాని

యన్యముగాదు. యౌవనము మంచిది. ముదిమి చెడ్డది. అట్లగుటచే దేవతలు నిత్యయౌవనులనియు, మనము యజ్ఞములఁ జేసిన నిత్యయౌవనుల మగుదుమనియు మనుజుఁడు పేరాశచే నెంచుచున్నాఁడు. నిత్యయౌవనమున్న రంభ లుండవలయు. లేనిచో నది నిష్ఫలము. ఈరీతి నైహికముల ననుసరించి యీ ప్రపంచమున మనకుఁగల సుఖములు, ఆశలు అను సామగ్రితోఁ గట్టఁబడిన మాయాలోకములే వైకుంఠము, కైలాసము మొదలగు పరమ పదవులు. తుదకు దేవునినైననుసరే, మనుషులం బోనివానిగా నూహించుచున్నామేగాని, యతఁ డతీతుఁడని నోటిమాటయున్నను భావమున నట్టిఁడుగా సాక్షాత్కరింపఁజేయుట యసాధ్యము. అతనికి వేయిచేతులున్నవని సిద్ధాంతముండెఁబో! వేయి మనదిగాకున్నను చేతులను వస్తువులు మనవేగదా! మనయొక్క యంగములు, ప్రాణము, మనసు వీనితో నేమాత్రము సాదృశ్యములేని భగవంతు నొకనిఁ గల్పించి స్మరించుట యలవియా? యోజింపుఁడు! అట్లగుటఁ గావ్యవర్ణనములును అనుభవబద్ధములగు టేమివింత! అవి యీ లోకములోని రసములను ప్రకటింపఁజేయు కృతులు. కావున సంఘములోనుండు సౌరభమో దుర్గంధమో వానియందును బర్వియుండుట నైజము. అనివార్యము. రాజకన్యకయయ్యు, దేవేంద్రుని జయించినవాని కూఁతురయ్యు ప్రభావతీదేవి పచ్చిపచ్చి కూఁతలఁ దన మధురమైన నోటితోఁ బ్రేలుట మనకుఁ దలఁపఁగా నెంతో జుగుప్స! శుద్ధాంత కాంతామణియఁట! ఇఁక చర్యలో

ఉ. "వావిరి నెల్లప్రొద్దు.........(ఇవి వెనుక నుదాహరింపఁబడినవి)

మ. కలలంగూడిన.........

చర్య లట్లున్నను నష్టములేదు. ఆమె మాట లంతకైనఁ బచ్చివి!

"మనసునఁ గాకున్న మాటలయందైన
సౌకుమార్యములేని చానలేల?"

వారియందు స్త్రీయను శబ్ద మప్రయుక్తము. వాస్తవము విచారించిన నీలోపములకుఁ గారణము మన దురాచార హేయజీవితమే గదా! శుద్ధాంతములఁట! "పోఁతుటీఁగ కైనం బొలయ రాని చోట్లఁట!"

### శుద్ధాంతవాసప్రభావము

సరి! కలలకు గోడ లడ్డమా! మనసునకు బీగములు బంధ

ములా ! శుద్ధాంతము లేర్పఱుచుటయను లఘుకార్యముచే శుద్ధాంత రంగములు సమకూఱునా ? మఱియు, నీ మఱుఁగేగదా మానము విడుచుటకుఁ బ్రేరకము ! ఎట్లన, ఇట్టివారు చెలులు, దూతికలు, దాసీజనులు మొదలగు మధ్యవర్తుల మూలముగాఁ దప్ప నితరము లగు నుత్తమమార్గములఁ దమనైజమగు వలపును దృప్తిఁబొందింపఁ జాలరు. మధ్యస్థము పిలిచిన పిమ్మట మౌనముఁగొని యుండు టెట్లు ? మఱుఁగుగానైన సగము చూపి చూపక యుండుటెట్లు ? శుద్ధాంత మనఁగా సేవకులు మొదలగు నీచులతో సావాసమన్న మాట ! గరువతనము కిది యనుకూలమా ? మఱియు, నట్టి కన్య లకు నితర చింతలే యుఁండవుగాన తమ చింతయే ప్రధానము. రాజ్యము, దేశము, జ్ఞానము, ధర్మము, వీనింగూర్చిన విచారములు సున్న. అప్రయోజకముగా నుంచఁబడి యుండుటచే మనసు పరిశ్రమలేక కృశించి నశించును. ఇట్టివారు స్వసుఖపరాయణు లగుటేమి చిత్రము ? మఱి సుఖ మనఁగా వీరికి దేహసుఖమనుటఁ దప్ప నింకే యర్థమైనఁ గలనైనఁ దోఁపగలుగునా ? ఏ పనిపాటు లును లేక తిని, కండక్రొవ్వి, మదాంధలై కాలము భారముగ నుండునట్టి జవ్వనులు శుద్ధాంతముల నున్నను సంతసానులట్ల ప్రవర్తింతురు. విచ్చుకత్తుల పారా లెక్కవయౌకొలఁది సందు దొరికినంజాలు! సమయము వ్యర్థపుచ్చక త్వరలోఁ గార్యము దీర్చు కొందమను తొత్రుపాటును గలుగును. అది యుదయమయ్యెనేని, మానము, మఱుఁగు, సామరస్యముఁగల శృంగార మెక్కడిది ? శృంగారమునకు బదులు జావళీలు వచ్చి చేరును. పాపము. మన దేశములో నెందఱో స్త్రీలకు దూతికాముఖమైన మోహమేగదా గతి ! కన్ను లుపయోగింపఁబడనందున వీరి కవి మందము లగు నేమో ! చెవులు అనవరతోద్యోగములో నుండునవిగాన చుఱుకుగల వగునేమో ! చిత్రఫలకమో, చెప్పుడుమాటయో కామసందేశపద్ధ తులు ! ఇవి దప్ప వేఱుమార్గములు మృగ్యములు !

"పురుషుఁడే దేవుఁడు ప్రస్వేదగాత్రుడైనను అస్వేదగాత్ర తుల్యుఁడు" అని పద్మగంధులు యోజించుటకును యోజింపఁ జేయఁబడుటకును గల కారణములలో శుద్ధాంతనివాస మొకటి. ఎట్లన, బయటఁ బోయినఁగాని లోక వర్తమానము లెఱుకకురావు. కూపస్థమండుకముల కాకూపమే పాలసముద్రము. రాజ్యాంగముల నుద్ధరించుటలో నిపుణులైన మంత్రులు, దేశభక్తిచే విరాజిల్లు ప్రతినిధులు, యుద్ధరంగమున శత్రువుల నోడించి నిత్య యశో

భాసితులై దేశదేవతలఁబోని సేనానాయకులు, ప్రకృతిశాస్త్రవిచక్షణులు, తత్వార్థదక్షులు, ఇత్యాది చరిత్రార్థుల సంగతి పొంతఁబోక గుమ్మములోఁ గూరుచుండి దొరతనము—అనఁగా నింటివారిమీద చేయు మహారాజును దప్ప నింకెవరిని జూడని భార్యకు వాఁడే యఖండపరిపూర్ణుడుగాఁ దోఁచునేమో! ఒకేయాకారము గుతివెట్టి యస్ఖలితంబుగఁ జూచుచుండిన నది నిరాకారబ్రహ్మమట్టులు పరిణమించునేమో! కాకి బిడ్డ కాకికి ముద్దు తమ తల్లినిమించిన రూపవతులు గుణవతులు లేరని చిన్నబిడ్డలు నమ్ముదురు. పెద్దవారై యనేకులం జూచినపిమ్మటఁ బోల్చిజూడ నారంభించి తక్కినమ్మల యుత్తమత్వము నొప్పికొనుట గలదు. ఇంకొక రెక్కువవా రున్నారనినంతనే తల్లిమీఁద ప్రేమపోవునా? పోవునని బుద్ధిశాలినియైన యే తల్లియేని నసూయ వహించునా? జనముల తారతమ్య నిరూపణకృత్య మొకటి. అనురాగపాత్రములని భావించు కృత్యము వేఱొకటి. ఈ రెండును సర్వత్ర యైక్యభావముం బూనునవిగావు చూడుఁడు. శంకరాచార్యుఁడు ఘనుఁడైన తార్కికుఁ డన్నమాత్రముననే యతనిని గౌఁగలించికోవలయునని యందఱకు బుద్ధి వొడముట యావశ్యకమా? నైజమా? తర్కము బలముగా నుండవచ్చును. రూపము దక్కువగా నునికి, గుణము సర్వసమ్మతముగామి. దానితో సంశ్లేషింపఁజాలిన ప్రకృతులు విరుద్ధములుగావు. అట్లగుట వలపున కుత్పాదికములగు వేయి హేతువులలో నొకటి యున్నయెడ సర్వస్త్రీలును వానిపైఁ బడుదురని నమ్మువారును, నమ్మి యట్లు నడచువారును మనుష్యులా? జడులా? స్త్రీలవిషయమై మాత్సర్యముం దాల్చువారికి రెండు విధములగు భ్రమలు గలవు. ఏవియన, తాము పరిపూర్ణులై యున్నంగాని వారు హృదయ పరిపూర్ణముగఁ దమ్ముఁ గామింప రనియు, నెవనియందైన నేదైన సుగుణము అధికముగా దేదీప్యమానమైయున్నచో, వాఁడు గంటఁబడెనేని, తక్కిన గుణముల సంగతి యాలోచింపక, వానిపై నుద్దండముగాఁ బడుదురనుటయు, ఈ యెన్నికలు రెండును హేతురహితములు. సర్వగుణ సంపన్నుఁడైనవానితో విసుగు దవిలిన మనసుతో గుజ్జువాని వలచువారు లేరా? తుదకు ఉన్నతులగు పురుషులు సైతము, ఏన్నో తబ్బిబ్బులకు లోపములకు నాకరములైన భార్యలమీఁదఁ జూపు ప్రేమావేశమును, నిరంజనుఁడైన దేవుని యందుఁ బ్రకటింపఁ జాలుదురా? చిత్తము పలుపోకలఁ బోవునది. గోడలచే నెట్లు నిరుద్ధము గాఁజాలదో యట్లే కారణమునకును

దుర్నిరోధము. ఇది స్వభావసిద్ధమని యంద ఱెఱింగియుండియు, నైరోపాకవులు ప్రయోగించినట్లు ఈ న్యాయము మనవారు తమ కృతులలో వ్యాప్తికిఁ దెచ్చియుండలేదు.

మీఁద వివరించిన భ్రమలవలనఁ గలిగిన క్షోభములు రెండు. రాజుగారు దేవి నొకదాని సంపాదించి పురమున నూరేగునపుడు పౌర స్త్రీ లందఱుఁ గామాతురతమై వానింజూడ పరిపరి వికారవేషము లతో వచ్చిరని ప్రబంధముల వర్ణింపఁబడి యుండుట. ఈ కవుల యూహ యేమనఁగా "రాజు! ఇంక వానిం గలయఁగోరక తరుణు లెట్లోర్తురు! మనము రెండణాల దక్షిణ నాశించి యే తారతమ్యముల నెంచక ధనికులను దొంగభక్తి నాశ్రయించుచున్నాముగదా! స్త్రీలును, మనకన్న నెట్లు శ్రేష్ఠలు! నికృష్టజన్మలే గావున వారిలో నిట్టి పిచ్చి యెక్కువ!" యని కాఁబోలు! రెండవది "భర్త దేవుఁడు. గుఱక పెట్టెడు ప్రాణాయామబ్రహ్మ! వాని నే యంశమందైన మీఱినవా రెవ్వరులేరు. ఒక్క లేరనుటయేకాదు. సృజింపఁబడరు. పడఁ జాలరు!" అని భక్తిఁ దాల్చియుండవలయునను పాతివ్రత్య ధర్మ ప్రకటనము, ఏమి యీ జనులకుఁ గల దైన్యమహిమ! పరిపూర్ణు లని తలంపఁబడరేని భార్యలు ఛీ యని వదలిపోదురా! భార్యలు మాత్ర మంత పరిపూర్ణలా? మనుష్యులలో మనుష్యులమని యెల్లరు నున్న సంసారము సాఁగదా! మఱి సభలకుఁ బిలిచికొని పోయిన వివేకానందస్వామి, గోకలే మున్నగు మహనీయులం గాంచి, "వీరు గొప్పవారు" అని భార్యలు మెచ్చికొనిరేని, మనను మాఱినవారౌదురను భయముం దాల్చు మగవారి నీచతకొలఁది నిర్ణయింపఁబోలునా? స్త్రీలు గుణము కొలఁది వలచువారైరిపో. అది శ్రేయోహేతువేగాని యనిష్టసాధకమా? వారి హృదయానందము నర్థించియైనఁ బురుషార్థము సాధింపఁ జూతుముగదా!

## మోహప్రకృతి

మన గ్రంథములలో చిత్తవిజ్ఞాన మత్యల్పము. అనఁగా పూర్వ కావ్యములఁ దప్పఁ దక్కిన యర్వాచీన గ్రంథములలోననుట. పురుషుఁ డెందఱ స్త్రీలనైన గోరవచ్చునఁట! తప్పులేదు! తప్పేల? దక్షిణ నాయకుఁడు! కృష్ణమూర్తి! స్త్రీలు అన్యపురుషులమీఁద మనసు పోనిచ్చిరేని, అయ్యో ఎంత పాపము! పాతాళమును మఱింత లోఁతుగా ద్రవ్వినఁగాని యా పాపము నింపలేము! కన్ను గదల్చినజాలు! ఆపె బంధకి! దుర్మార్గురాలు! మగవారి కొక

న్యాయము, స్త్రీల కొక న్యాయముగా నేల విధింపఁబడెనో చెప్పువారు లేరు! అది యటుండనిండు! స్త్రీ యనునది జడము గాదు. తిర్యగ్జంతువుఁ గాదు. ఆత్మ గలిగిన మనవంటి చేతనము. మన మేరీతిని స్నేహితులు, బంధువులు, అన్నదమ్ములు, కొడుకులు, భార్యలు (బహువచనము హిందూజనులలో నయోగ్యము గాదు) మొదలగు ప్రాణసములతో సహేతుకముగనో, నిర్హేతుకముగనో, కాలవశమున భేదింతుమో, ఆరీతినే స్త్రీలును భేదముఁ గొనకుండుటకు వారేమి యంత్రములా! మానవులు గారా? భేదమును గొనినంతనే మనల నెవ్వరుఁ దుచ్ఛులని గణింపరు. మఱి కారణము లారసి తీర్మానింతురు. మనలో స్త్రీ నడవడిఁగూర్చి సిద్ధాంతము చేయునపుడు ఖండనమేగాని విచార మెక్కడిది? అట్లగుట గొప్పబుద్ధిచేఁ బ్రేరితమైన భర్తమీఁది విరక్తి యనునది యొకటున్నదని మనవారికిఁ దెలిసినను, బహిరంగముగ నొప్పుకొనరు. కావ్యముల నిట్టి చిత్ర చరిత్రలు వర్ణింపఁబడి యుండలేదు. చూడుఁడు. తన భర్త కులాభిమానము విడిచినవాడైన బత్ని యేల వానిని వదలరాదు? అన్యాసక్తుడై యిచ్చిన బాస మఱచినఁ దనకు నట్టి మఱపేల రాఁదగదు? లంచముకొఱకో పగచేతనో మాతృద్రోహముఁ జేయువాఁడై తన దేశమునకు నాశముఁగోరి శత్రురాజులకు సాయముచేయఁ కడఁగెడు దురాత్ముని భార్య శిరశ్ఛేదనముఁజేసిన నకృత్యమా? సుకృత్యమా? మఱి దేశభక్తుడై నిరంతర యత్నములచే దేశాభ్యుదయము నభివృద్ధిఁ జేయువాని నేల ప్రీతిపాత్రుడని చేరువఁ జేర్చికొనరాదు? ఒక పతివ్రతా ధర్మమున్న నింకే ధర్మములును బనికిరావా? అవి అస్తమించునా? వాని నుపాసింపకున్న నవి కీడు తేకుండునా? ఈ పాడు పాతివ్రత్యము నుద్ధరించు ప్రకృతియొక్క గృహముమాత్రమె. అదియే పతిభక్తికి రంగస్థానము! దేశోద్ధారక ధర్మములకైనను నిది యెక్కువయా? అలనాఁడు మహమ్మదుగోరీకి నాహ్వాన సందేశ మంపి దేశము నొరులకు సమర్పించిన జయచంద్రున కతని రాణి విషమో తవుడో పెట్టియుండిన నామె కొక దేవాలయము కట్టించి పూజ సేయకుందుమా? పతిభక్తి నేటఁ గలిపిన వారందఱు నొక్క లెక్కయనుట మన యాచారము! పతులను గుణములఁకొలఁది వర్ణించి వారిని విసర్జించిన భార్యల యుద్దేశములను గారణములను గణించి, వీరియందును గౌరవలాఘవముల నిరూపించి చూచితిమేని, భర్తను వదలినవారిలో ననేకులు మహాత్మురాండ్రని యేర్పడును. మఱియు వదలినవారిలో ననేకులు పేదబుద్ధి గలవారని,

పిఱికివారని, నీచాత్ములాంధ్రులనియుఁ దెలియకపోదు !

ఏదేని యొక్క ధర్మమును మాత్రము పట్టి మనుష్యుల చరిత్రలఁ గణింపఁజూచుట మౌఢ్యము. అందును ఆ ధర్మమునుండి తొలఁగినవారి స్వభావము, స్థితిగతులు, కారణములు, కాంక్షలు, వేనినిం బాటింపక తీర్పుచేయుట కన్నులు పోయిన కబోదిమతము.

దీనిచేఁ గావ్యములకు గొప్ప లోపము సంభవించినది. ఏది యన, శృంగార మనిన నేక విధమైన శరీర రాగమని యెట్లు భ్రమించిరో, యట్లే జారశృంగారము నేకగతిం బోవునది యని యోజించి, నరుల మనసులు నానారూపములైన చిక్కులం దాల్చిన వనుటఁ దెలిసికొనక, విసుగు పుట్టించునంత యభిన్నవర్ణనలఁ జేయు దౌర్భాగ్యము. జారస్త్రీ లెల్లఁ జెడ్డవారయఁట ! కండకావర ముచే నన్యులఁ గోరువారఁట ! ప్రబంధములలోని పతివ్రతలు మాత్రము కండకావరముచేఁ గోరువారుగారా ? ఇంకేవరము వారి కున్నది ? శృంగారము నీచశృంగారము. దానికిఁ దగినట్లు జారత్వ మును నీచముంజేసి జతఁగూర్చిరి. మనుష్య స్వభావమును బరీక్షించి వ్రాయక యలంకారశాస్త్రములఁ దలనిడికొన్నందుకుఁ గలిగిన యధోగతి యిది !

సరాసరికి నీగృహకృత్య పతివ్రతలకన్న నైరోపా మొదలగు వృద్ధిభూములలోని పలుగాకులు మేలు. రుష్యావారికిని జపాను వారికిని కొన్ని యేండ్లక్రింద ఘోరయుద్ధము ప్రాప్తమైనపుడు, రుష్యావారి రణసన్నాహములయొక్కయు, కోటలయొక్కయు, సైన్యములయొక్కయు మర్మముల నెఱుంగ జపాను రాజ్యములోని నారీమణులు కొందఱు బుద్ధిపూర్వకముగ వేగుపనికిఁ బూనినవారై, తరుణములందు శత్రుసేనానాయకుల పరిరంభణములకుం గూడ సమ్మతించి, యమూల్యవృత్తాంతములను దేశమునకు దానముచేసి యుపకార రాజ్యపట్టమహిషులైరని వినియున్నాముగాదె ! వీరిని నీచ చరిత్రలని భావింపనొప్పునా ? గృహధర్మము, దేశధర్మము విరుద్ధగతులం బోవునవియైనచో దేశధర్మము నెడ నెక్కువ గౌరవముఁ గలవారా నికృష్టులు ! గృహమునకు మించినది లేదను వారా ? యోజింపుడు ! దృష్టి ననుసరించి కొలఁదు లేర్పడును. సంఘపరమైన దృష్టితో తత్త్వపరిశీలనము చేయువారికి హిందువుల నీతులు మొత్తముమీఁద హీనములని తోఁపకమానవు. ధర్మముల పరస్పర ప్రాతికూల్యము ఐరోపియనులు విమర్శించినట్లు మన వారు చేయలేదు. కారణము, మూఢభక్తిపరాయణులు గావున.

యోజించి యనుష్ఠించిన గుణదోషములు గాన్పించును. యోజన లేక చేయువారికి సందేహ మెక్కడిది, సత్యాసత్య విమర్శ మెక్కడిది ? తాటాకులలో వృద్ధప్రచారములో ప్రమాణములు. మనసుగాదు, కావునఁ గావ్యములోని కన్యకలకెట్లో, సిద్ధాంతులకు నారీతినే మనస్సునునది యడుగంటిన ప్రకృతి.

వీరయుగముల స్వాతంత్ర్య మఖండము

మూఢభక్తి ప్రాబల్యమునకు రాని భారతకాలములో ధర్మముల యన్యోన్యవైరముం గూర్చిన శోధన లుండెననుటకు దృష్టాంతములుగలవు. అన్న మాటప్రకారము తమ్ములు నడువవలసిన వారైనను భీమార్జునులు ధర్మజుం గినిసి తూలనాడలేదా ? సత్యము భూతదయ ఈ రెంటికిని బొత్తుగలుగనిచోట్ల, భూతదయయే శ్రేష్ఠతరమని కృష్ణుని యుపదేశము. పతులకు లొంగి వినయవిధేయతలమై నడువవలసిన విధిగలదయ్యు ద్రౌపది సమయముల ధర్మరాజాది పురుషులఁ గఠినాక్షరంబుగాఁ జిన్నఁబుచ్చి పలికి క్షత్రియ ధర్మోద్ధరణంబు గావించి యసదృశకీర్తివైభవోపేతయై వెలింగెఁ గదా ! ఈ వెనుకటినాళ్ళ చప్పఁడి పతివ్రతామణు లామెను మీఱి వెలయువారా ? చవి సారములేని పాత్రములకు దారిచూపినది రామాయణము. భరతుఁడు మొదలగువారు నిర్వికల్పులు. భారత వీరులు సవికల్పులు, మనుష్యులు, దారుయంత్రములుగారు. "సంతతక్షముండు సంతతతేజుండు నగుట పాపమందు రనఘమతులు" అని 'తాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్లు' అని వాదించు మూర్ఖమానసులఁ దీసివైచినది ద్రౌపది. ఆమె దివ్యచారిత్రమే యానీతికి నుత్తమనిదర్శనము. పౌరుషము గలవారు విమర్శము, కారణశక్తి, నిర్భయ హేతువాదము, వీనిం జూచి జడియరు. దైన్యముంగుడుచు శుష్కసత్త్వులకు నన్యశాసితములగు నాచారాదులు ప్రధానములు. స్వాతంత్ర్యము లేనివారగుటచే స్వేచ్ఛా యోజన ప్రాగల్భ్యము వారికి నలభ్యము. ఇఁక విమర్శనము. కారణానుసార ప్రచారము, ఇవి యెక్కడివి ?

"హిందూదేశములోని కవులు స్వబుద్ధి నుపయోగింపక శాస్త్రములు, ప్రాచీనగ్రంథకర్తలు, పోయినదారినే గొఱ్ఱెలమందవలెఁ బోయినవారగుట వారి కావ్యములఁ బరిశోధించుటచే నా కాలమున దేశస్థితి జనుల నడవడి ఇత్యాది చారిత్రకాంశముల గుఱుతెఱుంగుట దుర్ఘట" మని యొకానొకరు నుడివిరి. ఇందు సత్యము లేకపోలేదు.

కాని యీ కవులు వర్ణించిన జాడలును తమకాలమునాఁటివారి జీవితముచే ఘనముగఁ గాకున్నను నల్పముగనైన నిర్ధారితములు గాన, వీనిచేఁ జరిత్రాంశములఁ గనుఁగొనవచ్చుననియు, భాష యొక్కయు దేశముయొక్కయు చరిత్రమును అన్యోన్య సామ్య ముండాల్చిన యవి గాని యేమాత్రము సంబంధము లేనివగుట యశక్యమనియు, స్థిరీకరించుట యీ దీర్ఘ వ్యాఖ్యానముయొక్క ముఖ్య తాత్పర్యము.

సూరన్న ప్రదర్శించిన యభవ్యశృంగారము, దేశీయుల యనాచారముంబట్టి యేర్పడిన వికార మన్నంతన, యీకవి నిర్దోషి యని చెప్పుట కష్టము. రసపోషణమునకుఁ బ్రతికూలములైన విషయముల పొంతఁ బోనేల? పోయెఁబో యిదియు నుత్తమ నాయికానాయకుల స్వభావమని చాటనేల! జనసామాన్యముకన్న నెక్కువ సౌమనస్యము లేకుండుటయు నొక కళంకము గదా! మఱియు అట్టి సౌమనస్యము కవి గలవాఁడని కళాపూర్ణోదయముం బట్టి నిరూపించితిమేని—నిరూపింపఁ గలమను ధైర్యమున్నది—యీయుత్తమగుణమును ప్రభావతీ ప్రద్యుమ్నము చేయు కాల మునఁ గోలుపోయి యుండుట యొకదోషము. పశ్చాత్తాపముఁ గలిగించు క్షయము! వయసు హెచ్చుటచేతనో, మఱి యెందుననో, భావనాశక్తి వాడువాఱియుండును! కల్పనాప్రతిభ మిక్కుటముగ నుండిననాళ్ళలో వ్రాయంబడినదగు కళాపూర్ణోదయముయొక్క గుణదోష ప్రకటనమును మఱల నందుకొందము.

# ద్వితీయ భాగము

## మొదటి ప్రకరణము

### కాలసరణి - హేతుసరణి

కథను వివరించు పద్ధతులు రెండు. విషయముల జరిగినట్లు కాలక్రమానుసారముగాఁ జెప్పుట, కాలక్రమమును వదలి స్వారస్యమగు నే సందర్భముననైన ప్రారంభించి పిదప వెనుకముందఱగా కథను బెంచి పూర్తిచేయుటయు ఇందునకు దృష్టాంతములు. భారత రామాయణములు కాలక్రమానుసారముగా వ్రాయంబడినవి. ఈ యితిహాసములలో వీరుల వంశావళులు, వారి జన్మము, వయసు, పెరుగం బెరుగ సంభవించిన కష్టనష్టములు, ఇత్యాదులు కాలోపగతంబైన వరుస మేరకుఁ జూపఁబడియుండుట సర్వజన విదితము. ప్రభావతీప్రద్యుమ్నముం గమనింపుఁడు. కాలముంబట్టి కథనేర్పఱిచియున్నఁ దొలుత వజ్రనాభుని వృత్తాంతము, వాని తపోమహిమ, నాకలోకదండయాత్ర, మహేంద్రపరాజయము, ఇవి వర్ణింపఁబడి యుండును. కవి యిట నవలంబించిన మార్గము వేఱు. 'ఇంద్రుఁడు శ్రీకృష్ణదర్శనార్థమై విజయంచేసి' యని ప్రారంభించి, కార్యమేమని యాతఁ డడుగుఁడు, తాను దత్పూర్వకథ కొంతమట్టుకు విన్నవించినట్లు కారణములు వెల్లడిచేయుటకునైన చర్చలచేఁ గథయొక్క యాదిని దీసికొని వచ్చినాఁడు. దీనికిఁ బాశ్చాత్యు లిడినపేరు 'తర్కక్రమము' అనఁగా కార్యమునుండి వితర్కించుచుఁ గార్యములు పుట్టుటకుఁ దత్పూర్వమే ప్రసిద్ధికి వచ్చియుండిన హేతువుల నరయుట. తర్కక్రమమను మాటకైన 'కారణక్రమము' అనుట స్పష్టతరము. కాలకారణ క్రమములకుఁ గల వ్యత్యాసముఁ జూపుట కొక నిదర్శనము : ప్రాతఃకాలమున నిద్రలేచి భూమి తడిగా నుండుటఁ గాంచితిమేని యా తేమనుబట్టి రాత్రి వానకుఱిసి యుండు నను హేతువు దెలిసికొందుము. వస్తువుల స్థితి—అనఁగా నునికికి వచ్చిన విధమును—పరికించి చూచిన వాన దొలుతటిది. తేమ తరువాతిది. మనకు వస్తువులం గూర్చిన యెఱుక పరముగాఁ జూచినఁ దేమ యాదిమసత్తు. వాన దానినుండి దెలిసికొనఁబడిన యనుమానము, కావున స్థితిపరంపరల నిర్ణయింపఁ జూచితిమేని యాదిమధ్యాంతములఁ గాలము

ప్రకార మరయవలయు. వస్తువులు పుట్టిన జాడ నటు విడిచి, దానికి హేతువులైన వానిని వెదకుచు వెనుకకును, దానినుండి సంభవించిన ఫలముల నరయుచు ముందునకును విచారములు సల్పితిమేని యయ్యది కారణక్రమము. వస్తువుయొక్క తత్త్వము ప్రకాశితమగుటకు నీ రెండు విధంబులు ననుకూలించినవ. వానను బ్రథమమునఁ బేర్కొని హేతువును గొనియాడి వానియందుఁ దదనంతరము పుట్టినది తేమయన్నను ఒక్కటే. తేమను దొల్తఁ జూపి యా సిద్ధికి నేమి కారణ మని యాలోచించి వాన హేతువని యటు తరువాత స్థాపించినను ఒక్కటే. ఆలోచనయొక్క ప్రారంభావసానములు భిన్నములు గాని యది పోవుత్రోవ యొండే. ఇట్లు ద్వివిధగతులఁ జరించినను సిద్ధాంతవ్యత్యాసము లేమికిఁ గారణ మేమన, స్వభావమునఁ గార్యకారణజాలంబు నిర్వికల్ప మగు క్రమమును దాల్చి యునికి. వానచే నేల తడియగుటయు, నేల యంతయుఁ దడియుటకు వానఁ దప్ప నింకే హేతువును లేకుండుటయు, నిజములైన. నీ ప్రత్యయముల నొకదానినుండి యింకొకదానిని వ్యక్తపఱుచుట సుసాధమ. నికరముగా నీయవయవము నే యాధారముగఁ గొని యోజింపవలయునను నిష్కర్షయుండదు. హేతువులయుఁ దత్ఫలములయు ననవరత సాంగత్యమే యుభయ క్రమములకుఁ దావలము.

వస్తుతత్త్వ పరిశీలకశాస్త్రములలోఁ గాలక్రమమునకుఁ బ్రసిద్ధి యెక్కువ ఎందుకన, ఎయ్యది సృష్టిలో నాదియో దానినే గ్రంథమునను ఆదిగాఁ జూపిన శాస్త్రమునకు వైశద్యము. కావ్యములయందుఁ దత్త్వముగాదు ప్రధానము. మఱి రసము. అట్లగుట మొత్తము మీఁద గాలక్రమమును విసర్జించిన బాగు. ఎందుకన,

'కృతినాయకుని తల్లి గర్భము ధరించినది. పది నెలలకు సుతోదయము. పిమ్మటఁ బెరిగినాఁడు. చదువు సాములు నేర్చినాఁడు,' ఇట్లని వ్రాసితిమేని రసము రెండు విధములఁ జెడును. నాయకుఁడు పుట్టి పెరిగిన విషయములలో మన కేమి యక్కఱ! లోకములో నున్నవారందఱు పుట్టకయ పెరుగుదురా! మఱి వాని యందు మనకుండు శ్రద్ధకు హేతువు వాని యొక్క గొప్పతనము. గొప్పతనమనఁగా గుణములచేతనో, తన పడినపాట్లచేతనో, తాను సాధించిన మహోద్దండ కార్యములచేతనో, మన మనసులఁ దనయొద్దికి లాగికొను గుణము. కావున నట్టి ముఖ్యాంశములను, వానితో గాఢమగు చెలిమిఁ జెందిన విషయములను మాత్రము

ప్రచురించిన రసము సాంద్రముగ నుండును. లేనియెడ బానెఁడు నీళ్ళలో వైచిన గచ్చకాయంత బెల్లమువలె నది హీన మగును.

రామాయణ భారతముల విషయానుక్రమణిక

రెండవది. పుట్టె, పెరిగె, నేర్చె, దేశయాత్ర వెడలె నిట్లని వ్రాసిన నొకసంగతిఁ దెలిసినంత నిఁక ముందు ఘనమైన కార్యమో ఫలమో గలుగునను శంక మనకుఁ గలుగదు. కావున నుద్వేగముతోఁ జదువుదమను కుతూహలము వొడమదు. ఇఁక ముందేమి వచ్చునో చూతమని మనసు తహతహఁ గొనదు. కథయందు నవధానము జీర్ణమగును. ప్రస్తుత విషయముతోఁ దృప్తిఁ జెంది యుందుము. తరువాతి వృత్తాంతములు తామై నిదానముగ వచ్చువఱకు నుద్రేకములేక వేచియుందుము. చూడుఁడు. రామాయణములో, రావణుఁడు సీతనెత్తికొని పోవువఱకుఁ గథ కొంచెము కొంచెముగా విడిచి విడిచి చదివినను ఆయాసము దోఁపదు. అటు పిమ్మట "అయ్యో! సీతగతి యేమాయెనో! పగఁదీర్పక శ్రీరాముఁ డూరకుండునా! యుద్ధ మెట్లు చెల్లినది! ఆ పరమసాధ్విని రావణుఁడు చెఱచినాఁడా! ప్రాణములతో నుండనిచ్చెనా! భర్తయు మఱఁదియు నామెను రక్షింపఁజాలిరా! చెఱఁదలఁగినను సౌఖ్య పడెనా!" ఇత్యాది బహుభంగుల హృదయ మల్లలనాడి యాపె జీవితము తుదముట్టువఱకు నన్నివివరముల నెఱుంగ నలజడి గొనును. కావ్యము ముగింపునకు వచ్చినను నాపెపై మనకుండు చింతయు ప్రీతియు గౌరవమును ముగియవు. అనేకులు వాల్మీకి బహిరంగము చేసినది చాలదని, తమ తమిఁ దృప్తిజెందుటకై యయోధ్యలో పట్టాభిషేకానంతర మాయమ్మ యెన్ని క్రీడావినోదంబుల ననుభవించెనని యూహించి యాయమ సుఖము దమ సుఖముగా నానందింతురు. "భోగము లెన్నియున్న నేమి ? అనాఁటి పరిభవ మమ్మానవతి హృదయముఁ బాయునా ? శల్యమువలె నాటి వేదన యొనర్పకున్నె ? అట్లగుట శ్రీరాములకు వ్యసనము దోఁపఁ గూడదని బయట నాటలు పాటలు నవ్వులు నెన్ని పచరించినను లోన నానాఁటికిఁ గ్రాఁగి క్రుంగకున్నె!" అని యాక్రోశించువారెందఱు! మఱి, పారంపర్య నీచమును నీతియని భావించు నితరులు "రాముఁడు మన యట్టిఁడ! పరుని యింటఁ గాఁపుర మున్న యాలియెడ సందియముఁ దాల్పకుండునా ? తాల్పఁడేని

మగవాఁడా ! కావునఁ దప్పక వెలివేసియుండును” అని యెంతురు గాఁబోలు ! ఇట్లు పల్దెఱంగుల నమ్మహాదేవి నొక నిమిషమైన నెడఁ బాయఁజాలక మనస్స్వాంతము లాయమంజుట్టి రక్షకసైన్యము లట్లు గాచుచు నామె కారోపింపఁబడిన యవస్థలఁ దాల్చును. దీని కేవి ప్రమాణము లందురో, మీ యనుభవమును, పుంఖానుపుంఖముగ బయలువెడలిన ఉత్తర రామాయణము, మైరావణ చరిత్ర మున్నగు నుపరామాయణములును, వాల్మీకియొక్క మాహాత్మ్య మేమనవచ్చును ! అతని భావనాశక్తి తాఁకినఁ జాలును, మనకుండు బడుగో బక్క యోయైన ప్రతిభయును సాంగత్యప్రేరణచే రేగి యావచ్ఛక్తిని బట్టుపట్టి బయటఁ బెట్టి విజృంభణముతో నెందఱు పట్టినను నాపరానిదై “భావాంబరవీధి” విహరించును ! కవి బ్రహ్మల చందమిట్టిది. తామిడిన యారగింపుతో రక్తి పూర్తియై యంత మొందదు. మఱి యారగింప నారగింప నింకను గావలయునను స్పృహ ప్రజ్వరిల్లును. ఆత్మకేళియందు విరతికాస్పదమైన రతి యెక్కడిది. రామాయణంబున సీతాపహరణమెట్టులో భారతమున ద్రౌపదీ వస్త్రాపహరణము నట్టిద. పాంచాలీపరిభవము రక్తముతోఁ గాని తదితరములతోఁ గడిగివేయఁ గాదని మనసునకుఁ దట్టని మనుజులున్నారా ? ఆ కార్యము నెఱవేఱువఱకు నందే చిత్తములు హత్తి యూపిరాడనట్టు లుండును. అయిన నొక విజ్ఞప్తి. ఇప్పుడు వ్యాప్తిలోనుండు భారతము దాని కాదికవియైన వ్యాసుఁడు వ్రాసినది గాదు.* వ్యాస ప్రోక్తము గొంత భాగము మాత్రము. గ్రంథము సుప్రసిద్ధమగుడు జైనులు, వైష్ణవులు, బౌద్ధులు, స్మార్తులు, వీరశైవులు, పౌరాణికులు మొదలగు తెగలవారందఱుఁ దమతమ సిద్ధాంతముల నందులోఁ జొనిపి యా యితిహాసమును బాడుసేసిరి గాని, మూలకవియొక్క భావగాంభీర్యము గణనాతీతమగుటం జేసి యది యింకను బొత్తిగఁ బాఁడి యింకి, నిర్మూలము గాకున్నయది.- ఇది మన దేశముయొక్క భాగ్యములలో ప్రాథమికము. మతముల వాతఁబడియు జీర్ణముగాక బ్రతికియుండుటకన్న మించిన మాహాత్మ్యము త్రిలోకముల మూలమూలలగా వెదకినను దొరకదు ! అట్టి మాహాత్మ్యముగల భారతముం దలపోసిన నానందముచేఁ గనుల నీరు గ్రమ్మునేకాని, నాలుక తుదకు మాటలువచ్చునా ! పలుకులు

*ఇప్పటి భారతము “జయ” యను పేరిటి చిన్న వీర కావ్యముయొక్క పరిణామము. “జయనామకంబునను రాజితభంగి జగత్త్రయంబునన్ బూజిత కీర్తియై నెగడు” (స్వర్గా. 89)

దుస్తరములుకదా! మనసు దుర్భరమైన. అరణ్యశాంతి త్రయములు ముక్కాలు మువ్వీసము కృత్రిమ పర్వములు. తక్కినవానిలో నాది కవి వ్రాసిన ఫక్కినే విశుద్ధముగ నీ కాలమువఱకు వచ్చిన నెవ్వి యును లేవు, గాని సరాసరికి శుభ్రములని యంగీకరింపఁబడఁ జాలినవియ. కావ్యక్షోభ నాపాదించు రెండు దుర్విపత్తులందుండుట రసికుల పాపఫలము! ఎవ్వియన. దుర్యోధనుఁడు పాండవుల నడవికిఁ దోలుట యొకటి. పంద్రెండేండ్లుగూడ నజ్ఞాతవాసమే విధించియుండినఁ బాండవుల బ్రదుకెట్లయినఁ గానిండు, మనకు వైరస్యములేని కావ్య శ్రవణానందముగల బ్రదుకు దప్పియుండదు. పాండవుల యరణ్య ప్రవేశముచే మనకైన ప్రాప్తియేమని తెల్పుదు? దానికన్న నెన్నియో మడుంగులు క్లేశకరమగు వర్ణాశ్రమాది ధర్మము లంగూర్చిన మతవిహీన దీర్ఘప్రసంగ ప్రవేశము. అరణ్యరోదనమంట! దానికంటె దిక్కులేనిది కావ్యములలో వేదాంతరోదన! ఆ ధర్మరాజు శుద్ధముగ వదరుఁబోతు! ఋషులను జూచినదే దండముఁబెట్టి దూర ముగాఁ దన నీడయైన వారికి సోఁకనట్లు తొలఁగిపోవుచుండిన నెంత పుణ్యముగా నుండును! కాలక్షేపార్థము అడిగిన ప్రశ్నలే యడు గుచు, నుత్తరము లెంత విరుద్ధములుగ నున్న గంగిరెద్దురీతిఁ దల యూఁచుచు నాయన సల్లాపములు సలిపె! మన కవి ప్రలాపములు! రెండవ విపత్తు ఏదియందురో ఆ భీష్ముఁడు పెద్దమనుష్యునిరీతి గుటుకు మని చచ్చి జన్మసాఫల్యము నొందక కొన్ని నెలలు క్రిందఁబడి యునికి! మన గ్రహచారముగాకున్న భారతవీరులనెల్ల నుత్తముఁడని పొగడ్తఁ గన్న యాతఁడు పరస్పరాసంగత విచారముల నెల్ల మన నెత్తిని గట్టియుండునా? ఋషి సందర్శనము, భీష్మోప దేశము అను నీ రెండు తరుణములు సాకులుగఁ జేసికొని యీ హిందూదేశములో నెన్ని వాదములు, వేదములు, మతములు, తత్త్వములు బయలువెడలెనో వానినన్నింటిని సులభముగ లోకు లలోఁ బ్రసరింపఁజేయుకొఱకై యీ యుత్తమోత్తమ కావ్యములో నిమిడ్చి దానిని కంటక పాషాణ వన్యసత్త్వ భయంకరమైన మహా రణ్యముఁగా నొనర్చిరి.* కవిత్రయమువారీ చిక్కుల విడఁదీసి విడిచి యాంధ్రభారతము మాతృకకంటె రసవత్తరముగ నొనర్చిరి కాని, జనాపవాదశంకఁజేసి యేమో, వారు పూర్తిగా సవరింపలేదు. రామాయణమునందు కథాసంయోగము అఖండము. ముఖ్యాంశ ములనుండి దృష్టిని పెడత్రోవకుఁ దీసికొనిపోవు సంగతులంతగా

*మహాభారతము "సంహిత" యనఁబడుట కిదించుక కారణము.

లేవు. భారతమున నుపశాఖలు మెండు. కొన్ని శాఖలును గావు, ఏ సంబంధమును లేనివగుట. కావున నప్పుడప్పుడు దారిఁదప్పి పరిభ్రమించువారమై పిమ్మటఁ గష్టపడి కథారాజమార్గమునకు వచ్చులోపల తత్పూర్వము పఠించిన భాగములు మఱపునకు వచ్చుటయు సహజము. మఱపునకు రాకున్నను వానిచే హృదయములో దీపించిన భావనాశక్తిం గొని పరిగణించిన భారతమునకు గౌరవ మధికము. ఒక్క యధికమన్నం జాలదు. హస్తిమశకాంతరమన్నను సత్యమునకు నగౌరవము రాదు ?

ఈ యితిహాసములు సైతము కాలక్రమముగా వ్రాయఁబడక కార్యకారణరీతిగా కథలకెల్ల నాధారభూతమగు విషయముతో నుపక్రమింపఁబడి యుండినచో స్వారస్యమింకను నుద్ధురముగ నుండును. ఇవి త్రొక్కిన మార్గముననే వీనిలోని గుణములు మాత్రము లేని చిల్లర కావ్యములు తఱుచుపోయి యున్నవి.

"అనేక విధ పదార్థప్రపంచ సంచితంబు, నుపపర్వ మహాపర్వోప శోభితంబు"గను నుండుట యొక్కకతముగ, నాదినే భారతమునఁ గథాసంగ్రహము నిర్వర్తింపఁబడి యుండుటయు, "ద్వాపరాంతమునఁ బాండవధార్తరాష్ట్రులకు మహాఘోర యుద్ధం బయ్యె"నని వక్కాణింపఁబడి యుండుటయును. ఇందుచేఁ గథ కొంతమట్టునకు నేకీభావముం జెందుట, చదువరులకు ముఖ్యాంశములు గజిబిజిలేక యేర్పడుటయు నను శ్రేష్ఠములైన సిద్ధులు సేకుఱినవి. రామాయణము నందును కాలానుసరణముచేఁ గలుగు నైక్యభంగము సమర్థించు కొఱకుంబోలె సంక్షేపముగ నాదినే కథాభాగములు దెలుపఁబడియున్నవి.

కార్యకారణక్రమమునఁ గథను వర్ధిలఁజేసినవారు ఆంధ్ర ప్రాచీన కవులలో నాకుఁ దెలిసిన సూరన్నదప్ప నింకెవరును లేరు. బహుశః ఈ మార్గ సంచారమునకు మొదలిడిన వాఁడితఁడే యేమో! ఈ విషయమై ప్రభావతీ ప్రద్యుమ్నముంగూర్చి చర్చించుచో నొక్కింత వ్రాసియుంటిమి. గాని యందును నది కళాపూర్ణోదయము ననుకరించినదని చెప్పలేదు. కార్యకారణ సమ్మేళనముచే నేకీభూతముగా వ్రాయఁబడిన గ్రంథములలోఁ గళాపూర్ణోదయము ప్రథమము. స్వతంత్రముగ నవీన భంగుల రచించుట కవియొక్క మహాప్రతిభకు ఫలము, సాక్షియును.

## కళాపూర్ణోదయమునఁ గార్యక్రమము ముఖ్యపద్ధతి

కాలక్రమముంబట్టి చూచిన నీకథకు నాదిమభాగము పంచమాశ్వాసములోని సరస్వతీ చతుర్ముఖుల లీలాకేళి. అనఁగా సామాన్య కవులు వ్రాసియుండినఁ బంచమాశ్వాసము ప్రథమాశ్వాసమై యుండును. చూచితిరా! ఈకవియొక్క కూర్పులోఁ గథా ప్రారంభమునకుఁ గావ్యప్రారంభమునకు నెంతదవ్వో! ఇట్లు దూరస్థములయ్యు నల్లిక చెదరక జిగిబిగిగా నున్నందున నియ్యవి గాఢాశ్లేషముం గాంచియున్నవి. కథ పూర్తిగాఁ దెలియుటకు నైదాశ్వాసములు చదివి తీరవలయు. ఇఁక కథ నెఱుంగవలెనన్న కుతూహలమన్నో ప్రథమాశ్వాసములోనే యంకురితము! "రంభానలకూబరుల వలనఁ గడపట వినంబడిన వాక్యంబొక్కటిఁ దలంచికొని కృతాంజలియై" కలభాషిణి నారదునితోఁ దావిన ప్రకారంబు నీరీతి విన్నవించుచున్నది.

సీ. ... ... ... ..
ఏను వృథాభ్రాంతి నింతనంతను దాని
వెంబడిఁ జని పల్కు వింటినొకటి
వినుఁడది, యర్థేశతనయుఁడో యబల! యి
న్నారదు మాటలు నడుమవేఱ
తే. పొడమె నేమయ్యెనల "కళాపూర్ణుసుద్ది"
కడమచెపుమన్న రంభ యప్పుడ తెలుపనె
నీకు మరి చెప్పరాకుంట నీకథయును
నీకు నాతోడు సుమ్మబ్బ నీకు మనియె.

(కళా. ఆ. 1, ప. 191)

ఇదియే కళాపూర్ణునింగూర్చిన తొలుతటి ప్రస్తావన. ఔత్సుక్యముఁ బ్రేరేచు విధములు చూడుఁడు. రంభ తన ప్రియునికినైనఁ జెప్పరానికథ యెట్టిది? ఏ కారణముచేత నామె మౌనధారిణియాయె? నను మొదలగు ప్రశ్నలు తమంతట నావిర్భవించి, సమాధానము తెలియువఱకుఁ గథనుండి మరలఁ గన్నెత్తనీకచేయును. కావ్యములలోని యేకీభావ మనఁబడు గుణంబదియ. అనఁగాఁ నొక పట్టున, నొక గ్రుక్కగా సర్వముఁ గ్రోలమేని దనివినీయమి. భాగభాగముగఁ జదువఁబోయినఁ దృప్తిలేదు. ఏలన, సమాప్తివఱకు

"తే. ఏ నెఱుఁగ వేడ్కపడుచున్న దానవో త
పో ధనోత్తమ యా కళాపూర్ణుఁ డనగ
నెవ్వఁ డాతని సుద్దిమున్నేమి చెప్పె
నెద్ది చెప్పరాదనియె నాయిగురుఁబోఁడి" (కళా. ఆ. 1, ప. 192)

అని పలికిన కలభాషిణి పలుకు లా యమవేగాదు మనవియును. మండుకొఅవి నెగఁద్రోసినట్లు నారదుఁడు "ఇదియంతయు నపూర్వంబు నాకునుం జెప్పరాదు" అని యానతిచ్చు తఱికి మన యుద్రేక మాఁపరానిదయ్యెడు! నారదుఁడు ఈ కథ యత్యపూర్వమనుట, కవిపాత్రముల మూలమునఁ దనఁ కృతిని దానే యటనట విమర్శించుట కింకొక ప్రమాణము. రంభానలకూబరులకు నీ యపూర్వ వృత్తాంతముం గూర్చిన ప్రసంగ సమయమున వివరించుచు నారదుఁడు కలభాషిణితోఁ దన ప్రియునకైనఁదాఁ దెల్పమికి నా యుప్సరస చెప్పిన విధంబు వినుమని యిట్లనియె.

"సీ. ...... యో పౌరుషాభరణ తత్కథలు వ
చ్చిన నేమి యంటేని వినుము దెలియ
నాకథ లిఁకఁ జెప్పినట్టివారును విని
నట్టి వారును ధాత్రియందుఁ బుత్ర
పౌత్రప్రపౌత్రాది బహుసంతతియుఁ దన
ర్పుచుఁ జిరకాలంబు ప్రచురసంప
దభివృద్ధి శోభిత శుభసౌఖ్యముల గాంతు
రను మాట యున్నది యాదియంద
'యేను నీకది చెప్పిన దీనికొఱకు
నవనిఁ బుట్టఁగవలయునో యని వెఱచెదఁ
బ్రాణవల్లభ యవి తావకాంగసంగ
సౌఖ్యమునఁ జేర్చు నాకు నిష్టంబులగునె'
తే. అదియు వింటిని గదయని యనియెదేని
యేను వినినట్టి పిమ్మట నిట్టిమాటఁ
బలికె నొక్క యమోఘ వాగ్విలసనుండు
గావున వచింప విననిఁక గాదు నాకు."

(కళా. ఆ. 1, ప. 201, 202)

ఈ మాటలతో మనయొక్క యుత్కంఠ గొంతునకు మీఁదుగాఁ బోవును! ఉత్కంఠకుఁ దోడు అద్భుతమును వచ్చి చేరును. ఎట్లయిన, కేవల నిరర్థక వ్యాఖ్యానమైన ఫలశ్రుతిఁగూడఁ గథలో ముఖ్యాంగ

ముగఁ జేర్చినాడే యను విస్మయ మొక్కటి! మఱి, యీ ఫలములు దేవతల కశుభములగు గావున వినవలయునను సంభ్రమ మింకను నుద్గాఢమగును. ఒక పక్షమువారికి మేలుగను, మఱియొక పక్షము వారికిఁ గీడుగను అవతరించిన యీ చరిత్ర మేరీతి భూలోకములో వ్యాపింపఁ గలదని యాశ్చర్యపడమా! కథ దేవలోకములోఁ బుట్టి యుండుట ఈవఱకే స్పష్టము. ఇఁక దేవతలు దెల్పనిది మనకుఁ దెలియు టేభంగిని? కథయే మో తెలిసియేయున్నది. లేకున్న నీ కావ్యమెక్కడిది? నారదుఁడును,

"తే. అతివ! విను రంభకును గల యట్టి భయము
నాకుఁ గల్గుటఁ దత్కథ నీకుఁ జెప్ప
గూడ దట్లయ్యు మిక్కిలి కువలయమున
వెలయఁ గలదది వెలయు త్రోవలును గలుగు!"

(కళా. అ. 1, ప. 204)

అని చెప్పుచున్నాఁడు. అతని వాక్య మమోఘము! అట్లగుట నెవ్వ రికిని నపాయంబు నాపాదింపని యే మంత్రముచే గవి యీ క్రియ సమర్థించునో యని యబ్బురపాటును, దొట్రుపాటును జదువరు లకుఁ దలమునుకలౌఁగదా! మనల నేకాగ్రావధానులం బరవశ చిత్తులం జేయుటకంటె శిల్పసౌభాగ్యమెయ్యది? కల్పన యనఁగా నిట్లుండునదే కల్పన. ఊపిరి యాడకుండునంత యుద్వేగముం గల్గించునది.

ఆధారవిషయమును గార్యముచే రోయఁబడిన కారణముగాఁ జూపుటయే గాదు. మీఁది యుదాహరణములం జూచిన నంగ ప్రాయములను చిల్లర విషయములంగూడఁ గాలసరణిగ నీ కవి వర్ణన సేయఁడని తెలియుచున్నది. రంభానలకూబరు లాడుకొను చున్న కళాపూర్ణు గాథలు అటు తరువాత నడిచిన కలభాషిణీ నారద ప్రసంగమునం దేలుచున్నవి. దీనింగూర్చిన నిదర్శనము లీ గ్రంథ ములో లెక్కకు మీఱియున్నవి. నారదుఁడు గాన విద్యాభ్యాసము నకై ద్వారకకు రాకపోకలఁ జేయుట ప్రథమ ద్వితీయాశ్వాసము లలో నివేదితము. దీనికిం గారణము కలభాషిణీ మణిస్తంభుల సంభాషణములో నారదునికిఁ దుంబురునితో నైన మాత్సర్యము నకు హేతువు, ఆ నారదుఁడే మణికంధరునితోఁ జెప్పినట్లు సిద్ధుఁడు వివరించిన, తుంబురునికి గానవిద్యా ప్రభావంబున వైకుంఠ లోకములోఁ బూర్వ మెప్పుడో నడచిన యనితరభావ్య సత్కారము.

కాలక్రమమును బాటింపక నాటక రీతిగాఁ బాత్రములచే కథను బెంపొందించుటలో సూరన్న యద్వితీయుఁడు. ఈ కౌశల మీతనికిఁ బరిపక్వము గామిచేతనో, యలంకార శాస్త్రములకు విధేయుఁ డైనందుననో, ద్వారకాపుర వర్ణనము ప్రభావతీ ప్రద్యుమ్నమున నున్నంత సొంపుగా నిటలేదు. కవియే నేరుగ వర్ణించునట్లు వ్రాయుట యొక దోషము మఱియుఁ బురజనవర్ణనముఁ గూడ, జేసియున్నాఁడు. ఇది గర్హ్యము. ఏలన, కావ్యమున నే యే పాత్రములు వచ్చునో వానిని మాత్ర ముచితస్థలముల వర్ణింపవలయునే కాని, కథారంభమున నిష్ప్రయోజన వర్ణనములం జేయుట యసంగతి యను వికారము.

### కల్పనాదోషములు

షష్ఠాశ్వాసములోని 189 వ పద్యము వఱకు నుండు నంత ప్రౌఢముగఁ దరువాతి భాగములు లేవు. ఈ గ్రంథమంతటితో సమాప్తిజేసియున్న సమ్మాన్యతరమై యుండును. ఏడవ, ఎనిమిదవ యాశ్వాసములలో భావనాశక్తి, ప్రతిభ మొదలగు కవిత్వ మూల శక్తులు బలహీనములు. తుదకు మధురలాలసా పరిణయాదులు వర్ణింపఁ బడకున్నను తత్పూర్వకథచే నూహ్యముల కావున వానిని బొందించియుంట వునరుక్తిఁ బోనివి. ప్రధానాఖ్యానముతో నైక్యము వీని కత్యల్పము. అట్లుండియు నీ నిరర్థక ప్రస్తావనకుఁ గవి యేల ప్రవర్తించినాఁ డనుట చింతనీయము.

కథాంగము లేక భావముం దాల్చి యొక శరీరముగా నేర్పడి యున్నఁ గళకు ప్రాశస్త్యము. అట్టి గాఢ సంయోగమునకు షష్ఠాశ్వాసములోని పూర్వోదిత పద్యమునకుఁ దరువాతి భాగములన్నియు విచ్ఛేద హేతువులు. ఇది యెఱింగి ప్రతిక్రియ చేయ నెంచినవాఁడై కాఁబోలు, కథయొక్క యాదినుండి యంత్యమువఱకు 'పూసలలో దారమట్లు' యిమిడియుండు గతి మణిహార వృత్తాంతముంగూర్చి యున్నాఁడు. ఈ హార వృత్తాంతముం దిలకింపుఁడు.

### మణిహార వృత్తాంతము

దీనికి నాదిమ ప్రభువు విష్ణువు. అతనిని దపస్సుచే మెప్పించి దానిని బడసినవాఁడు నుగ్రహుఁడు. పిమ్మట బ్రాహ్మణ శాపమున నతండు దనదొల్లిటి యెఱుకయంతయు హతంబుగాఁగా, నూతనావతార మెత్తినవాని యట్లు సత్వదాత్ముఁడను పేరఁబరఁగి రాజుగాఁ

గొంతకాలముండి పిమ్మటఁ గళాపూర్ణునికి మంత్రిగాఁ గుదిరె. సుగ్రహుఁడు మున్ను దేవతాలయములోఁ బెట్టి మఱచిన యా మణి హారమును మధురాపురపు బ్రాహ్మణుఁడొకఁడు తీసికొనిపోయి తన యింట బహు వర్షములు పూజసేయుచు నుంచికొని ద్వారక కరిగి శ్రీకృష్ణునికి సమర్పించెను. శ్రీకృష్ణుఁడును "దండకాకృతి సముజ్జ్వల సంస్తవలీల కెంతయున్ ఘనముగ మెచ్చి యిచ్చె మణికంధర నామునకున్" మణికంధరుఁ డలఘువ్రతునకు, నతఁడు కళాపూర్ణునకును, నాతఁడు శిశుప్రాయ యగు మధురలాలసకుని గ్రమముగ నొసంగిరి. అట్లగుట నీ హారమును సరస్వతీ చతుర్ముఖ విలాస క్రీడయుం బోలెఁ గథ నేకీభూతముం జేయు కల్పనలలో నొక్కటి. పూర్వోత్తరభాగంబు లన్నిటికిని ఈ హారము సామాన్యము. కథనెల్లఁ బ్రాఁకియుండు తీఁగవంటిది.

ఈ రీతి కల్పన మహోత్తరమైనదయ్యు నిష్కళంకంబు గాదు. ఎట్లన, ఆ హారముయొక్క నాయకమణి యెవ్వరి హృదయ స్థలంబున నెంతవఱకు సోఁకియుండునో, యంతతడవును వారికి సర్వజ్ఞత్వము, వాక్యపటుత్వమును సిద్ధించునని విష్ణువు వరము. దాని సత్యము ననుభవమునకుఁ దెచ్చికొనులోపల సుగ్రహుండు శాపహతుఁడాయె! మధురాపురి బ్రాహ్మణుఁడన్ననో దానిని గంత ములో ధరింపక పూజసేయుచు బహు వర్షము లున్నాఁడఁట! వాని భార్యయొక్క చిత్తస్థైర్యమెంత దృఢమో! ఆపెగూడ దొంగతనముగా నైన దానిని వేసికొనలేదు. శ్రీకృష్ణుఁడు మణికంధరుని మెడలోవేసి నాఁడు గాని యది "బాలతఁ గనుపట్టు విష్ణుని కలాపము గావునఁ దద్భుజాంతర స్థితికి చాలకొప్పి గళసీమనయెంతయు గుప్తమై" యుండెనఁట! 'బాలతఁగనుపట్టు' అను విశేషణము సమంజసమా? పూజారి బ్రాహ్మణుఁ డిచ్చినది బాలకృష్ణునకా? షోడశసహస్ర మహిషీ యుతునకా! పిమ్మట శిశువుగానున్న మధురలాలసకుఁ గళా పూర్ణుఁడు వేయఁగా నాయకరత్న యాపె హృదయంబు సోఁకునట్లు పడినది ! సమయముఁ జూచి పడవలసినచోటఁ బడినవిగదా! ఎంత తెలివిగల పతకము! అట్లు సర్వజ్ఞయైన యబ్బాలికామణి యనేకులు పూర్వ వృత్తాంతముం దెల్పి సత్వదాత్ముని చరిత్రమునకు వచ్చు నప్పటి కాపె "యటునటుఁ గదలఁగఁ దన్మణి హృదయస్థలముఁ బాసి కడకేఁగుటఁ దెలివి యుడిగెను!" ఇట్లు వ్రాయుట కామరూప ధారణమునకన్న నభావ్యము. ఏలన, సత్యముగా నుండునా యను

శంకఁ గలుగఁ జేసి కథయందు నమ్మికను భ్రమను బోఁగొట్టుఁ గావున. ఇఁక ముందఱి వృత్తాంతమింకను ప్రాయోభావమునకు దూరము.

> "వ. నాఁడట్లు బోధోదయం బగుటయు నడుగుటయు నేతన్మూలంబులని యెవ్వరు నెఱుంగకుండుటను నిది సామాన్య హారంబ యను తలంపున మావారు దాఁచి మఱచుటఁ జేసి నాఁటనుండి నేఁటిదాఁక నిద్దివ్యహారం బెన్నఁడును ధరియించుటయు లేదు. నేఁ డాభరణ భరణసమయం బునఁ బ్రసంగవశంబునఁ దలంచికొని చెలులు తత్ ప్రాప్తి ప్రకారం బెఱింగింప నిది సుముహూర్త లబ్ధంబైన ప్రథమ భూషణంబనియు భవద్దత్తంబనియు నత్యాదరంబునఁ దెప్పించి హృదయభాగ స్పర్శ నాయకరత్నంబు గా నిపుడు ధరియించి యున్నదాన."
>
> (కళా. ఆ. 8, ప. 189)

ఇందలి యసంభావ్యములు రెండు. కన్యగా నుండునపుడు ఆ రాజుగాలియైన సోఁకునా దేవుఁడా యని వ్యథఁగూర్చుచున్న విరహవేదన కాలమున, పెండ్లినాఁడు, ఎన్నఁడును రాని ప్రసంగ వశము ఇప్పుడేల పైఁబడవలయును? రెండవది 'హృదయభాగ స్పర్శ నాయకరత్నంబుగా' ధరింపబుద్ధి నిష్కారణముగా నేల పొడమవలయు? లోకములో నదృష్టములు, నిర్హేతుకములు నైన యాకస్మికములు లేకపోలేదుగాని, పదేపదే వలసిన చోట్లనెల్లఁ గాకతాళీయ న్యాయముల నాశ్రయించుట కల్పనకు మిక్కిలిఁ గొఱఁత. కామరూపములు, దివ్యదృష్టి, ఇత్యాదులు అన్నికష్టము లకు ననుకూలించు సాధనములు గానఁ బ్రశస్తములు గావు. సర్వ సందర్భములలోఁ జేరజాలినవి యీ కథలోఁ దప్పక చేర్పఁదగిన యంశములని చెప్పవీలులేదు గనుక, నిట్టివేసందర్భములను జేర్ప కుంట మేలు. కథకెల్ల సూత్రమువలె నుండు నీ హార మిన్ని వక్రముల కాస్పదమగుట చింతావహము!

షష్ఠాశ్వాస మధ్యభాగమునకుఁ దరువాతి భాగములు తుచ్ఛ ప్రబంధరీతిని వ్రాయఁబడిన భావవిహీన ఘట్టములు గావున వానిని ప్రత్యేకముగ విమర్శించుటొప్పు. తత్పూర్వభాగములలోఁ బ్రతిభ, భావము, కృతినిర్మాణ చాతుర్యము, నివన్నియుఁ బుష్కలముగ ప్రకాశించునట్లు రచించిన యీ మహాకవి నీరసవర్ణములకుం దిగు టకుఁ గారణములు, కాలదోషములును, అలంకార శాస్త్రములయెడ వినయవినమ్రుఁడై 'సకల లక్షణ సంపన్నము'గా వ్రాయఁ బూనిన

దౌర్భాగ్యపుఁ బ్రతిజ్ఞయును. మహాకావ్యమని శాస్త్రకారులచేఁ జేర్కొనఁ బడినదాని నుత్పాదింపఁబోయి కవిత్వమున కుత్పాత మాపాదించె ననుట స్పష్టము.

### ప్రథమ భాగములోని పొరబాటులు

ప్రథమ భాగమున* కాలదోషము లంతగా లేవు. అనఁగా ప్రబంధముల తీరు తక్కువ యనుట. మఱి సర్వలక్షణ సంపన్నతచేఁ గలిగిన దోషములు పెక్కులున్నవి. మణికంధరుఁడు తపస్సు చేయుటకు నుపోద్ఘాతమో యనునట్లు నిస్సంగత్వ దోషభాజనమైన యాత్రాభివర్ణన మొకటి చేయంబడి యున్నది. ఈ యాత్రలచేఁ గథకుఁ గలుగు ఫలములు రెండు. వైపుల్యము, వైరస్యము. ఆ! ఒక యూహమై దీనిని సార్థకమందమా! ఈ ఋషి తపోభంగము నకై రంభ రాఁబోవుచున్నదికదా! ఆపెకు నసహ్యము గలుగకుండు నట్లు కొన్ని స్నానములు చేయించి శుభ్రకాయునిఁగాఁ జేసి యుంత మని కవి తర్కించి యుండునా? తర్కించియుండెఁబో. కోరిక యీడేరు మార్గమిది గాదుగదా. ఎట్లన, వీరెన్ని మునుకలు వేసిన నేమి? తపస్సులోఁ గూర్చుండి యేకాగ్రముగ మైమఱచి కొన్ని వత్సరములు — వత్సరము లేల? — వాసరములున్నంజాలదా!— మలయమారుతమువలె ప్రజ్వరిల్లుటకు: అనాదరణ పాత్రమగు నీ ప్రసంగములకు నాహుతిగా నీఁబడినవి సుమారు నలువదియైదు పద్యములు!

కలభాషిణికిని నలకూబరునిపైఁగల మోహము కృతార్థమగు టకు నీ తీర్థయాత్రయొక్క యిక్కట్టు చూడుఁడు. నలుకూబరునిఁ జూచి వలచిన పిదప నారదుని శిష్యురాలై గానవిద్యాభ్యాసమునఁ గడపిన యేండ్లు నాలుగు. ఇట్లంత కాలయాపన మప్పుడే యయి యుండఁగాఁ ద్వరలోఁ దపోవర్ణనముం బ్రదర్శించి హృదయసాఫల్య మందఱకుఁ జేసియుంచిన బాగు. ఆ మధ్యమున యాత్రకై యొకటి రెండేండ్లు వినియోగించుట శృంగారభంగము. కలభాషిణికి వయసు ముదరక యుండునా? మఱియు, నా నాలుగేండ్లు నీప్సితిసిద్ధికొఱ కైన సన్నాహమునఁ గడపఁబడెఁగాన నాపె యోర్చియుండుట సహ జము. ఈ యాత్రలోఁ దగులఁబెట్టిన కాలము నామె యేరీతిఁ గడి పెను? నలకూబర స్మరణలోనా? విరహవిషయమైన సఖులతోడి

*నేను ప్రథమభాగ మనునది 6 వ యాశ్వాసములోని 189-వ పద్యమువఱకు నుండు భాగమనియు, ద్వితీయ భాగము దక్కినది యనియుం దెలియునది.

సల్లాపములలోనా ? కవి యీయము నొంటిగా విడిచి మఱచి యుండుట మహాపాపము. పొరపాటు ! యాత్రవలనఁ గలిగిన ఫల మిదియే !

ఈ ఘట్టమునకన్న సందర్భశుద్ధిలేనిది పంచమాశ్వాసములో 132 వ పద్యము మొదలు 174 వ పద్యము వరకునుగల పసి పాపచేఁ జేయఁబడిన యోగవిద్యా విషయకమైన దీర్ఘప్రసంగము. ఈ విమోచన మార్గప్రదర్శనము శుద్ధముగ ననవసరము. అసంగ తము. అసమ్మతమును !

దోషవిచారణ యటుండనిచ్చి యీ కావ్యము నుత్కృష్టతమం బని పరఁగంజేసిన గుణంబుల నభినందింతము.

## సద్గుణములు

నాటకరీతిని సంభాషణాదులచే వృత్తములం బ్రకటించుట యందు నీ గ్రంథము అసదృశము. సామాన్యకవులు రాజు నొక్కని బేర్కొని యతని దేహమనోలక్షణముల ముప్పదినలువది పద్దెము లచే పొడవుగను అసంగతమును గ్రంథాదినే వల్లింతురు ! అనఁగా తత్పూర్వకవులరీతినే మాఱుమాటలఁ జేయు స్తవమనుట. వంది మాగధస్తుతులచే నెవ్వని గొప్పతనమును సాక్షాత్కారముం జెంది నట్లు తోఁపదు. గుణములు చర్యలచేఁ బ్రకటితములగు, ఏ నడవడియులేని వాని మనఃప్రకృతి నెఱుంగఁ బోలునా ? కావున కథలో నాయకుండొనర్చు కృత్యములచే నతనిశీలము తెఱంగు మనకు బోధయగు నట్లొనర్పనగునుగాని, ప్రత్యేకముగ ధర్మముల జాబితానొకటి వ్రాసి యతని మెడఁ గట్టినఁ గవియొక్క బుద్ధిలేమి దక్క నింకెద్దియుఁ దెల్లంబుగాదు. అనేక కార్యములతో నిండి నట్లు కథం గల్పింప లేనివారికి జాపితాపద్ధతియే గతి, దుర్గతి. ఈ సార్వభౌముండు చైతన్యమును వహించిన సంగ్రహధర్మశాస్త్రము అనుటలో సత్యము సుఖమును రెండును సున్నలు. మఱియు, ప్రదర్శింపఁబడు కార్యజాలములతో సంబంధములేని గుణముల వర్ణించుట పనికిమాలిన పెత్తనము. సంబంధముగల గుణముల మాత్రము వర్ణించుట కర్తవ్యమేని, కార్యసంబంధములచే నవి యొకరు చెప్పక చూపకయ తమంతఁ దేటపడవా? యుద్ధమున నవక్ర విక్రమము చూపెడు నభిమన్యుఁ గూర్చి వేఱుగ నితఁడు ధైర్యశాలియని శ్లాఘింపకున్న మనమెఱుఁగ లేమా ? అట్టి శ్లాఘనలు గూడదని కాదు నా మతము. మఱి పాత్రముల మూలమునఁ జేయ

బడినఁ గథ నెల్లఁలువా అని యైక్యమును వహించి స్వారస్యముగ నుండు. కళాపూర్ణోదయములో రాజవర్ణనఁ జేయలేదు, ప్రభావతి లోను జేయలేదు. ఇందులకు గతంబేమి యొక్కో! బహుశః గ్రంథాదిని రెంటియందును రాఁదగిన మహాత్ముఁడు కృష్ణుఁడు. ఇతఁడు సుప్రసిద్ధుఁడు గావునఁ గవి యతనిగూర్చిన ప్రస్తావనము లనావశ్యకములని విరమించెనో! యోజింపుఁడు, తెలిసిచేసిన మనకేమి? తెలియకచేసిన మనకేమి? పాకము బాగున్న నామోదించుటయే సరి.

కథా ప్రారంభముననే యెంతవడిగా నెన్ని పాత్రముల బ్రవేశింపఁ జేసినాఁడో తలపోసి యానందాశ్చర్యముల భరింపుఁడు! ఉపద్యానవనములో కలభాషిణి చెలికత్తెలతోఁగూడి డోలావిహారంబు సల్పుచుండఁగా నారదునితో నాకాశమార్గంబునఁ బోవుచుండు మణికంధరుఁడు.

"మ. తమిఁ బూఁదీఁగల దూఁగు టుయ్యేలలఁ బంతాలాడుచుం దూఁగు నా
కొమరుంబ్రాయపు గబ్బి గుబ్బెతలయంఘ్రుల్ చక్కఁగాఁజాఁగి మిం
టి మొగంబై చనుదెంచు ఠీవి గనుఁగొంటే దివ్యమౌనీంద్ర నా
క మృగీనేత్రల మీఁదఁ గయ్యమునకుం గాల్చాచు లాగొప్పెడిన్."
(కళా. అ. 1, ప. 147)

అని ప్రశంసించిన ప్రకారము సరిగాదని నారదుండు

మ. భళిరా సత్కవి వౌదు నిక్కమతగన్ భావింప నీవన్న య
ట్లిల ప్రాయంపు మిటారికత్తెల బెడంగే నెందునుం గాన, వా
రలడోలాచలనోచ్చల చ్చరణముల్ త్రైవిష్టపస్త్రీల యౌ
దలఁదన్నం జనునట్లు మించెనవినన్ దప్పేమి యొప్పేయగున్
(కళా. అ. 1, ప. 148)

"క. అని పలుకునపుడు నికటం
బున నలకూబరుఁడు దాను మొగిలు మఱుఁగునన్
ఘనమగు దివ్య విమానం
బునఁ జనుచున్ రంభ విశదముగ నది వినియెన్."
(కళా. అ. 1, ప. 150)

అదినే యీరీతి నైదుగుర నెదుర నిల్పుటయగాదు. మాట మాటకును గథ పెరుగునట్లు చేయు మాహాత్మ్యమున సూరన నిస్తులుఁడు. ప్రథమాశ్వాసము ముగియుసరికి కథామధ్యమున మునిఁ

గిన వారమై, యెట్లు వచ్చితిమో, 'యాది యెయ్యది, అంత్య మే దిక్కున నుండు' నని విస్మయానందముల నోలలాడుచుం దుము. మణికంధరుని స్తుతి వ్యర్థచేష్ట గాదు. ఆకాశమునఁ జేయఁ బడి యుండినందున గలభాషిణి వినియుండదు. అటు వినమి యావశ్యకము లేనిచో నలకూబరునిపైని వలపుచేనైన దైన్యముతో నారదు నాశ్రయించి యుండదు. మఱియు నా పొగడిక రంభకు నసూయాకారణము. ఆ యసూయచేఁగదా యాపె నారదునితో మాటలాడుటకై వచ్చి నలకూబరుఁడు "నరభామల పోఁడుములకు భ్రమయకయున్నే" యని దరహాసముచేయుట! నారదుండును ప్రతిహాసముఁ జేయఁబూని,

> "క. నినుబోలు వనిత నీకును
> వనజముఖీ యితనిఁబోలువాఁ డితనికి నెం
> దును గల్గి కలచునో యి
> ట్టి నిగాఢపు మదము సొంపులీవులు చనునే."

(కళా. ఆ. 1, ప. 165)

అని పల్కు తరికి కథయొక్క యస్తిభారములో సగము సంపూర్ణ మయ్యెను. పిమ్మట లెక్కకు వచ్చునో రాదోయనునట్టి చిల్లర విషయముం బోని.

> "వ. అంత నమ్మహామునీంద్రుని యాజ్ఞానుసారంబుగాఁ దద్విమానంబు కలభాషిణి విహరించుచున్న యెలదోఁటలోనికిం దిగియె నట్టియెడ రంభా నలకూబరులును వినయపూర్వకంబుగ నతనిచేత ననిపించుకొని యప్పుడెదుటఁ గాన్పించు వాసుదేవ ప్రాసాదరాజంబునకుం జేయెత్తి మ్రొక్కి నిజేచ్ఛం జనిరి."

(కళా. ఆ. 1, ప. 167)

అను వాక్యముతోఁ గలభాషిణి నలకూబరుని వలచుటకును గళా పూర్ణుని సుద్ది వినుటకును సహజమైన సమయముఁ గల్పించి తక్కిన సగము ననాయాసముగ ముగించిన యీ కవియొక్క ప్రతిభ యవాచ్యము గదా! ప్రథమాశ్వాసము కథకు నాలవాలము. సమస్తములైన కార్యములయుఁ గారణ బీజంబులందుఁ జల్లబడి యున్నవి.

### ఐక్యమను లక్షణము

సామాన్యకవులతోఁ బోల్చిచూచిన సూరన్న కళాకౌశల

మింకను వైశద్యముతో వెలుఁగును. మన ప్రబంధములు తఱుచు కథానాయకుఁడగు రాజు అనునొక్క పాత్రముతోఁ బ్రారబ్ధములు. అయననుగూర్చిన యప్రస్తుతవర్ణనము ముగియుటకుఁ బట్టునది యొక గంట. పిమ్మట నర్మసచివుఁడో యెవఁడో యొకఁడు వచ్చుట, అటు తర్వాత వేఁట వెడలుదురేమొ. అక్కడనొక సఖీజన పరివేష్టితయగు కోమలాంగిని జూచి రాజును విదూషకుఁడును (నర్మసచివులు విదూషకులుగ నుండుటయు విదూషకులు నర్మసచివులుగ నుండుటయు హిందూ రాజధర్మమ గదా!) రెండుగంట లొకరితో నొకరు శ్లేషలు, అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలుఁ బేల్చునప్పటికిని నిది దయ్యాలతో నిండిన కావ్యమని దూరముగఁ బాఱవైతుము! కళాపూర్ణోదయముతో నుపమింపఁదగినది, మూలము స్కంధము సామాన్యముల యయ్యు, వివిధగతుల దెసలవ్యాపింప శాఖోపశాఖలు గలిగి కనుపండువుగ నుండు మహావృక్షము. సామాన్య ప్రబంధములు, కొలుకులు ఒకదానివెంట నింకొకటి యతికించుటచే నేర్పడిన గొలుసులవంటివి. ఐక్యము వీనిలో లేదు. ఎన్ని కొలుకులైనఁ జేర్పవచ్చును. ఎన్నియైనఁ దీసివేయవచ్చును. వైపుల్యము దక్క నింకెద్దానికిని లాభనష్టము లుండవు. ఆకృతి మాఱదు. వృక్షములు మొదలగు సజీవములవలె నుండు కావ్యముల నేయంగమునైన ఛేదించుటకుఁగాదు. నూతనాంగములఁ జేర్చుటకుఁగాదు. ఎట్లు చేసినను పరిమాణభేదమే గాదు. ఆకారమును వికృతమగును. ఐక్యమను కథాలక్షణమును బరీక్షించు పద్ధతి యేదనఁగా, ఉన్న భాగములఁ దీసివేయవచ్చునా క్రొత్తవి యేవైనఁ జేరవచ్చునా యని విమర్శించుట. ఈ కార్యములు పొసఁగనివైన నైక్యము స్ఫుటము, సాధ్యములైన నైక్యభావ మపక్వము.

'మానవప్రకృతిని అద్దమువలెఁ జూపు శక్తిగలవాఁడు సంభాషణలఁ దీర్చుటలోఁ దిక్కన్నకు సరివచ్చువాడును' అని సూరనార్యుని ప్రశంసించినందుకుఁ దార్కాణమైన ముఖ్యభాగములలోఁ గొన్ని యేవనఁగా యిరువురు రంభలు నలకూబరులును బ్రవేశించి చిత్రవిచిత్రగతులఁ బొరఁబాటుతో సంచరించియు నేయనుచితములకు ననీప్సితములకును బాల్పడక కృతార్థులగు తృతీయ చతుర్థాశ్వాసములోని ఘట్టములు.

సూరన్నయు షేక్స్పియరును ఒకరి పేరొక రెఱుంగనైనఁ జాలనియంత దవ్వులనున్న సమకాలీనులు. జాతిమతవేషభాషాదుల

వ్యత్యస్తులు. అట్లుండియు నీ వింత నేమి చెప్ప? షేక్స్పియరు వ్రాసిన కామెడీ ఆఫ్ ఎరర్స్ అనఁగా తబ్బిబ్బుల ప్రహసనము అను నాటకమునకును, రంభా నలకూబర ద్వయ విలాసమునకును పెక్కు పోలిక లున్నవి! రెంటియందును భేదములేని రూపముగల నాయకు లిరువురు నాయిక లిరువురు అయ్యెపాత్రముల నిరూపించుటకు నసాధ్యమైన భ్రమ తటస్థించి, నాయికానాయకులు తమ వలచినవారని యొండొరులతోఁ జేరియుండువేళ "అయ్యో పాపము. అన్యునిచే నీకన్య చెఱుపఁబడియెనా" యను సంశయము మనకుఁ దోఁచి మనసు కలఁతపొందించును. కాన, కథ యామూలాగ్రముగ విశదీకరింపఁబడు సరికి తమ తమ యభిమతముల కనుకూలములైన విధంబుల దాంపత్యము లేర్పడినవని చూపి. మనకు దిగ్భ్రమము వాయుటతోడన పట్టరాని నవ్వును సంతోషమును గవి గలిగించును! ఇట్టి కథాసందర్భ మెంతో యపురూపము. అట్టిదానిని హిందూదేశములో సూరన్నయు నాంగ్లద్వీపమ్మున షేక్స్పియరును నెట్టి సంబంధములును లేనివారయ్యు నేకకాలమునఁ దలపోయుటఁ దలంచితిమేని, యిది కాలయోగ ప్రభావమా? ఆకస్మిక విచిత్రమా? యని విస్మయభరితాంతః కరణుల మగుదుము.

## రంభానలకూబరాపహాస ఘట్టము

మృగేంద్రవాహనా తిరస్కారంబున దూరముగఁ గొట్టుకొనిపోఁబడి యొక పూఁబొదరింటఁ గలభాషిణితోఁబడిన మణిస్తంభుఁడు ఆమెను బలాత్కరింపఁబూనఁగా నవ్వారవర్ణిని "ఈ పాతకి బల్మిఁ బట్టెడుఁ గృపన్ వీక్షింపరే కావరే!" యని మొఱయిడఁగా "వెఱవక యెవ్వడురా వెతఁబఱపెడు నిట్లతివ?" నని, నలకూబరుఁడు, పూఁబొదరింట రంభతో వినోదము లాడుచుండినవాఁడు (ఇతఁడు నలకూబరాకారుఁడగు మణికంధరుఁడు) సరసము చాలించి, తన సింహనాదము విని పాఱిపోయెడు సిద్ధిని వెంబడించి పట్టుకొని తిరిగివచ్చులోపల, కుబేరనందనుని నైదాఱు సంవత్సరములనుండి ధ్యానించుచు సమాగమసమయంబు నిరీక్షించుచున్న కలభాషిణి, మునుపు నారదుఁడిచ్చిన వరప్రభావంబునం జేసి రంభాకారముం దాల్చినదై, యా నలకూబరుని త్రోవఁబట్టి యతనిం గాంచి ప్రేమయుఁ బక్షపాతంబుఁదోఁపబల్కు భార్యచందంబున

శా. ..................అక్కటకటా! యేమంచునిన్ దూరుదున్
గేలఁగా గైదువు గీదు వేమియునులేకే యిమ్మెయిన్ వత్తురే?
చాలన్ దూరము గాఁగ నేనిదె పరిశ్రాంతిం గడున్ నొచ్చితిన్
జాలుంజాలుఁ గరంబు మెచ్చఁదగు నీచందంబు ప్రాణేశ్వరా!

(కళా. అ. 3, ప. 157)

యని ప్రీతియు నిష్ఠురతయు మెఱయఁబల్కి సమాధానముఁ జెప్పి, నిజవాంఛాసాఫల్యమునకు విఘ్నముగానున్న సిద్ధునిఁ దొలగించుటకై నాథునింగూర్చి చెప్పుచున్నది.

"క. వీఁడా యట్లన్యాయపుఁ
బోఁడుములకు బూనినట్టి పుణ్యుఁడు, పూవి
ల్కాఁడో వల్లభ యెంతటి
వాఁడైన నగున్ విశంకవర్తనుఁ డెందున్"

(కళా. అ. 3, ప. 159)

నలకూబరాకారుఁడును సమ్మతించి వానిని వదలిపెట్టి "నీవు నిర్బంధింపఁ జూచిన స్త్రీ యెక్కడ? చూపుము" అని ధట్టించి యడుగుడును, తానే యా స్త్రీ యగుటంజేసి కలభాషిణిలోని నవ్వు వెలికిరానీక కష్టపఱుపఁబడిన యుత్తమనారీమణులయెడలఁ బురుషులకన్న దట్టముగ స్త్రీలకు నుండు సహజమగు కరుణయుఁ బశ్చాత్తాపమును బోఁద్రోయని విధంబున

"సీ. ..........................
వీనితో నిదియేమి విడిచిపెట్టుము వీఁడు
తను నట్లు డించివెళ్ళిన నెడఁగని
యా యింతిడాఁగి యెం దరిగెనో
యెచటఁ జూపెదు?"

(కళా. అ. 3, ప. 166)

అని యా సిద్ధునిఁ బంపించివేసినదై, యిఁక నిజమైన రంభ వచ్చి యెక్కడ కార్యభంగ మొనర్చునోయని శంకించి యతఁడు బయలు వెడలి వచ్చినచోటికిం దూరముగఁ దీసికొనిపోనుంకించినదై, యే శంకకు నవకాశమియ్యని యుక్తిగా.

"......................దాన్ని
మనమిఁక వెదకుదమని తాను నతఁడు"

(కళా. అ. 3, ప. 166)

సిద్ధుఁడు దొల్తఁ బరుగెత్తిన తెరువునఁ గడుదవ్వుగాఁ జనియె! పాపము! ఎన్నియో నాళ్ళుగా వేచివేసరిన లలనారత్న మీకలభాషిణి! సర్వము పక్వదశకువచ్చు సమయమున నెన్నో విఘాతములఁ బడవలసిన సంతప్తురాలు! వరసంగమముచే నిట్టి స్త్రీలకుఁ గల్గు సుఖమును నాత్మతృప్తియును బ్రభావతుల కుండవు ఉండఁదగవు! ఇట్లు కష్టములనెల్లఁ దరించి యభిమతకేళిందేలి నాయక సంయోగ మహదానందయై.

"శా. ....................
లోలత్వంబున నుండ నచ్చటికి నాలోలత్వదశ్రేణిచా
స్పాలోకించుచు రంభ వేతొకతె డాయన్ వచ్చెఁ జిత్రంబుగన్!"

(కళా. ఆ. 3, ప. 170)

ఈపెయ యప్సరస యయిన రంభ. నలకూబర "విడు విడురా" యన్నమాటకు మనసు చివుక్కురుమనఁగా మణికంధరుఁడు తన్నుఁ బట్టిన శనివలె వెడలిపోవఁగా హృదయకాంతుఁ డగు నలకూబరునిం గదిసి యుందమని పయనమౌతటికి నా మణికంధరుఁడు తనివిఁదీఱని వాఁడగుటంజేసి తన తపశ్శక్తి వినియోగించి నలకూబరాకారుఁడై తనుఁగలిసికొనఁగా కుబేరనందనుండే యనుభ్రమచే త్రికరణ సుఖముల ననుభవించుచు నీవఱకునుండినయది. అట్లా నలకూబరాకారుఁడు ఆర్తస్త్రీ విలాపంబువిని దక్షిణకై వెళ్ళి కొంచమునరాక చాలకాలము మసలఁగా, తమిబట్ట లేక తామసము నోర్వక యతని రోయుచువచ్చి యతనిఁ గన్నులారఁ జూచుటయేగాదు, అతని యొద్దనున్న తన ప్రతిబింబమనఁదగు నింకొక రంభను గన్నులుబుకునట్లు పొడగనుచుండగా నలకూబరుండును దిక్కుదెలియనివాఁడై

"తే. నీదు ప్రతిబింబమదియొ దాని ప్రతిబింబ
మీవొ యేమని చెప్పుదు నిగురుఁబోఁడి!
యేర్పఱుపరాకయున్న వారీవు నదియు
దీనికరుదంది చూచెదఁ దిరిగి తిరిగి.

క. తుదనేమి చెప్పనాదం
డఁదొలంగిన దాని నిను దడంబడకుండన్
మదిలోన నేర్పఱించుట
సుదుర్లభము..............."

(కళా. ఆ. 3, ప. 176)

అని పల్కుచు విభ్రాంతుఁడయ్యెను. అయ్యో! కలభాషిణికి వచ్చిన కష్టము! లేకలేక క్లేశపడి సంపాదించిన యర్థము క్షణ భంగురమయ్యెడు తెఱంగైన నా దైన్యము చెప్పఁదీఱునా? అపుడా లతాంగి యేమన్నది?

"సీ. అట్టెనఁ బ్రాణనాయక నినుఁ గౌఁగిటఁ
బాయనే వెఱతు నీ మాయలాడి
యీ రూపుతో మనకెడసేయ నేతెంచి
నదియు తొల్లియు నొక్క యసుర జంత
జనకనందనకు రామునకును నెడ సేయఁ
గడఁగి వచ్చుట వినఁబడుచునుండుఁ
గావున దీని నిక్కడఁ జుట్టుఁబట్టున
నుండఁగ నిచ్చిన నొప్పకుండు
వట్టిమొగమాట లాలించి గట్టి గాఁగ
నదరవైచుచుఁ జనుమంచు నౌరనీవు
గదలెదు సుమంచు సంభ్రమమ్మొదవ నపుడు
కాంతు కంఠంబు నొకకేలఁ గౌగిలించె"

(కళా. ఆ. 3, ప. 177)

ఇఁకపై నీయిద్దఱు సవతుల కొట్లాట వర్ణింపఁబడియుండు తెఱంగు వర్ణింప నాతరముగాదు? ఇది యద్భుతావహము. స్త్రీ ప్రకృతికి దర్పణము. రసవత్తరము! ఎన్నిసామెతలు, నీతులు, తిట్లు, తలత్రిప్పులు! తుట్టతుదకు కన్నీళ్ళును! సత్యరంభ వచనములు కొన్ని చూడుఁడు!

"క. వినుమా యేర్పాటు దనం
తన యగుచున్న యది యెట్లుఁదప్పదు సత్యం
బనఁగా దైవంబనఁగా
జనులకు లేకున్న నెట్లు జగములు నడచున్"

(కళా. ఆ. 3, ప. 182)

"సీ. అల్లప్పుడొకచోటఁ జల్లని సురపొన్న
నీడ మెచ్చుచును నాతోడఁగూడి
యందుఁ బల్లవశయ్యఁ గందర్ప కేళినిం
పొందుచోఁ బటమటి యందు నొక్క

వనిత యాక్రందనధ్వని వినఁబడుటయు
నీవు దిగ్గున లేచి పోవుచుండ
నేను నీతోడన యేతెంచుచో నొక
యిట్టి డాపలివంక కేగుటయును
జూచి నిలిచితి నేను నిల్చుటఁ గనుఁగొని
యెచట నెట్లిది హత్తెనో యెఱుక పడద
వేగిరింపక నీవ భావించుకొనుము
కల్ల నిజములు క్రమముగాఁ గానవచ్చు"

(కళా. అ. 3, ప. 184)

దీనికి మాయారంభ యిచ్చెడు ప్రత్యుత్తరము :

చ. ..............................
మన చరితంబుఁ జెప్పెను సమస్తము వెల్పులసాని చెప్పిన
ట్ల నిజము గాఁగ నివ్వరవిలాసిని యెచ్చటనుండి చూచెనో!

(కళా. అ. 3, ప. 185)

తే. అచట నపుడట నినుఁగూడి యలరినదియు
నట్ల నీవేగుచో వచ్చినదియుఁ దాన
యగుచుఁ దోఁప నందదికి యెట్లాడనేర్చె
మగువగాదుర యిది! పెనుదగర గాని! 186

"క. వినువల్లభ? కన్నుండం
గనుపాపం దివియు నేర్పుగల మున్నిముచ్చి
వనిత తగ దిచట నుండన్
వెనుకను దిద్దుకొనవచ్చునే యొకటైనన్" 188

అని నలకూబరునిఁ బిలిచికొనివెడలఁ గలభాషిణి యుపాయంబుఁ బన్నఁగా; నిఁకనూరకున్న వరుడు దక్కఁడని సైరణ దొలంగఁ బెట్టి, నలకూబరుఁడు చాటుగా నింతవఱకుఁ జేసిన సంవాద మప్ర యోజకమని నేఱుగా సవతి నాక్షేపించుచు

"క. త్రుళ్ళఁగ నేటికి నిలునిలు
మిల్లలికినఁ బందు వగునె యింతటిలోనే
వల్లభునకుఁ గడు నచ్చిన
యిల్లాలవెయేను లాతినే పోఁదోలన్"

"క. మగఁడా పట్టెంబునఁ దలఁ
దెగఁ గొట్టినఁ గొట్టుఁగాక, తెగతెఱఁగ నీ
కెగవిడిచి పోయెదనె ప్రా
వగ నాకాణాచియైన వలపులపంటన్!"

క. ఈ రీతిని మద్వల్లభుఁ
గోరిక మెడఁ గౌగలించుకొని నీవుండన్
సైరించుట కొఱగాదిది
రారమ్మిఁక నోర్వఁజుమ్ము రావె యనుచున్.

క. వెడదెరువు లిచటఁ జెల్లవు
పుడమి నహహ దొంగలానఁ బొడిచినఁ గోకల్
విడుతురె గడియింతునె యె
క్కడి గతిమాలిన పిశాచికవొ నీ మాటల్!

వ. అన్నటయు నా యింతి సైరింపక

మానిని. అంత మదింపకువే యని పల్కిన నంత మదింపకువే యనుచున్
గంతులడంచెద లెమ్మనిపల్కిన గంతులడంచెద లెమ్మనుచున్
రంతుల నేమి ఫలంబని పల్కిన రంతుల నేమి ఫలంబనుచున్
బంతముచూడఁగదేయని పల్కినఁ బంతముచూడఁగదేయనుచున్

సీ. ఒట్టునుమీ యన్న నొట్టునుమీ యంచు
నేమేమి యనిన నేమేమి యనుచుఁ
గానీగదే యన్నఁ గానీగదే యంచు
నింకేల యనిన నింకేల యనుచు
నోసిపోవే యన్న నోసిపోవే యంచు
నౌనంటి వనిన నౌనంటి వనుచు
మఱవకుమిదియన్న మఱవకుమిది యంచు
నీవెంత యనిన నీవెంత యనుచు
నొకతె మగనికి నాశించుటొప్పదనిన
నొకతె మగనికి నాశించుటొప్పదనుచుఁ
బట్టియాడె నా రంభతోఁ బ్రథమ రంభ
ప్రియుఁడు విలువన్న నిలువక పెద్దరొదగ.

(కళా. అ. 3, 191–192–193–194–195–196)

రూపమునఁ బ్రతిబింబములు, మాటల బ్రతిధ్వనులు!

మాటలేగాని దెబ్బలసరసము పొంతకైనఁబోరు! కరములు అభినయములకేగాని కొట్లాటకుఁగావని స్త్రీల నైజమతముగాదా! ఇవ్వడువున వాగ్యుద్ధము రేఁగుచుండఁగా నారదులు విచ్చేసి నలకూబరునితో హాస్యములాడిరి! పిమ్మట నతఁడు తనకై పోరుచున్న రంభల నిరువురిం జూపి వీరిలో! తథ్యమిథ్యాభావము తేర్పఱుపుఁడని వేఁడఁగా నా కలహభోజనులు

క. ............తథ్యమిథ్యా
భావంబులకేమి నీకు భావింపఁగ స్వా
భావికమే యీ యాకృతి
భావము నిజమెద్ది యీ ప్రపంచమునందున్'

క. నీపట్టురువడ నొక్కతెఁ
జూపియొకతె గర్వమడఁపుచున్ వలయుగతిన్
ప్రాపింపవచ్చు భోగము
నీ పుణ్యంబినుమడించి నేఁడు ఫలించెన్!

(కళా. అ, 3. ప. 210-211)

అని యానతిచ్చి తమదారిఁ దామేగిరి. రంభలు మరల నెప్పటి యట్ల వాగ్యుద్ధమునకుం దొరఁకొనిరి. అం దొక్కతె

" క. అఱపు లుడిగి పోపో నీ
యఱచేతంబట్లు వచ్చినప్పుడు మమ్మున్
గఱచెదవుగాని తగునెడ
మొఱయిడు మది యెట్టి దైవములు వినియెడినో!"

(కళా. అ. 3, ప. 218)

అనుటయు సత్యరంభ

"క. కానిమ్ము వేగిరింపకు
నీ నుదుటనె ప్రొద్దు పొడిచెనో యే దైవం
బైనను వినవిప్పుడె యిదె
నా నిజమేర్పరచి నీకొనర్చెద శిక్షల్."

కళా. అ. 3, ప. 220)

అని బదులిచ్చి యొక్క మంచి యుపాయంబుఁ జింతించి నలకూబరాకారునితోఁ గలసి విఱ్ఱవీగుచుండెడు రంభను 'రా' దేవ సభకుఁ బోవుదము. అని యాపెకు ఖేచరత్వంబె లేమి నాతనికిం

బోధించుటకై పిలుచుడు, దైవమా! ఇఁక కలభాషిణి గతియెట్లు? కోరినవారి రూపములఁదాల్చు వరము నారదులచేఁ బడసెనేగాని, కామగమనము బడయదాయెఁ, గావున రంభ చేతిలోఁ జక్కఁగఁ జిక్కినదై, చిన్నతనము రాకుండునట్లు బింకములైనఁ బలికి త్రోవఁ జూచికొందమను స్త్రీ సహజమైన గరువతనంబు మెఱయ నేమను చున్నది చూడుఁడు!

"సీ. అప్సరః స్త్రీలలో నగ్రగణ్యత్వంబు
జగదుపశ్లోకితంబుగ వహించి
యూర్వశీ మేనకాద్యుత్తమ స్త్రీలు రా
వమ్మ పోవమ్మ నా నతిశయిల్లి
యెన్నండు నెచ్చోట నెవ్వారిచేవ్రేలఁ
జూపించుకొనక ప్రస్తుతికినెక్కి
నలకూబరుండు ధన్యతముండునా గరు
వతనంబుచే నీకు వన్నెఁదెచ్చి
యొప్పునే యింకఁ గడపటి నిప్పుశాచి
నాకు సరిచేసికొని దేవలోక సభకు
నీవు నూ నీవు నుమ్మని యేవిధమునఁ
గలహమాడెద నిది నీవె తలఁచిచూడు."

(కళా. అ. 3, ప. 228)

క. కోపము పాపమునకుఁ బొ
త్తీపెనుఁదగవునకుఁ దగఁగనే తిట్లాటల్
ప్రాపించునో పడంతుల
కోపురుషశ్రేష్ఠ యువియు నొక్క బ్రతుకులే! 229

వ. అదియునుంగాక.

క. రంభకు నహహా యొకప్రతి
రంభ గలిగి తిగిచి తెచ్చె రచ్చల కనినన్
స్తంభింపనీరు హాస్యా
రంభణ మీపోరు నిర్జరవిటుల్ నగుచున్. 230

క. నానడకలకును యోగ్యము
గానిది యివు డిచటనైనఁ గలహమ, బ్రదుకె
ట్లైన నగుఁగాని యిఁక నీ
యాన ధరణి విడిచి దివికి నడు గటు వెట్టన్! 231

క. ఈ కలహ మపుడు వినఁబడు
నాకంబున సురల యాననము లేగతి నా
లోకింతుఁ దెగినఁ దెగనీ
నాకు మరుఁడు నిన్ను నిలుమనన్ రాతునికిన్! 232

ఇప్పుడేకాదు. ఇఁకముందును నాకలోకమునకు నడుగువెట్ట దఁట! మనుష్యాంగన పోఁజాలదు. ఈ లోపముఁ గప్పిపుచ్చుటకై యేమి యుక్తి! 'మఱియు తెగినఁ దెగనీ నా కుమరుఁడు' అనునది 'కార్యము మించిపోయినది యోటమి తప్పదు' అని యెఱింగియు, తానే ముందుగా నతని వదలినట్లు నటించియైన మానము రక్షించు కొందును అని యెంచి చేసిన యింకొక యుక్తి యిది! సరి. నల కూబరుఁడు సంశయాత్ముఁడై యాపెను మెడపట్టి పాయంద్రోసెను. నిర్నిద్రమోహఫలమా యిది సత్యరంభయు నాయమను కత్తిచేతఁ గాయము వాయుము, అని శపించెను! ఉదారచిత్తులకు కష్టములే గదా ప్రాప్తి! కలభాషిణి యేకచిత్తయై యిన్నేండ్లు తపించినందు లకు ఫలము లిట్టివి! అయినను పరునిచే నాక్షణకాల మాదరింప బడుటయే ఈ కడగండ్లకెల్ల మించి మీఱిన ప్రతిఫలముగా నా మహ నీయురాలికిఁ దోఁపక యుండదని నమ్మెదను! గొప్పవారికి వ్రతమే సుఖము. తుచ్ఛులకు సుఖమే వ్రతము! ప్రబంధములోని నాయ కల కెల్ల నీ కలభాషిణి శిరోమణివంటిదగుటను. కవియొక్క చమ త్కృతిని విడఁదీసి చూపుటకునై యీ ఘట్టము నింత విస్తరించి ప్రదర్శించినాఁడను. పాపము. ఇట్లు ఖిన్నమానసయైన యవ్వార వధూతిలకంబు కలభాషిణి యేగుటయు, నాయమఁదలఁచుకొన్న మన కెల్లరకు దుఃఖము రాకపోదు. ఇఁక రంభం దలఁచికొన్న నవ్వు తప్పదు! ఏలన ఇంత గాఢముగ నా దైవతకాంత కొట్లాడిన దెందుకు? నలకూబర ప్రాప్తికై దొరికిన దెవ్వరు? ఆ మోటుదపసి మణికంధరుఁడు! వానియొక్క నిజముఁ దెలిసి యుండినయెడ రంభ ఛీ యని కన్నెత్తియైనఁ జూడక యరిగియుండదా? ఏమో యింద్రు డాజ్ఞాపించెనని వానిం గలిసినదిగాని మోహముచేఁగాదు. మనసులేని పరిణయములోఁబడి స్రుక్కుచుండవలెనని స్వతంత్ర లైన పుణ్యాంగనల కేమి విధి!

'సరేకాని, కలభాషిణికి మాత్ర మిట్టి యనిష్టము ప్రాప్తింప లేదా! ఆపె గోరినదియు నలకూబరునే, తుదకు ననుభవించినది మణికంధరుని. అట్లగుట రంభకన్న నామె యెట్లు పరిహాసమునకుఁ

దక్కవపాత్రము? అని యడుగుదురేమో! ఈ వివరమిఁక ముం దేర్పడును. మణికంధరునితోడి కూటమియు నాపెయొక్క వాంఛి తంబ కాన దానిచే విమనస్కత యాపెకుఁ బాటిలలేదు.

ఇట్లు రంభ నలకూబరునిం గూడి తనకు విజయము సిద్ధించి నను, అతనికై తాఁబద్ధ పాట్లు దలఁచి, ఇదివఱకు వైరముచేఁ దన యందు నుదయించిన స్థైర్యము, కాఠిన్యము నా వైరితోడ యంత ర్థాన మొందఁగా, స్త్రీజన సహజమగు మెత్తఁదనము తన్నాక్రమింప, మనసు నొప్పిచేఁ గోపంబు వగపుగా

సీ. ...........................................
ప్రియుఁ జూచిఁ జూచి 'మగవారి ప్రేమ లిట్టివిగదా
యెట్లు నమ్మఁగవచ్చు నిచ్చలోనఁ
బ్రాణేశ యటు దండవాసినమాత్ర నీ
ద్రిమ్మరి నెచ్చోటఁ దెచ్చికొంటి
నిన్ను నేమన నున్నది నిరభిమాన
గుణత నినుఁ జేరు నన్నుఁగొనుట గాక
నాకునా యిన్ని పాట్లంచు' నా కులమతి
నడలెఁ గన్నుల బొట బొట నశ్రులొలుక.

(కళా. ఆ. 3, ప. 241)

ఆహా! యీ సంగతి యెంత స్వభావికముగ నున్నది? సవతి యుండువఱకుఁ గన్నుల నిప్పులు. అపె పోయినవెంట గన్నుల నీళ్ళు! ఒక నిమిష మెండ. మఱునిమిషము వాన! ఈ లీలా లాలిత్యము ప్రేమభరాలసలగు స్త్రీలకేకదా! కొందఱు దీనిని చపలత యందురు. ఈ చపలత లేకున్న వారికట్టి యాకర్షణ శక్తియు మనసుల రంజింపఁజేయు పటిమయు నుండునా? నిశ్చల తత్త్వము లెవరికిఁ గావలయును? జడులైనవారికిఁ దప్ప. స్త్రీల యందు కోపము మిక్కుటమైన దాని ప్రతికార్యమగు నేడ్పును తప్పదు.

వియోగాంతముం గాంచిన యీ వధూవరు లిట్లు ఒండొరుల నూరార్చుచు నుపశమన క్రియల కుత్సహించుచుండఁగా.

"మ. ......................వేటొక్కడం
తనవచ్చెన్ నలకూబరుం డచటికిన్ 'నా రూపముందాల్చి వం
చన నెవ్వాఁడుర చేరినాఁడఁట దురాశన్ రంభ' నంచున్ వెవన్?"

(కళా. ఆ. 3, ప. 243)

వీడేఁ నిక్కంపు నలకూబరుఁడు. పురుషులలో నీసును రోషమును హెచ్చిన నవి మాటలఁ దీఱవు మఱి పోటులఁ దీఱుఁగాని, వచ్చిన రెండు నిమిషములకే వాదములు. సత్యములు, సామెతలు వీని పొంతఁబోక ప్రధానకార్యమున కాయత్తుఁడై రెండవ నలకూబరుఁడు

"మ. మది నా మాటలు నమ్మవేనియు నిఁకన్ మమ్మిద్దఱన్ ధైర్య సం
పదఁ బెంపారఁగ దవ్వుల న్నిలిచి యోపద్మాక్షి! వీక్షింపు మే
నిదె ఖండించెద వీని మామకమహాహేతిప్రకాండంబుచేఁ
దుదశోధించెదు గాని నీకుఁగల యుక్తుల్మీఱ నాసత్యమున్."

(కళా. అ. 3, ప. 249)

అన్నాడు. న్యాయనిరూపణమునకుఁ గత్తులవంటి ధర్మరాజు లెవ్వరు లేరనిగదా మగతనముగల వారి సహజమతము! యుద్ధము మాట లేచుసరికే, రంభ తన కృత్రిమనాథుని గట్టిగా బట్టుకొని, యే జగడము ప్రారంభము గాకమున్నే,

"చ. ...............భూరికృపన్ నను గావరే ప్రియున్
మనుపరె వేల్పులారా! యొక మాయపురక్కసుఁ డాక్రమించి తాఁ
దునుముచు నున్నవాఁడలుకతోడ నిరాయుధు" నంచు........

(కళా. అ. 3, ప. 250)

నేడ్చుటకు మొదలిడినది. ఈ యేడ్పునకుఁ గారణము భీతి. దీనికి ముందేడ్చినది కొట్లాట, కోపము, వీనిచేనైన యలసట, కోలుపోయిన యభిమానము, అలుక ఇత్యాదులచేనైన వ్యసనభావముచే.

నారదుఁడు రంభల నపహసించి పోవువాఁడు ఊరకపోలేదు. నలకూబరుని కడకుఁబోయి యతనితో 'నీ యాకారముఁదాల్చి యింకెవ్వడో రంభను గూడియున్నాఁడు. త్వరలో వెళ్ళి సొత్తు దక్కించుకొనుము' అని యుపదేశింపఁగా నాపల్కుమై సత్య నలుకూబరుఁడు వచ్చి యా మిథునముయొక్క సల్లాపములకు విఘాత మొనరించెను. పిమ్మట నయ్యిరువురు బాహుయుద్ధమునకుం గడఁగి పోరుచుండఁగా రంభ

"ఉ. ..............................నిలుండు నం
రంభము మాని యేనడుగు ప్రాక్తనవర్తన మొక్కటిన్ రహ
స్సంభవమైనదాని వరుసన్ వచియింపుడు మీఱ లిత్తన్"

(కళా. అ. 3, ప. 269)

అని వారి నిల్పి 'కళాపూర్ణుఁడను వాని విషయమై మన కేమి ప్రసంగంబెచ్చటఁగలిగె' నని యడుగఁగా ప్రథముడు నిరుత్తరుఁ డయ్యె. ద్వితీయుఁడు సరిగా నుత్తరంబిచ్చె. అతను రంభ జుగుప్సతో 'నీ రోతవానిచెంత నిన్నాళ్ళెట్లుంటినో దైవమా!' యని వాని న్విడనాడి కుబేరుతనయుం బరిగ్రహించె. అతండు మోసగాడైన మణికంధరుని నల్పావశిష్టాయువుఁగా శపించె.

స్త్రీపురుషుల భిన్నప్రకృతు లీవర్ణనములచెంత విశదముగఁ జూపఁబడినవి! తా మవలబించు పద్ధతుల భేదమున్నను గామ మను పురుషార్థమందు స్త్రీ పురుషు లిరువురు సమానలాలసులు గదా! మఱియు రాగవిషయమైన యీర్ష్యయందును తుల్యస్వభావులు. స్త్రీ పురుషుల యీ సహజమగు నేకీభావమును గవి మఱవ లేదు. చూడుఁడు

కలభాషిణి మాయదారియని యేర్పడిన పిదప నలకూబరాకారుఁడు ఆపెంజూచి 'నీపేరెయ్యది యెట్టిదాన?' వని యడిగె. అప్పుడు తత్ ప్రతిరంభ సైరింపక :

"శా. ఇందాఁకన్ నినుఁ జేరనీక ననునల్లింతే మనోజవ్యథన్
గుందంజేయుట చాలకేమడిగెదీ గొంటన్ వృథాయంచు, నా
కందర్పత్వరఁ గానలేవనుచు నాకంజాక్షిఁ బోఁద్రొబ్బెఁదా
నెందున్ నిల్వఁగనీక పేరలుకతో నెంతేఁగడున్ దవ్వుగన్."
(కళా. ఆ. 3, ప. 235)

వైరితో మాటాడుచున్నాఁడే యను నీసును దొట్రుపాటును దోపఁగా రంభ త్వరపెట్టుచున్నది. ఆ ఘట్టముతో సమవర్తనము సమన్వయముం గాంచులీల నిప్పుడు, అడుగునది స్త్రీ. ఈర్ష్యయు నాత్రముఁ జూపువాఁడు పురుషుఁడు.

వ. రంభ యక్కపటవర్తనుంజూచి నీవెవండ వెవ్విధంబున నిట్టి రూపంబు ధరియించి నన్ను వంచించితని యడుగుటయు నత్య నలకూబరుండు.

సీ. ఇందాఁక నినుఁ జేరనీక నన్నిట్లల*
యించుట చాలక యింకనిలిపి
వాని నేమడిగె దెవ్వడు గాక నీకేమి
యిది కాకదంత పరీక్షనుమ్ము

*ఇరువురి వాక్యములయు భావములయు సాదృశ్యము గమనింపుఁడు. ఆపె మాటల నాపె మీఁదనే ప్రయోగించుచున్నాఁడు.

నామన్మథార్తి యెన్నఁగవలదే చాలు
రారమ్మటంచు నారంభ నపుడ
తోడ్కొని చనియెడు వేడ్కతో మోముఁ దా
మర వికసింపఁగా సురపథమునకు........
(కళా. ఆ. 3, ప. 271, ప. 272)

దొంగ, వైరియని దెలిసియు సొంతముగా వాని చరిత్రము సావకాశముగా వినుటకు రంభగోరినఁ జూచి నలకూబరుని మనసు మొగము లెంత కమలినవో!

నే నిక్కడ సమస్య విడదీసినట్లు వ్రాసియున్నాను. కావ్యములో నెవ్వరెవ్వరైనదియు చతుర్థాశ్వాసములోని కొన్ని భాగములం జదివినఁగాని గోచరింపదుగాన, తుదముట్టువఱకు సంశయములు దీఱవు. అద్భుతరస మన్నినో యడుగడుగునకు, గొంత పెరుగు చుండును. ప్రథమ రంభ యెవరు? తత్ ప్రతి రంభ యెవరు? నలకూబరులెవ్వరు? పాపము, కలభాషిణిని అనిష్టుఁ డెవఁడైనఁ గలఁచెనా? నిర్వికల్పచిత్త సిద్ధివికల్పముం గాంచెనా? ఇట్లని యనేక విధంబులఁ బలవరింపుచుఁ గలవరింపుచు భయభ్రాంతులతోఁ జదువుదుము. వీరల స్థితిగతులరయువఱకు నన్యచింత యను పేరైననుండదు. చదువరులకిట్లు విస్మయము, సంభ్రమము సావధానత గలిగించు కృతు లాంధ్రంబున నింకెవ్వియును లేవు.

## శృంగార విశేషములు

భావనాశక్తిలేని కవులనేకులు శృంగార వర్ణనలు చేసియున్నారుగాని యవి రెండు విధముల దుష్టములు. ఒకటి, వారి శృంగారమనునది తుచ్ఛసుఖవిషయాసక్తియైన శరీర తాపముగాని మనోరాగముగాదు. రెండవది, శృంగారమును నాయికానాయకుల చిత్తప్రకృతుల ననుసరించి యనేకరీతుల నుండునని మనవారికిఁ దెలియదు గాఁబోలు! జావళీశృంగారముఁ దప్ప నింకేరీతియు వారెఱుంగరు. అందఱి శృంగారము నొక రుచిగలిగినదే. నానా భంగులఁగాక, యేకరీతిగా నెల్లెడల నుండుటచే రోఁత గలుగక మానునెట్లు? అసలు వాస్తవమైన శృంగారముగాదు. మఱి దానినే యమితరాశిగా ముందు దెచ్చిపెట్టి ప్రతిదినమును ఆరగింపఁజేయుచుండిన నెట్టి మోటుపందికైన వెగటురాదా?

కళాపూర్ణోదయమున నైదునకుఁ దక్కువగాని విధముల

శృంగారము వర్ణింపఁబడియున్నది. ఇందు జావళీలకుఁ జేరినది యొకటి మాత్రమ. అయ్యది యప్రశస్త మనఁదగిన భాగములో నుండుటచే దాని ప్రస్తావన యిటఁజేయను. తక్కినవానిలో నొక దానివలె నొకటి యుండదు. అన్నియు రమణీయముల. కామము అనునది జాతి. సామాన్య ప్రబంధకవులకు దెలియకున్నను దాని యందుపజాతులు లెక్కకు మీఱి యున్నవి. స్త్రీ పురుషులలో ప్రతి వారును వలచు విధములువేఱు. ఆచారము రీతిఁ జేయఁబడు తిలకవస్త్రాది రచనలో సయితము తమకు సొగసులని తోఁచెడు భంగుల చిత్తమేర్పడునట్లు పచరింతురుగాదె! ఇంటిపెద్దలు, ఇరుగుపొరుగువారుఁ జూచి పదిమాటలాడుటకు నాస్పదములైన బహిరంగపు వర్తనలయందే వ్యక్తి సర్వవ్యాపిగా నుండఁగా, మన సులో నుద్భవిల్లు రాగములలో ప్రత్యేక భావములు చందములు నుండక యచ్చుగొట్టిన రీతి నందఱు నేకగతిం జరింతురా? సంపూర్ణమగు ననువర్తనము తలపాగఁ జుట్టుటలోనే లేదఁట! ఇఁక మనసును గన్నునుపోవు జాడలలో నుండునా? శృంగారము శాస్త్రప్రకారముగాఁ దీర్పఁబడు విగ్రహము గాదని యెఱుంగని మనవారి విలక్షణత నేమనవచ్చును? సామాన్యముగఁ జైతన్యముల లోనే యేకక్రమము అప్రకృతము. మానవులలో నదిచెల్లునా? సాధ్యమా? ఇఁక మనుష్య భావములనెల్ల నుత్కృష్టతరమగు మోహమున కట్టి జడ సంప్రదాయము శక్యమా?

మనకవు లీసంగతి నెఱుంగక కామమునకు నాచారముఁ దీర్చియుండుటకుఁ గారణములు, వారి మౌఢ్యము, హిందువుల జీవితముయొక్క రీతియును. ఎట్లన, "మనలోఁ బెండ్లికి మనసు నకును సంబంధములేదు. పరిణయము వ్యవహారములలో నొకటి. చిత్తజముగాదు మఱి పితృపితామహజము. మనసును నిరోధించి పీడించు వర్గములలో ముఖ్యములు జాతిభేదములు. తమ తమ యుపశాఖలను మీఱి హృదయము వ్యాంపింపఁ గూడదఁట దీని వలనఁ గలుగు ఫలమేమనఁగా, అమనస్క వివాహములు. అనఁగా దేహ మొకచోట చిత్త మింకొకచోట. మాట లిక్కడ తలఁపు లక్కడ. చిత్తము శివునిమీఁద. భక్తి రంకులాఁడిమీఁద!"

అట్లగుట వధూవర సంగమము ఆచారానుసరణముగాఁ జేయఁబడు కర్మము, ప్రాయికముగ కామిత మనుట కల్ల. పెండ్లిం బట్టి చిత్త వికృతయను శృంగారభావమును, చట్టదిట్టముల ప్రకా రము అలంకారాది శాస్త్ర సూత్రముల యాదేశము చొప్పునఁ, బోవు

వినయ మర్యాదలుగల మంచివస్తువని యెంచిరో! సందేహమేల? యెంచిరి. మనవారి నమ్మిక మీరెఱుఁగరా? కూతురా! ఫలానా పక్కిరుశాస్త్రి నీకు పురుషుఁడు. నేను నిర్ణయించినాను. నగలతోడ నీ మనస్సును మూటంగట్టి వాని యింట్లో పదిలముగానుంచి సుఖపడవలసినది. నా మాటయిది. ఇంక నీకేమి యీ పనితోఁ బెత్తనము? చెప్పినట్లు చేయుమనియే గదా తలిదండ్రుల సంభావన! పెండ్లిలో నన్ని మంత్రములుఁ దంత్రములు నుండును. ఒక్కటిదప్ప! ఏయ్యది? ఆత్మతంత్రము వివాహము సంస్కారమఁట! హృదయబహిష్కారమనఁ గూడదేమో!

ఇట్లగుట శృంగార భావములును నోరులేని కొడుకులుఁ గూఁతులుంబలె శాస్త్రోపదిష్టక్రమముల మేర మీఱక యాచారముల ననుష్ఠించి సర్వసామాన్యముగ నుండునని భ్రమించి, ఈ సామాన్య స్వరూపము నలంకార శాస్త్రములు కనిపెట్టి వెల్లడిచేసినట్లు మఱియొక్క భ్రాంతిం జెంది, యవి చెప్పినట్ల తఱచు మనకవులు వ్రాసియున్నారు. కామమునకుఁ గారణమొక్కటిగాదు. మఱి పెక్కులు. పోవుమార్గములు, తాల్చు ఉపభావములు, చూపు చిన్నెలును ప్రతివారియందును నవీనములు. అనన్యములు. ఫలములు నట్టివే. ప్రేమచే విషముఁ బెట్టువారు లేరా? తనకుం దక్కకపోయిన నొరులనుం జెందఁ గూడదని హృదయ ప్రియులను గొందఱు మృత్యువు వాతఁ ద్రోయుదురు! కొందఱు ప్రాణములనైన నర్పించి వారికి మేలుచేయ జూతురు. బలాత్కరింప నెంచువారు నున్నారు. పరస్పర ప్రీతిలేని కూటమి హేయమని రోయువారుం గలరు. భయము, శోకము మొదలగు వానిచే వికలితస్వాంతలైయుండు స్త్రీలమూర్తులు గొందఱకు నాఁపరాని మోహాతిరేకముఁ గలిగించును! శాస్త్ర దృష్టితోఁగాక దేవుఁడిచ్చిన సొంతపు గన్నులతోఁ జూచువారికి నిట్టి విశేషములు సులభముగ గోచరింపఁ గలవు.

సూరన ప్రతిభావంతుఁడు. కనుక సంపూర్ణముగఁ బాండిత్యబద్ధుఁడు గాఁజాలఁడు. స్వశక్తియే గురువుగ నూతన మార్గములం ద్రొక్కి యాతఁడు ప్రకటించిన యసాధారణ శృంగారములకు ముఖ్య నిదర్శనము లీ క్రిందివి. శల్యాసుర విషయము. సుగాత్రీ శాలీనుల వృత్తాంతము. సరస్వతీ చతుర్ముఖ విలాసము. కలభాషిణీ చరిత్రము.

### శల్యాసురుని కథ

శల్యాసురునిఁ గూర్చి చెప్పవలసిన సంగతులు కొన్నియే.

మృగేంద్రవాహన తన బంధువగు మహిషాసురుం జంపినసూడు మనంబునం బాయమిఁ బగఁదీర్చు నుపాయము నన్వేషించుచుండఁగా, నభినవ కౌముదియను చంద్రకిరణ సంభూత యప్సరః కన్య యెదురైనఁ జూచినమాత్రాన హృదయమును, ఆ హృదయము తోడ నిన్నాళ్ళుగా పట్టిన పట్టును గోలుపోయినవాఁడై, నన్నేలు కొమ్మాయని యాకాంతను వేఁడుకొనఁగా, నామెయుఁ జలఁబు దాల్చి వదియై

క. .. ............నిన్ను మడియించిన వా
నిని దక్క నే వరింపను
వినుమిది నాప్రతిన దీని విడనిఁక ననియెన్.

(కళా. ఆ. 6, ప. 39)

చ అనుడుఁ దదుక్తిక్రూరతకు నద్దనుజుండు గడున్ ఘనంబుగాఁ
గినిసియుఁ బోవనిచ్చె నొక కీడును చేయక యవ్విలాసినిన్......

(ప. 40)

ఎంత బలవంతులైన నేమి? కామినీకటాక్ష పాశబద్ధు లేమి చేయఁగలరు? మోహముయొక్క ప్రభావ మద్భుతము. క్రూరులను మృదుచిత్తులఁ జేయును. మృదుచిత్తులఁ గ్రూరులఁ జేయును! ఏనుఁగును బిసతంతువుతోఁ గట్టినట్లు ప్రబలవీరుల నిస్సత్త్వులంబలె బంధించును! ఈ శల్యాసురునిఁ దలంచుకొన్న సంతాపమయ్యెడి! పాపము! నేఁడు గాకున్న నింకఁ గొన్ని యేండ్లకైనఁ దన నిర్వికల్ప హృదయసమాధింజేసి, ప్రీతిమైఁగాకున్న దయచేనైనఁ జేపట్టదా యని కాలము వేచియుండిన నిష్కపటి! నిశ్చలమైన మోహముగలవారు కాలము నోర్చుటకు శక్తులగుదురు. ప్రబంధ స్త్రీపురుషులయొక్క తహతహలు తొట్రుపాటులును తఱుచు చాంచల్య భావులకుఁ జేరినవి. గొప్పవారు మనసులు గలసినఁ జాలునని కాయసాయుజ్యము చిరమునఁగాని లభింపక పోయినను ఓర్పుతోనుందురు. అంగసుఖము నభిలషించు తుచ్ఛులకు సంభ్రమము సహజము. దమము మొదలగు నుదారగుణము లుండవు. ఐరోపా కవులు వర్ణించు శృంగారములో దేహసంయోగ ముంగూర్చిన వేగిరపాటు అంతగా నుండదు. హిందూదేశములో నాదిమధర్మము ఇంద్రియ నిగ్రహమంఁట! ఇది యేమాత్రము స్త్రీపురుషుల లక్షణమో కావ్యములఁ జదివినవారికి తెలియును! నోటిలో సదా వేదాంతములు పలుకుచుండువారియంత దుర్మార్గులు

లోకములో నుండరనుట కిదియొక తార్కాణము. సనాతన ధర్మ గ్రస్త మీదేశము! ఐరోపావారు తఱుచు హేతువాదులు. పరముం గూర్చి పెదవులచేతుగా జపించువారము మనము, ఇహమునం దాసక్తులు వారు. అట్లుండియు నాజనములలో నుండునంత యింద్రియ నిగ్రహ మిక్కడ నున్నదనుటకుఁ గాదు.

ఈ సల్యాసురుఁడు ప్రబంధనాయకులకన్న నిస్సంశయముగ మేలైనవాఁడు. మృగేంద్రవాహనాశక్తి యిచ్చిన యమోఘమగు కత్తిందాల్చి మణికంధరుని నరయుటకై పోవు నభినవకౌముదిం గాంచి, తన్నే చంపుటకు వచ్చుచున్నదో! అట్లైనం దన్నుం జంపు వారు చత్తురను నమ్మహాశక్తి వరమున్నదిగదా! అట్లగుట నాపె నాశమొందునో యని, తనపాటుమఱచి, ప్రియురాలి శుభాశుభ ములం దలపోయుచు నా సాధు,

చ. …………సంభ్రమించుచున్
మతిగలఁగంగనిట్లనియె నాపయి వచ్చిన నీకు నిష్టదై
వతముల యానసుమ్ము! వరవర్ణిని! యెందుఁదలంక నేను దు
ర్మతినయి నీవు నాకుఁదెగి మ్రగ్గెదవో యని తల్లడిల్లెదన్!

సీ. అనుడు నయ్యింతి యోయసురేంద్ర నీవు నా
హానికి నోర్వ కిట్లాన లిడఁగ
నకట నీమీఁద రానంత యెఱుంగని
దాననే యేను నీ తలఁపు బడిన
నడిచెద నని తన్నుఁ గడచి చనంగఁ ద
ద్వాక్యరీతి నిజాభివాంఛితమున
కనుకూలమైన యట్లై తోఁచుటయు నతఁ
డక్కన్య వెనువెంట నంత నంత
నరిగె నెందును నిలువక యబ్జముఖియు
మిగుల నెడఁబాయ కొక్కొక్క మిషముతోడ
నప్పటప్పటి కొక్కింత యాలసించి
కూడనిచ్చుచు నెలయించికొనుచుఁ జనియె.

(కళా. అ. 6, ప. 62–63).

నమ్మినవాఁడు కవుడులేని మానిసి! వానిని మోసగించుట యేమికష్టము! ఆ యప్సరసయందును దోషములేదు. ఇష్టములేని వాఁడు పైఁబడ గమకించిన ద్వేషముఁబూనని స్త్రీలుందురా? ఐన నేక్కటి, వధకు నుత్సహించినను గొంచెము కనికరముఁజూపి

యుండిన నా కాంతకు గౌరవము హెచ్చుఁగాని తగ్గియుండదు. నిండుమనస్సుతో ప్రేమించిన వాఁడెంత యనిష్టుడైనను, దనకింత మనోహరణశక్తి యున్నదిగదాయని సంతోషమును, ఈ నిరాశ కిట్లేల యితఁడు బలియగుచున్నాఁడని పశ్చాత్తాపమును ఏమాత్రముం జెందని కఠిన హృదయలగు స్త్రీలుందురా? యోజింపుడు.

ఇట్లు తన్నలయించుచుం బోవుచుండఁ దనప్రతాపము ఆపె కెఱుకపఱుచువాఁడై యాపెను దాఁకకుండునట్లు శలలప్రయోగముఁ జేసి జంతుజాలంబుల సంహరించి యిట్లనియె: "నన్ను వరింపుము. లేనిచో నీవు చనెడు చోటులన్నియు నా బలముచేత నాశముచేయుదును. దాన నీకు నపకీర్తి కాన నాపయింగూర్చి కరుణలేక యున్నను, భూతకోట్ల రక్షింపవలయునను దయచేనైన నాకుఁ బత్నివగుము" అయ్యో! వానియార్తి యెట్టిది? తనకుఁ బరమార్థము ఆ స్త్రీ. ఆమెను నొప్పింపడు. ఆమెపైఁ గినియఁడు. ఇఁక లోకమంతయు హింసించి, యా హింస మాన్పుటకై యాపె యంగీకరించినను జాలుననుచున్నాఁడు. అహా! కాఠిన్యము మార్దవము రెండును వానియందున్నవి గదా! మఱియు నీ కాఠిన్యమునకు మార్దవమే కారణము! మోహమాహాత్మ్య మిట్టిది. వెన్న ఱాయగును. ఱాయి వెన్నయగును!

తన్నీరీతిని వెంబడించు నా యసురను మణికంధరునిచేతఁ జంపించి, పిమ్మట నా మణికంధరుని రెండవ జన్మము వేచియుండి యతఁడు గళాపూర్ణుఁడై జనింప తన పూర్వవృత్తంబు వివరించి గాంధర్వవిధిని వివాహమాడి యభినవకౌముది, పట్టమహిషియై యుండెను. శల్యాసురుని తరువాత గతియేమాయనో తెలియదు. వానిది వ్యసనకరమును వ్యర్థమునైన శుష్కజీవితము! నిష్కళంక ప్రీతిచే విశోభితము.

## సుగాత్రిశాలీనుల విచిత్రకథ

సుగాత్రి శారదపూజారియైన యొక బ్రాహ్మణునికూఁతురు, దాని వరుఁడు శాలీనుఁడు. ఇల్లటపుటల్లుఁడు. అలంకారములు, డంబములు, అట్టహాసములును వీనికి సరిపడవు. పల్లెటూరివాఁడు పట్టణ వాసుల కుర్చీలు, మేజాలు, నిలువుటద్దములనుజూచి వెఱఁగు వెఱపు నంది పోవుమాడ్కి, నేయలంకారములు లేక యుండు వారినేగాని, తళతళలు, పళపళలు, ఘలఘలలు, ఘుమఘుమలు మెరయవచ్చెడు స్త్రీలఁ దిలకింపఁడు. సర్వ

శృంగార సన్నాహములతో భార్య పడకింటికి రాఁగా, ఇదేమి కొఱవిదెయ్యమో, గజ్జలపిశాచమో యని కన్నెత్తియైనఁ జూడ కుండెను! ఆ భార్య కాపురుషుని తిక్క తెలియదు. శాకుంతలము లోని

"మ. నలినంబెంతయు నాచు చుట్టినను విన్నాణంబె చూపున్ గడున్
మలినంబయ్యును, మచ్చ చంద్రునకు సౌందర్యంబె కావించు, వ
ల్కలముంగట్టియు నీలతాంగి గడుఁ జెల్వంబందియొప్పారు, మం
జులమౌ రూపు నలంకరింపనిది యెచ్చో నేదియుం గల్గునే?"*

అను పద్యముయొక్క స్వారస్యము నీ సుగాత్రి యెఱుఁగు నంతటి ప్రౌఢయై యుండినయెడ, కొందఱు రసికులకు సహజ సౌందర్యము వలె మనోహరమగు రచన యెద్దియు లేదనియు, దివ్యసుందర విగ్రహయగు తరుణికి సామాన్యపు గడుసుచీరలు, తాటాకుల కమ్మలును ధరించిన నదియు మనసును నీరుగాఁజేయు ఒక విశేష మైన చెలువ మనియు నామెకుఁ దెలిసియుండును. వ్రేపల్లెలోని గోపికలు పట్టుచీరలు, సరిగె వస్త్రములు, నవరత్నఖచిత భూషణ ములును లేనివారు. నయమైన పట్టలుగట్టి, పూవులతో నలంకృతలై యే పనిపాట్లు లేక యుద్యాన వనములలో చివురాకు మెత్తలమీఁదఁ బొరలాడుచుండు రాచకన్నెలవలెఁ గాక, వెన్నలఁ దీయుట, అలఁ గొంచుట, గృహకృత్యముల నెఱవేర్చుట మొదలగు శ్రమములచేఁ బ్రొద్దుపుచ్చుచు దేహముల నారోగ్యముగను, మనసులఁ గపటము కాఠిన్యములేని విశుద్ధములుగను నుంచికొని యుండెడివారు. అట్ల య్యును ప్రబంధ నాయికలకన్న నెన్నియో మడుంగులు వారు ప్రీతికరలనుట భాగవతములో దశమ స్కంధముఁ జదివినవారికి వేఱుగఁ జెప్పవలయునా?† శాలీనుఁడు రసికశిఖామణి కాబోలు! తన భార్య కృత్రిమములగు తళుకు బెళుకులను వదలి గొల్లభామ రీతి నున్నఁగాని దగ్గఱఁ జేర్పనని సంకల్పించి కొన్నాఁడేమో!

అత్తగారు ఇంకను శ్రద్ధతో సొగసులు దిద్దిదిద్ది కూఁతును రెండు మూఁడు నాళ్ళట్లయనిపెను. వృథాప్రయాస! "వట్టిరాక పోక లొనర్చె వాని సతియు". పెండ్లికూఁతు రూరకయుండినను జెలికత్తె లూరకుందురా? జీతములకుఁ బ్రతిఫలముగా బోధనలు

* ఈపద్యము రచించినవారు మామక మిత్రులగు రా. అనంత కృష్ణశర్మగారు.

† మన నాటకములలో వీరిని రాజస్త్రీలవలె చిత్రించియుండుట రసభంగము.

చేయనిచోఁ గృతఘ్నుత యని యేమో ! ఆ లజ్జావతికి నేకాంతంబున నిట్టనిరి :

"ఆ. పొలఁతి! యాలిమగని పోఁడుము లేమియుఁ
గలిగినట్టి చొప్పు గానరాదు
మీఁతెఱంగుచూడ మేల్మేలు దంపతు
లిరువురును వివేకు లేమిచెప్ప?

(కళా. ఆ. 4, ప. 65)

క. కాంతుఁడు చిత్తజ్ఞుఁడైనను
కాంతకు సిగ్గువడఁ జెల్లుఁగాక కటకటా!
కాంతుఁడు సిబ్బితికాఁడై
కాంతయు నట్టైననెట్లు కాపురమింకన్. 66

ఆ. నలినవదన! యెన్ని నాళ్ళైనఁ జిన్ని కూఁ
తురవుగావు నీవు తొడఁగి పలికిఁ
దగినసేవఁజేయ కగునె యూరకయుండ
నాతఁడేమియు ననఁడనుచు నిట్లు. 67

క. మగవాఁడు భాగ్యవంతుఁడు
మగువకు నొప్పగునె యిట్లు మానపుబిగి గ
ట్టిగఁ దాల్పఁ దనంతన యా
డిగ మిటునటుసేయ నతని డెందము కరఁగున్. 68

క. గారామునఁ దోడ్తోడన
రారమ్మనఁ దనుచు మగుడి రానేటికిఁ గ
ర్పూరంబుతోడి బాగా
లీరాదో యాకు మడచి యీరాదొ! చెలీ! 69

క. వెంగలివి గాక నీవో
యంగన భోగములపంట యామనియగు నీ
బంగారువంటి ప్రాయము
సంగతియే యకట! రిత్తశయ్యకు నొసఁగన్. 70

క. యౌవనము గలిగినప్పుడ
పూవుంబోఁడులకుఁ బతుల భోగంబులుగా
కావిభవములకుఁ గొఱయే
యోవనజాతాక్షి ప్రాయముడిగిన వెనుకన్. 71

క. అన విని యీ పెదమాటల
నను నేటికిఁ జంపెదరు వినన్ సైపవునా
కని సిగ్గునఁ బలుకుచునాఁ
డొనరిచి చూచెను దదీయ యుక్తుల తెఱఁగున్" 72

ఈ సంభాషణ యతి మధురము. అశ్లీలవాక్యములు లేవు. జాతీయములు. లోకోక్తులు వీనిచే సువాసితము. చెలికత్తెలిట్లు గరువముగాఁ బలుకుట కావ్యములలో నరిది. కడపటిపద్య మత్యద్భుతము. ముగుదకన్నెయొక్క బయటి సిగ్గును, లోనియాశను సొగసుగఁ జూపుచున్నయది!

ఈ నూతన చికిత్సలు ఫలమీయక పోయెను. పాపము! సుగాత్రి యేమిచేయును? రాజకుమారిగా నుండినచోఁ జందనాదులఁ బట్టించుకొని చిగురుటాకుఁ బాన్పుపై హాయిగా మూర్ఛవోయి యుండును! పూజారిబిడ్డ. శాస్త్రప్రకారము శృంగారమను పథ్యము దప్పక సేవించి ప్రకటింపవలయునన్న నుద్యానవన ముండవలెను. శీతలోపచారములకు సేవకురాండ్రుండవలయును. సరస్సులుండవలయును. మఱియు పచ్చకర్పూరము, పునుగు, జవాది, అరఁటి బొందెలు, చందనము మొదలగు సంబారములు లేనిది శాస్త్రోక్తముగాఁ గామము నావాహన చేయనగునా! అట్టి నీటులు ధనికులకే గాని సామాన్యులకుఁ జెల్లదు. ప్రబంధములలోని మోహము మాత్రము నిక్కమైనయెడల, రాజుల యిండ్లలోనేగాని యింకెక్కడను రతి మన్మథులు వాసముచేయరని చెప్పవచ్చును! సుగాత్రికీ దిగఁదీపు లెవ్వియుఁ బట్టలేదు.

"వ. నాకును మంగళసూత్రం బీపాటి శుభస్థితి నుండుటయే పదివేలనుచు నెంచికొనియు వేళొకలాగున నుండక యతనికి నాయురభివృద్ధికరంబులని వివిధాలంకారంబుల నెప్పుడు నేమఱకయ తాల్చుచుఁ దన తల్లియేమియు నతనిని ట్టిట్టాడకుండం బ్రార్థించుచుండె."

(కళా. అ. 4, వ. 73)

భర్తకు నొక పిచ్చియైన భార్యకు నొక పిచ్చి! తన యలంకారము లాయనకు నాయురభివృద్ధికరము లనుట పిచ్చియైనను మేలుచేయు మంత్రములలో నొకటి గాన ననింద్యము. ఈ యోర్పును, వినయమును, సుఖపరిత్యాగబుద్ధియు, సంతుష్టియు శృంగార భావములు గావా? పతిపైఁగల ప్రీతిని సూచింపవా? అత్తగారికి మాత్రమున శాంతము గుదురదాయె! మనుమఁడు

గలుగకున్నఁ దనకు మోక్షము గలుగదని యేమో! ఈ దౌర్భాగ్యపు టల్లుఁడు తోఁటలోనైనఁ గృషిచేసి ప్రయోజకుడు గానీ యని యాతనిని బూఁదోఁటలో మాలిపనికి నియోగించెను! శాలీనుఁడు సత్వగుణుఁడు. చెప్పినదంతయుఁజేసి రచ్చలేక యుందమనెడు వాఁడు. మరియు, ఇల్లటపల్లుఁడు అట్టి యల్లురకు మర్యాదలెక్కువ యుండునా? ఒక్కభేదముఁ జెందక నిత్యము తోఁటపనులఁ జేయుచుండెను. అప్పుడు సుగాత్రి—

తే. తల్లిమాటలచే నిట్లు తన విభుండు
తనువు బడలఁగ బూఁదోఁట పనులుసేయఁ
జూడనోర్వక తాను నచ్చోటికరిగి
తోడుపడియెద నని చూచు వ్రీడ నుడుగు.

(కళా. ఆ. 4, ప. 84.)

పిమ్మటఁ గొన్నాళ్ళకు లజ్జఁ బాయఁద్రోచి పురుషునకు సహాయముగఁ దానును దోఁటపనులను జేయ

"ఉ. ........................
........................ఎప్పటియట్ల యలంకృతాంగియై
యెంతయు నింపుతోడఁ జనియెన్ బ్రియుఁడున్న వనంబులోనికిన్

(ప. 94)

క. చనియాతఁడు దా నలిపెడు
పనులకు నీయకొనకున్న బలిమిఁ గడంగెన్
దన సొమ్ములెల్ల నొక మఱు
గున నిడి పిరిసుట్టు సుట్టికొనిన వలువతోన్. 95

సీ. తోరంపుఁ జనుదోయి త్రుళ్ళింతల నిడంగఁ
దగుచోట్ల గుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి
వ్రేఁగైన పిఱుదు బల్విడిఁ జలింపంగను
వడినిట్టునట్టును నడచి నడచి
యడుసుతుంపురు చెక్కుటద్దంబులను బర్వ
మళ్ళకు మడవలు మార్చి మార్చి
నడుములేఁదీవియ నకనకల్గుడువనిం
పునఁదగు మోఁపులు మోసి మోసి
చిఱుచెమటచేర్పు వింతక్రొమ్మెఱుఁగుతోడఁ
గొమరు మేనొప్ప సారెకుఁ గొప్పువదల

నేమిటికినైనఁ దా మున్న యేగి యేగి
యెల్లపనుల నొనర్చి నింపెనక మెనఁగ. 96

ఇన్నాళ్ళుఁ గరగని యాతని మనసు ఈ నవ్యమోహనమూర్తిచే జయింపబడెను !

చ. ......................................అనా
బడలిక చూడలే కిడుమపాట్లకుఁజొచ్చి నలంగితంచు నె
క్కుడుతమకంబుతోడ, దలఁగ్రుచ్చి కవుంగిటఁగూర్చెనత్తఱిన్.
(ప. 99)

పశుప్రాయమగు శృంగారమునకన్న నిది యెంతమేలు? చూచి చూడకమునుపే కామినులఁగవయ నుంకించుట లోలత్వము. నీచము ! ఇక్కడ, భార్యయెడఁ గూరిమి, ఆపె తన సహాయమునకై స్వయముగా వచ్చినందుకు మెప్పు? బడలినందుకుఁ గనికరము. గొప్పబుద్ధిఁ జూపినందుల కుదారవర్తనయను గౌరవము. ఇట్లు స్నేహము మర్యాద. వీని కనుకూలములైన భావములతోఁ గలిసిన శృంగారము చూపఁబడియున్నది. ఇది శ్రేష్ఠము. మానసికము. శాశ్వతము. పెఱయవి యంగరాగములు. తుచ్ఛములు. చంచలములు. మనసుతోఁ గలసినట్లు కామేచ్ఛ వర్ణించుట మనలో నంతగా లేదుగాన నీచరిత్రము నవ్యలీలాలలితంబు.

తన మనోరథము ఫలించినందుకుఁ గారణ మాపెకుఁ దెలియదయ్యె. ఎట్లు దెలియును ! కార్యము లనేకములు గణించి పరిశీలించినఁగాని కారణము నేర్పఱుట దుర్లభము. ఒక్కనాఁటి యనుభవముచే నిర్ధారణ చేయ నశక్యము. అట్లగుట నాఁటిరాత్రి సుగాత్రి సంతోషముతో "నెప్పటికంటె మిగుల నలంకరించు"కొని కేళికాభవనమునకు రాఁగా "తోఁటపనులు, సేయు మూర్తి మదిన్ హత్తి పాయకునికి" శాలీనుఁడు ఈ ప్రచండవేషముఁ జూడనైనఁ జూడక యేదో ధ్యానమున మౌనియై కదలకయుండఁజూచి, భార్య శోకాశ్చర్య నిమగ్నయై వేచివేచి విసిగి,

ఉ. ఆ లలితాంగి చాలఁదడవచ్చట నమ్మొయి నుండి సాహసో
ద్వేలతనంతఁ జేరి కడుఁద్రిమ్మటచే శ్రమమొంది నారుగాఁ
బోలునుబోదునా నిదురఁ బోయెదరే యని కప్పురంపుఁ దాం
బూలముదావి ఘుగ్గురని ముంచుకొనం జెవిదండఁ బల్కగన్.

క. పైకొన్న పరాకున నతఁ
డే కోర్కిని వచ్చితనియె, నింతయు వగతో
లోకము వారలు పతికడ
కే కోర్కిని వత్తు రనుచు నెంతయుఁ బొలసెన్.

క. ఓ నాయక! ఇతరమ్ములు
పోనిమ్మా పాటియైన బుద్ధిగలిగి నా
మానసములోని కోర్కులఁ
పూనిక నడిగితిరి లోక పూజిత నైతిన్.

మ. అకటా! యేమని దూఱుదాన మిము నాథా వేఁగుజామయ్యెఁ బొం
దికగాఁ బాదములొత్త రమ్మనుటగానీ, యొంటి యేమోగడా
నికటక్షోణికి నేగుదెమ్మనుటగానీ కొంతనెయ్యంపుఁ బూ
నికతోఁ గన్నులువిచ్చి చూచుటయకానీ లేద యొక్కింతయున్.

ఉ. నేఁ డలతోఁటలో నపుడు నిబ్బరమైన మదీయ భాగ్యమున్
బోడిమియేమి పాకమునఁ బొందెనొ! మీకృపయట్లు గాంచిపెన్
వాఁడిదనర్చు నాచనువునన్ మిము నెమ్మొయినంతిఁగావి, యే
నాఁడును బుణ్యసాధ్వికి గుణంబదిగాదని యే నెఱుంగుదున్.

(కళా. అ. 4, ప. 109–113)

తే. అంతఁ దొలునాఁటియట్ల యత్యాదరమునఁ
బోయి పూఁదోఁట పనులెల్లజేయుచుఁ బతి
మన్ననలుగాంచి యెంచెఁ దన్మతికిఁ నట్టి
సొంపులేగాని భూషణా లింపుగామి.

(కళా. అ. 4, ప. 123)

ఇట్లాతని మనోవృత్తింగాంచి తగురీతి నాఁడు మొదలు వర్తించునదై యెల్ల సుఖంబులంగాంచి పరమసాధ్వీలలామమన నా సుగాత్రి ప్రసిద్ధి వడసెను!

ఏకాంతగోష్ఠి వర్ణించునపుడును గవి యెంత నాణెముదోఁప వ్రాయుచున్నాఁడో చూడుఁడు! ఇది సభ్యమైన వర్ణన. దీని జదువఁ దలవంచికొను నవసర మెవ్వరికి నుండదు. మనవా రనేకులు శృంగారమునకు 'శుచిత్వమునకును, బరస్పర శత్రుత్వ మాపాదించిరి. ఇది సత్యమునకు స్వభావమునకు రెండింటికిఁ దప్పిన యూహ, గొప్పవారి ప్రేమలు పరిశుభ్రములు నిర్మలములు. మృగప్రాయుల శృంగారములు వికారములు తుచ్ఛములు;

## సరస్వతీ చతుర్ముఖ విలాసఘట్టము

ఒక విషయముం బట్టిచూచిన సరస్వతీ చతుర్ముఖ విలాస ఘట్టము* వంటిది యాంధ్రంబున నెక్కడను లేదు. ఏవిషయమన, ప్రకృతిని పాత్రముల జీవితముతోఁ గలసినట్లు వర్ణించుట.

## ప్రకృతివర్ణనావిధములు

ప్రబంధకవులు వర్ణించిన జాడవేఱు. వృక్షములు కొండలు లతలు మొదలగు వస్తుప్రపంచమంతయు నుత్ప్రేక్షకు సామగ్రి. అందును స్త్రీ సామ్యముగాను, శృంగారక్రీడగాను ఉత్ప్రేక్షించుటకు. వసు చరిత్రములోని యుద్యానవనము గూర్చిన ప్రశంస లిందుకు, ప్రమాణములు :

"చ. ఒనరహిమాపకుంతనములూడ్చి తెమల్చిన పత్రభంగముల్
నన ననియాడుచున్ మొగడ చన్నులు పల్లవపాణిఁగప్పు నూ
తనలతి కాలతాంగుల నుదారగతిం జలివాపి నెయ్యపుం
బెనఁకువనేర్చె దక్షిణసమీరణుఁడొయ్యనఁ దావులంటుచున్."

(వసు. అ. 1, ప. 127)

"చ. జనపతిదారసిల్ల నొక సంపఁగి తావులకొమ్మ రాగవ
ద్ఘన సుమనోభిరామయయి కాఁకవహింపఁగఁబోలు ! కానిచో
ననుపమపంచసాయక కరాంచలచంచలచాపశింజినీ
జనితకఠోరఝుంకృతివి నైఁపకయొన్నె పరాగపాండువై."

(వసు. అ. 1, ప. 156)

ఈ యుత్ప్రేక్షల నుద్ధరించుటకై యెత్తఁబడిన సాధనములు సకృత్తుగ సహజోపములు. బహుళముగ శ్లేష. ఏ వస్తువులలోనైన స్త్రీలు లీనలు. దానికి సరిపోవునట్లు స్త్రీలలో నేవస్తువైన లీనము ! ప్రబంధప్రపంచము స్త్రీమయము. అఁడుమళయాళము. చెట్లు, చేమలు, పక్షులు, సరస్సులు, నదులు, గుట్టలు, అన్నింటనుండియు నుత్ప్రేక్షయను పుటమువేసి శృంగారభస్మముఁ జేయవచ్చును ! 'ప్రభావతి మంచి దుక్కిసాగిన పొలము' అని సూరన వర్ణించి యుండుట జ్ఞప్తియున్నదా ? సూరన్నయందును ఈ దుర్లక్షణము

*ఈ ఘట్టమునను ఒక లోపము. వానకురియుచుండగా మగనితో సమముగ దామను క్లేశముల ననుభవింపవలెనను సుగాత్రియొక్క కోరిక వ్యర్థముగ నా చినుకుల వారు తడియలేదట. తడిసిన నొండొరు లింకను చల్లగా నుండియుందురా !

లున్నవ. కాని, పాండిత్యమును బోఁద్రోచి భావముమీఁద దృష్టి యుంచి వ్రాయుస్థలముల నీదోషము పొంతఁబోఁడని నా యభిప్రాయము. కారణములు సమయోచితముగఁ జూపఁబడును.

దుష్టములగు నుత్ప్రేక్షలు ప్రాచీనకవులయందుఁ గానరావు. పెద్దనాదులయందును అంతగా నుండవు. ఈ యుక్తికవిత్వమునకు మార్గదర్శియు గురుప్రాయుఁడు నైనవాఁడు రామరాజభూషణుఁడు. అతనివలె నింకెవరును జేయలేదు. చేయంబోరును. వసుచరిత్రకు ననంతరము బయలువెడలిన కావ్యములలో నీచిత్రములు మెండు. పదములలో శ్లేషయు, శబ్దాలంకారములును, భావములలో విపరీతోత్ప్రేక్షలును సర్వకవులు అవలంబించిన వేడుకలు.

రామరాజభూషణునకుఁ బూర్వము వెఱ్ఱి వెఱ్ఱి యుత్ప్రేక్షలు దక్కువగ నుంటకు, తదనంతరము మితిమీరి యుండుటకును గారణము స్పష్టము. శ్లేషయొక్క సహాయము లేనిది సహజోపమల సమర్థింపనగుఁగాని, పిచ్చి యుత్ప్రేక్షల సమర్థింప నసాధ్యము. వసుచరిత్రకు మునుపు శ్లేష విస్తారము ప్రచారమునకు రాలేదు. తరువాత వచ్చినది. శ్లేషయు, శబ్దవైచిత్రియు, భావవైపరీత్యమును సమన్వితములు. వీని వేంద్రముచేఁ గవిత్వములోని రసమంతయు నెండిపోయినది.

ఇట్లు స్త్రీమయముగా వర్ణించుటకుఁ గారణము అది శృంగారమునకు నుపకరణమను నూహ. ఈ యూహ యాభాసము. ఎక్కడఁ జూచినను స్త్రీలు చెదలవలె మిలమిలలాడుచుండిన వారియందు మన కేమాత్రముఁ బ్రీతి యుండదు. అతిచే జనించు రసము రోఁత, అపురూపముగానిది యల్పమూల్యము. విరక్తి దట్టముగఁ బట్టువడవలయునన్న నాఁడుమళయాళములో నొక దినమున్నఁ జాలు. పదాఱువేలుం జిల్లర కాంతామణుల మందఁ జేర్చినవాఁడగుటఁగాదె శ్రీకృష్ణుఁడు నిత్యబ్రహ్మచారియనఁ బ్రశస్తుఁడయ్యె! అయనవలె దూరీకృతరక్తులు నిర్జితేంద్రియు లొరులుండరు! సర్వవ్యాప్తిగానుండు వస్తువుపై బుద్ధి యంతగాఁ బోదనుటకు నా భగవంతుడే సాక్షి! అరుదైనకొలఁది గిరాకి హెచ్చునను బజారు న్యాయమునైన ప్రబంధకారు లెఱుంగమి వారి చిత్రకవిత్వముకన్న మించిన చిత్రము!

భారతమందలి స్వభావవర్ణనావిధానము

భారతకవులు ప్రకృతివర్ణన యెంతయు మనోహరముగఁ జేసి

యున్నారు. తఱుచుగ నుపమానములనైన వాడరు. వస్తువు సుందరముగానున్న దానిని నిజరూపముతో సాక్షాత్కరించినట్లు వర్ణించిన ప్రత్యక్షానందమీయదా? పోలికలేల? ఉత్ప్రేక్షలేల? నురుగులు గ్రమ్ముచుండఁగా నలల పరంపరలచేఁ దీరముమీఁద గొట్టుకాడు సముద్రము తనంతట గంభీరముగాదా? అద్దాని జూచినప్పుడు మన మానందించుట యుత్ప్రేక్షతోనా? దానియందు చూపు హత్తి యిటు నటుఁ దిరుగకుండుటచేనా? భారతములో నుపమానోత్ప్రేక్షలతోఁ గలసిన స్వభావవర్ణనము లున్నవిగాని, యవి స్వచ్ఛందముగ నప్రయత్నపూర్వకముగ వచ్చినవి. సొగసుగ వనములగుండా దారిచేసికొని పాఱు నదిని స్త్రీకిం బోల్చుట సర్వదేశములలోను బ్రబలిన యలంకారమగుట నైజమనవచ్చును. ఇట్లు చేయుటలోను నసాధువగు క్రియ యొకటున్నది. ఏదన, నదియందలి ప్రత్యవయవము నకును స్త్రీ యవయవ మొండు సరిపోలినదని, యట్లే స్త్రీ యంగాంగములకుఁ దోడుపోయిన భాగములు నది యందున్నవనిగాని చూపుట. ప్రత్యవయవ సమన్వయము చిత్రపుటూహ రసాన్వితము కాదు. మొత్తపుటర్థముగా సహజోపమలు, ధ్వని మొదలగువానిచేఁ గూర్పఁబడు సంబంధము మంచిది. ప్రత్యంగ క్రమమునకుం బోయినఁ కుయుక్తులు దప్పవు. ఆకారము సమిష్టి నే భావము నుప్పతిల్లఁజేయునో, దాని నారసి, ప్రముఖములైన సాదృశ్యము లున్నవానిని సూచించి విరమించుట బాగు. దీనిచేఁ జదువరులకును లాభము. ఎట్లన, కవి చూపించిన పోఁబడింబట్టి యింకను గొన్ని సామ్యములను మనమే యేర్పఱచుకొనుటకు నవకాశ ముండుటచే బుద్ధికిఁ బనులును దానఁ జొఱవయుఁ గలుగును. ప్రతిపదటీకగా బాకీ యేమాత్రము లేక యంతయు విశదపఱచిన మన మనః పరిశ్రమకు వీలుండదు. కానఁ గొంతవడికి మాంద్యము విసుగును జనించును. పూర్ణోపమల కన్న లుప్తోపమలు రసవత్తరములు. భావానుకూల్యములు.

ప్రాచీనులలోఁ గొందఱు కవులు (అందును ముఖ్యముగా బమ్మెర పోతనామాత్యుఁడు) ఇంకొకవిధమైన యపభ్రంశము నాశ్రయించినట్లు తోఁచెడిని. ఏదన, వనవర్ణనము మొదలగునవి చేయునపుడు పదాడంబరమునకై నిఘంటువులలోని చెట్ల పేర్లన్నియుఁ బ్రయోగించుట దృష్టాంతము.

"ఉ. అందుఁ దమాలమాలవకుళార్జుననింబ కదంబ పాటలీ
చందన నారికేళ పనసార శిరీషలవంగలుంగ మా

కందకుచందనక్రముక కాంచన బిల్వకపిత్థమల్లి కా
కుంద మధూకమంజులనికుంజములందనరారి వెండియున్."
(భాగ. తృ. స్కం.)

వ. అది మఱియును మాతులుంగలవంగలుంగ చూతకేతకీ భల్లాతకామ్రాతక సరళపనసబదరీ వకుళవంజుళవటకుటజ కుందకురవక కురంటకకోవిదార ఖర్జూరనారికేళసిందువార చందనపిచుమందమందార జంబూజంబీర మాధవీమధూక తాలతక్కోలతమాల హింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలకక్రముక కదంబ కరవీర కదలీకపిత్థకాంచన కందరాళ శిరీష శింశపాశోకపలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికామతల్లికా ప్రముఖ నిరంతర వసంత సమయ సౌభాగ్య సంపదం కురితపల్లవిత కుసుమితఫలితలలితవిటపవిటపివీరున్నివహాలంకృతంబును.......... ఇత్యాది.
(భాగవతము, అ. స్కం.)

వ్యక్తివర్ణన ముత్కృష్టము

ఇట్లూరక వృక్షనామములఁ బేర్కొన్న నేమి యందము ? ఆ చెట్లయొక్క గుణము, ఆకారము మొదలగు విశేషముల నెఱుకపఱుచు విశేషణములఁ జేర్పకున్న సమరమునకు గవి వర్ణనమునకును భేద ముండునా ? అరఁటిచెట్టు, అని చెప్పిన మాత్రాన వినువారి కది యిట్టిదని యేర్పడదు. మనసు ముందఱ ప్రతిమవలె వస్తువు గన్పట్టవలయునన్న సామాన్యగుణముఁ బేర్కొనినఁగాదు. విశేషాంశముల, జాపవలయు, నిదర్శనము. మనుష్యుఁడు అన్న మాత్రాన మనకు నేరూపమును గోచరింపదు. విశేషణములఁ జేర్చుచుఁబోయిన ప్రతిమయుఁ దీఱుచువచ్చును. ఎట్లన, చింపిరి బట్టలవాఁడు తల విరియఁబోసికొని యున్నాఁడు. పంగనామాలు, ఎడమచేతిలో గరుడస్తంభము, కుడిచేతిలో గంట. అనునప్పటికి దాసరివాఁడు ప్రత్యక్షమునకు వచ్చును. దాసరివారిని బరిశీలించినవాఁడు ఇంకను విశేషణములఁ బూన్చిన, నేదోయొక దాసరి గాక, నిష్కృష్టమగు నొక రీతికిం జేరినవాఁడు ముందువచ్చి ఘోషించును. అట్లే యరఁటిచెట్టు గూర్చియు, అరఁటిచెట్టన్న మాత్రాన నేయరఁటిచెట్టో ! కాండము గుండ్రముగా బలిసియున్నది. సూర్య కిరణములు సోఁకి లోనదూరక యిటు దిరిగిపోవునంత స్నిగ్ధము. వెడలుపైన యాకు లున్నవి. ఘనమైన యొంటిబముచే వంగిన తల గలది. ఈరీతిఁ జిల్లర చిల్లర సంగతులు గలుపుచు వచ్చితిమేని

యాకారము రంగులుదీఱి యేదే నొక విగ్రహముగ మనసున ప్రతి ఫలించును. ఇట్లుగాక పేరుల జాపితా యెదుట నుంచిన, మన మేమి వర్తకులమా దానియెడ నావరముంచుటకు ?

సమష్టిగా వ్రాయుట నిఘంటుకారుల పని. వ్యక్తి నొకదాని హృదయమున సాక్షాత్కరింపఁ జేయుట కవియొక్క ముఖ్యోద్యమ ములలో నొండు. ఇది చేయంజాలని వాఁడు పండితుఁడుగా వచ్చునేగాని కవిగానేరఁడు. తన మనసులో నేదే నొక యాకృతిని చక్కఁగ నేర్పఱచి పదములమూలముగ దానిని రసికులకు వ్యక్త పఱిచిన నదియ కవిత్వము. నదిని వర్ణించిన నన్ని నదులకుం జెందిన తీరునఁ జేయుట కళగాదు. మఱి యే దే నొక్క తెఱం గగునది దోఁపవలయు. అట్లే సరస్సులు మొదలగు ప్రకృతి మూర్తులం గూర్చియు.

పాత్రముల వర్ణించునపుడును ఈ తత్త్వము నేమాత్రము మఱవరాదు. ప్రబంధ కవులలో ననేకులు పసుచరిత్రానుకారులు. ఈ పద్ధతి నే మాత్రముఁ దెలియనివారు. వీరినాయికలు పరస్పర ప్రతిబింబములు. ప్రత్యేకించిన గుణము, చర్య, రూపము, ఏదియు లేదు. నాయకులు నట్లే.

కవులు వర్ణించిన ప్రకృతులు పాత్రములు నుత్కృష్టములా యని శోధించుట కొక యుపాయమున్నది. ఏదన. ఆ వర్ణనలఁ జదువుటచే చిత్రకారుఁడు విస్పష్టమును అనన్యమునైన ప్రతిమను వ్రాయఁగలడా యని వితర్కించుట. బమ్మెర పోతనామాత్యుని వనములు సరస్సులు నన్నియు గురిగింజలట్లు ఏక రూపములు. ఏక రూపము లనుటయుఁ దప్పు. ఏకనామము లన్న నింకను సత్యము! ఏలన నిఘంటువులలోని పేర్లున్నవిగాని, యయ్యై వస్తువులకుఁ గాలాదుల ననుసరించిన చర్యలెవ్వియు నారోపింపఁ బడనందున నవి దృష్టములు గావు.

పాత్రములఁ బరిపూర్ణములుగా వర్ణించుట యెంత తప్పో వనాదుల సైతము 'సర్వలక్షణ సంపన్న' ములఁగా వర్ణించుట యంత తప్పు. పోతనయొక్క చెట్లన్నియుఁ బుట్టి పెరుగు తా వీజగతి నొక్కటే! ఎద్దియన. నిఘంటువు! భూసారాది తారతమ్య ములచేత నొకజాతికి వృద్ధికరమగు నేల యింకొకదానికి క్షయ కరము. మఱియు ఒక నేలలో పెరుగు వృక్షములు సైతము సరిగా నాయికానాయకులు వచ్చునదిచూచి యన్నియుఁ బుష్పఫల భరితములు గావు. వనములు, తోఁటలు మొదలగునవి చూచిన

వారందఱకు నిది తెల్లంబ. కవులకు గాదు. పాపము! వారేమి చూచిరి? నిఘంటువులం దప్ప.

ప్రబంధకవులలో పాత్రవర్ణనమునఁ గనంబడు దోషము లన్నియు ప్రకృతివర్ణనమున నున్నవి. దేనినిగాని తాము భావించినట్టియో, చూచినట్టియో వ్యక్తిగా వర్ణింపరు. సర్వసామాన్య గుణంబులఁ బేర్కొని యాకృతిని నిర్ణయింపఁజాలని యంత సమష్టిగా వ్రాయుదురు. ఇది ఉన్నదియున్నట్లు, కన్నది కన్నట్లుగాక చదివినది చదివినట్లుగా వ్రాయుటచేఁ గలిగిన యుత్పాతము!

## నన్నయభట్టు ప్రకృతివర్ణనముసేయు రీతి

భారత కవులలో నీ దోషమంతగా లేదు. విశేషణములు లేని జాపితాలు మృగ్యములు. అమ్మహనీయుల రీతిఁ జూపుటకునై కొన్ని యుదాహరణముల నుడివెద:

నిరలంకారములు.

"మానిని. ఏచితనర్చితలిర్చిన క్రోవుల నిమ్మగుతావుల జొంపములం
బూచిన మంచియశోకములన్ సురపొన్నలఁ బొన్నల గేదఁగులన్
గాచిబెడంగుగఁ బండిన యానహ కారములం గదళీతతులం
జూచుచు వీనులకింపెసఁగన్ వినుచుఁ శుకకోకిల సుస్వరముల్.

కవిరాజ విరాజితము.
చనిచని ముందట నాజ్యహవిర్ధృత సౌరభధూమలతాతతులం
బెనగిన మ్రాఁకుల కొమ్మలమీఁద నపేతలతాంతములైననుబా
యనిమధుప ప్రకరంబులఁజూచి ధరావిభుఁడంతనెఱింగెఁ దపో
వనమిదియల్లదె దివ్యమునీంద్ర నివాసము దానగునంచు వెనన్."
(భా. ఆ. ప. ఆ. 4, ప. 20-21)

లయగ్రాహి.
కమ్మనిలతాంతముల కుమ్మొనసి వచ్చు మధుపమ్ముల నుగీతనినదమ్ము
లెసఁగంజూ
తమ్ములలనత్కొనలయమ్ముల నుగంధిముకుళమ్ములను నానుచు
ముదమ్మొనరవాచా
లమ్ములగు కోకిల కులమ్ములరవమ్ము మధురమ్మగుచు విన్పెననిశమ్ము
నుమనోభా
రమ్ముల నశోకనికరమ్ములును జంపక చయమ్ములును గించుక
వనమ్ములును నొప్పెన్

లయగ్రాహి.

చందన తమాలతరులందు నగరుద్రుమములందుఁ గదళీవనములందు లవలీమా
కందతరుషండములయందునవిమీలదరవిందసరసీవనములందు వనరాజీ
సందళిత పుష్పమకరందరసముం దగులుచుందనువు సౌరభమునొంద జనచిత్తా
నందముగ బ్రోషితులడెందములలందురఁగ మందమలయానిల సుమందగతి వీచెన్.

(భా. ఆది. అ. 5, ప. 138–139)

చ. కురిసెఁ బ్రచండవృష్టి ఘన ఘోషము లెల్లఁ గెలంకులన్ భయం
కరములుగాఁ గరాళ కరకాతతు లొప్పఁ దటిల్లతాళివి
స్ఫురితముగాఁ బ్రపూర్ణజలపూరము తద్గిరికుంజభూరిని
ర్ఝరతటినీతటీ నికటసాలచయంబు విమూలితంబుగన్.

(భా. అర. అ. 3, ప. 297)

క. లలితమధు స్రవ ఫలములు
విలసిత మృదుపత్రతతులు వృత్తస్కంధం
బులు నవిచలితచ్ఛాయలు
గలబదరీతతులఁజూచి కడువిస్మితులై.

(భా. అర. అ. 3, ప. 308)

సాలంకారములు

మ. ప్రమదాసాదిపయః ప్రపూర్ణ మిదిగో ! పద్మాకరంబంచుఁద
త్క్రమలామోద సుగంధమారుతము వీఁకన్ మున్నెఱింగించెన
భ్రమణంబిల్చె సరోవరంబనిలజున్ రాజీవ రాజీవస
త్ప్రమదాళి వ్రజచక్రవాక బకహంస క్రౌంచనాదంబులన్.

(భా. ఆది. అ. 6, ప. 172)

సీ. రంగదుత్తుంగతరంగ హస్తంబుల
నాడెడు నది వోలె, నతులవేగ
వాతవిధూతమై వఱలెడునది వోలెఁ
బర్వతకందరోపాంత తతులఁ
దొడరెడు నదివోలె ధ్రువ ఫేనవితతుల
నగియెడునదివోలె, నాగనక్ర

మకరకులక్షుభ్యమాణమై తద్బాధ
కోపనియదివోలె, నుచ్చభీమ
నినదమగుచునున్న నీరధియొద్దకు
.......................
(భా. అర. ఆ. 3, ప. 38)

సీ. ................................
సురనదిధరణీతలంబున కరుగుదెంచి
కలహంసగతియు నిర్మల ఫేనహాసంబు
నాకీర్ణమీన విలోకనములు
నాలోలపవనవాచాలితకల్లోల
రసిక మృదూక్తులు నెసఁగుచుండఁ
బ్రీతితో భగీరథుఁడను దూతచేత
నీతయై మహాముని పరిపీతరిక్త
మగు సరిత్పతిఁగూడి యా సగరజులకు
హితముగా దానినించె నాతతజలముల.
(భా. అర. ఆ. 3, ప. 83)

క. నానావర్ణశిలా విహ
గానేక మృగాభిరామమై భూనారీ
నానాభరణ విభూషిత
పీనోన్నతకుచముఁబోలె వెలిఁగెదు దానిన్

క. లలితాచ్ఛస్ఫటిక శిలా
తలములపైఁబాఱు విమలతర నిర్ఝరిణీ
జలపూరముల నుదారో
ల్లలదురు హారాలి నుజ్జ్వలంబగుదానిన్.
(భా. అర. ఆ. 3, ప. 292–293)

మిశ్రములు :

క. ఖరకిరణతాపమున నురు
తరదవదాహమున శోషితములైన వనాం
తరతరుతతి కాప్యాయన
కరమై వర్షాగమంబు గడుబెడఁగయ్యెన్.

తే. విశద శారదాంబుద పరివేష్టనమునఁ
బొలుచు గగనంబు ప్రతిబింబమో యనంగ
వికచకాశవనీ పరివేష్టనమున
నతిశయిల్లె నిర్మల కమలాకరములు.

ఉ. భూసతికిం దివంబునకుఁ బొల్పెసఁగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకరమై విలసిల్లె మహర్షి మండలో
పాసితరాజహంసగతి భాసి ప్రసన్న సరస్వతీక మ
జ్జా సనశోభితం బగుచు సజ్జయానముతో సమానమై.

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధి బంధురో
దారసమీర సౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగ పాండురుచిపూరములం బరపూరితంబులై.

చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవజృంభణ ముల్లసిల్లను
ద్ధురతరహంససారసమధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁజూడఁగన్.

శా. దానాంభః పటలంబునం బృథుపయోధారావళిం దాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్డిగ్గె నాఁ
గా నొప్పారె మదోత్కట ద్విరదసంఘంబుల్ వనాంతబునన్.

క. కలనీలకంఠ కోలా
హల లీలలు సెందె రాజహంసకులములన్
దిలకించె నప్తపర్ణా
వలి విగళితకుసుమకుటజవాటికల గెడన్.

మ. అతి గాంభీర్య విభూతి నేకచుళి కాహంకార నిశ్శేష శో
షితపాథోధిపయస్కుఁడైన ముని దోఁచెం బుణ్యతేజోమయా
కృతి నయ్యామ్యదిగంతవీథి, బ్రకట క్రీడాకళాగర్వ గ
ర్జిత మండూక కళంకితాంబు శుచితాసిద్ధి ప్రదాచార్యుఁడై *

నిరలంకారము లనఁదగు పద్యములలో ధూర్జటి వ్రాసిన

"శా. ప్రాతఃకాలతుషార శీకరచయప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వెసఁగు తద్బిందుచ్ఛటాజాతవి
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహురత్నోదీర్ణ గేహంబులై
లూతాకల్పితతంతుసద్మములు పొల్చుం జూడఁ జిత్రంబులై."

అను పద్య మత్యద్భుతము !

---

* ఆ. భా. 4, 141–146

ఉత్ప్రేక్ష

భాస్కరరామాయణమున సీతాపహరణ ఘట్టమున స్థావర జంగమ మయమైన ప్రపంచమంతయు నాయమకై యాక్రోశించె నని యెంత యుదాత్త రేఖగా నుత్ప్రేక్షింపఁ బడినదో చూడుఁడు.

తే. ఓలి శృంగంబునెత్తినకేలుగాఁగ
నిర్ఝరంబుల పెనుమ్రోఁత నిగిడిబెరయ
గిరుల జనకరాజాత్మజ పరిభవంబు
జగములెఱుఁగ నాక్రోశించు వగిదిఁదోఁచె.

(భాస్క. అర. ద్వితీ., ప. 151)

సీత! పరమపావనమూర్తి! శ్రీరాముని భార్య. దౌష్ట్యమున నామెను బలాత్కరించి కొనిపోయినవాఁడు సర్వలోకాధీశుఁడగు రావణుఁడు. రాక్షసవంశ సంహారకారణమైన దీ యాగడము. ఇట్టి జగత్ ప్రధాన సందర్భంబులఁ బ్రకృతియు మనుష్యమాత్రులరీతిని సుఖ దుఃఖాది వికారములందాల్చిన ట్లుత్ప్రేక్షించుట సమంజసముగాని, చీమకు దోమకు వాసియైన నాయికానాయకుల పాటులం గూర్చి లక్షించునదిగా వర్ణించుట గాంభీర్యమునకు గొఱఁత. వస్తువుల కొలందులు గణింపక వర్ణించిన నఁగుబాట్లగును. ప్రబంధములలోని ముఖ్యదోషములలో నీ వివేచన విహీనవర్ణన మొక్కటి. ఏ కుగ్రామముఁగాని, యెట్టి నికృష్టరాజులంగాని, వీర కావ్యముల ధోరణిగా వర్ణింతురు. పట్టణప్రాసాదములు మిన్ను ముట్టునఁట! భర్మ హర్మ్యములు గవాక్షములలో చంద్రుడు దూఱి పోవునఁట! ఇఁక రాజుగారో యా పురికిఁ దగినవారు! పంచ పాండవులు, దాశరథులు అందఱును గరఁగించి బ్రహ్మపోతఁ బోయగా నవతారమెత్తిన పురుష స్వరూపులు! కానిండు! ఈ బల పరాక్రమములకు దగిన శౌర్యప్రారంభముల నొడఁగూర్చినఁగదా యా గుణములు సార్థకములగుట. అట్టి కథాకల్పనా శక్తియో సున్న! మహాకవుల యూహలలోఁ గొన్ని దొంగిలించి కొన్ని విడిచి పెట్టుటలో లాభములేదు. కైకొన్న నన్నియుఁ గొనవలయు, లేదా, పూర్ణముగా వదలి తన నైజముకొలఁది వ్రాయవలెను. లేనిచో పరస్పరాసంగతిబాధచే సందర్భశుద్ధి చెడును.

ప్రబంధవర్ణనలు తావు మార్చవచ్చును, ప్రథమాశ్వాసముతోనిది ద్వితీయమునకుఁ బరివర్తించినను లోపముగాఁ దోఁపదు. మఱి బొత్తిగాఁ దీసివేసినను, ఇక్కడ నేదియో యుండవలయు

నను సంకోచము గల్గదు. అప్రస్తుతములనుటకు నీ కారణములు చాలవా ?

సరస్వతీచతుర్ముఖ శృంగార సంవాదము

ప్రకృతమనుసరింతము. ప్రకృతిని కథా పాత్రములతో సమ్మేళించినట్లు వ్రాసియుండుట సరస్వతీ చతుర్ముఖ విలాసము యొక్క ముఖ్యాంతరము. రంగము సరోవరము. శారదాదేవి ప్రణయకోపమున నవ్వలి మొగంబుగాఁ బొరలినందున, నామె ముఖచంద్రమండలము ఆ కాసారములోని మణిస్తంభమునఁ బ్రతిబింబితమగుడు, బ్రహ్మయు దానినిం జూచుచునైన నానందింతమని కొంతసే పఱేయుండి, యెంతకును బ్రియురాలి కోపముదీఱనందున, సమీప వృక్షశాఖాధిష్ఠితమగు రాచిల్కతో "చెలువయుబుసుపోదు, కథయొక్కటి జెప్పవుగా" యనుటయు "........ నోదేవ మీరు చెప్పెదరేని వినియదనని" యా శుకంబు విన్నవింప, ఏనుమని యాతండును అప్పుడుజరిగిన శృంగార లీలల నేదో కథఁ జెప్పినట్లుగా శ్లేషచేసి వివరింపఁదొడంగెను. ఎట్లన, కాసారపురములో నొకరాజు. అతనిపేరు కళాపూర్ణుఁడు (ముఖచంద్రుడు). అతఁడు స్వభావునిచే (స్వభావముచే) నొక యెఱ్ఱని మణిశలాకను (మోవిని) విల్లును (కనుబొమలును) బాణములును (చూపులు) బడసి సరిరాజులనెల్ల జయించెను. ఈ రీతిగాఁ దాను మన్మథావేశముచే నామెంగదియుట మొదలైన రాగంపు జెయ్వులెల్లఁ బ్రకటించుడు భాషాయోషయు కృత్రిమకోపంబున నిజమైన యుల్లాసంబుగా, చిట్లింపఁబడిన కనుబొమలతోను వెల్లివిరసివచ్చు చిరునవ్వులతోను ఆ చిలుకంజూచి "యా కళాపూర్ణుఁడు మఱి యేమియయ్యె నతని తలిదండ్రులెవ్వరు, అడుగుము" అనవుడు, చిలుకయూ నట్లడుగ బ్రహ్మదేవుండింకను జమత్కారముగా నేమనుచున్నాఁడు! అతనికిఁ దండ్రి సుముఖాసత్తి. తల్లిమణిస్తంభుడు (స్తంభశబ్దము పులింగముగనుక నందు ప్రతిబింబితంబనుట) అట్లనుసరికి.

సీ. ..........................

వాణిహాసముతో గ్రక్కునఁ గ్రమ్మఱి కౌఁగలించి

యంతలోననయౌరయెన్ని తబ్బిబ్బులు

తద్దరిల్లకుఁడంచు ధవుని పిఁపు

చఱచి యెట్టెట్టులారాజు జనని మొగది
యును జనకుఁడొఁడు వాఁడునాయనుచు మఱియు
మిగులనవ్వుచుఁజెప్పుడామీఁదు ప్రాణ
రమణ! మఱియేమియయ్యె నారాజసుటయు.

(కళా. ఆ. 5, ప. 24)

పాలయలుక సగము విరిసినది. పిమ్మట మఱికొన్ని స్నేహ క్రీడలు నడవఁగా, నిదేమి, యూలకుండరని కోపించుకొన్న సరస్వతీదేవికి హృదయ ప్రమోదంబుగా నీ క్రొత్తసంగతులను జేర్చి శతానందుఁడు కథ పెంచి చెప్పిన శారదాదేవియు కపట రోషంబుతో "చాలుఁజాలు మీ కథ. ఇప్పటి మన వృత్తమంతయుఁ జెప్పుచున్నారు. ఇంకెంతదూరము చెప్పెదరో యని యూరకుంటిఁ గాని తొలినుండి నాకుఁ దెలియదనుకొన్నారా?" యని యా కథ యందలి ప్రస్తుత వర్తమానమును మృదు మధుర వచనముల వాఖ్యానముఁజేసి చూపుచున్నది. ఐదవ యాశ్వాసములో నలువది యవదగు నీ వచన మెల్లరుఁ జదువఁదగినది. వచనరచనలకుఁ దండ్రియట్టివాఁడు నన్నయభట్టు. అతని ప్రౌఢిమ యన్యులకు లేదు. ఒక్క చిన్నయసూరి మాత్రము ఇంకొకవిధమైన వచన శైలిని బక్వమునకుఁ దెచ్చి నన్నయతో సమానుఁడై యున్నవాఁడు. ఈ యిరువురి దానికన్నఁ దక్కువయని చెప్పఁదగిన దయ్యును, సూరన్న వచనము సామాన్యముగాదు. వాణీదేవి వ్యాఖ్యానము చక్కెర లొలుకునది!

రంగము కార్యము పరస్పర సదృశములుగ నుండు క్వాచిత్క ఘట్టములలో నిది యొకటి. ఇక్కడను జిలుక నొక దానిఁ జేర్చినాఁడు. ఈ రహస్యమును రంభతోఁ జెప్పినందున శారదా శాపంబుచే నీ చిలుక తొలుతఁ గలభాషిణియై పుట్టి, పిమ్మట జన్మాంతరమున మధుర లాలసయై, భూలోకమున నిజనాథుని గళాపూర్ణుని గాథలు ప్రకటించి నరులకు వరప్రాయంబగు శ్రుతి ఫలము ననుభవించి సుఖమును గీర్తిని గాంచినది.

సరస్వతీ చతుర్ముఖుల సంభాషణలు చర్యలు పొగడ్తకు మీఱినవి. అతఁడు దన సతి నెన్నోవిధములఁ గేళీహేళనములుఁ దేల్పగఁ, నీమెయు నవ్వునడంపజాలకున్నను కినుక నటించుచు వలదు వలదని ప్రార్థించు పద్యములు మనలం బరువశుల జేయునవి! వాగ్రమణీమణి యీ దుండగములింకఁ జాలింపుఁ డని వేడికొనుచు,

సీ. మనమంత యేకతంబునఁ జెప్పికొనినట్టి
కథయిదెతోన యిక్కడనుబుట్టి
నింతమాత్రముగాక యిటమీఁద నీ కథ
బృథివిపైఁ గలుగఁ జెప్పితిరి మీరు
తొలుతనె యిది బ్రహ్మవలన వచ్చినయది
యనగఁ దన్మూల మెయ్యదియొ యనఁగ
వాఙ్ముఖప్రతిబింబ వర్ణన యనఁగ ని
ట్టి ప్రసక్తినిది సంఘటిల్లె ననఁగ
వచ్చెనగుఁబాట్లు నాకు మీవలన నాథ
నన్ను మన్నించి యికనైనను దడవక
మీరలూరకయున్న నెవ్వారునంత
వినరు గాన గుప్తంబు గావింపవచ్చు.

(కళా. అ. 5, ప. 58)

మ. అనుండుం బైపయిమాటగాక యిది యాహా యాత్మశృంగార శో
భన లీలారసమేరి కప్రియము నీపల్కన్ మనోవర్తనం
బును నేకంబగునేని నాలుకతుదన్ముక్కంటి కొమ్మా విలా
సిని యేనమ్మెదనంచు బ్రహ్మనగిపించెన్ మేలుమాటన్ సతిన్. 59

మ. ఘనయత్నంబుగ నవ్వడంచికొనుచుం గంజాక్షియున్ నాథ యే
మనినన్ గోపమువచ్చుచున్నదినుఁడీ యత్యంతమున్ నన్నికం
జెనయన్ రాకుఁడు చాలునవ్వులనివైచెన్ గొంతు మీఁదన్ నిజ
స్తనగుచ్ఛప్రతిమల్లహల్లకద ళోద్యత్కందుకం బంతటన్. 60

మ. అనయంబుం జలమొప్పఁగామణియు నాయబ్జాననుండట్ల యా
డెను, మానుండిదియంచు వాణియును వేడెన్, జేరి తానొక్కచే
తన కంఠంబున గౌగిలించి యొక చేతన్ గడ్డముంబట్టి చె
క్కునఁ జెక్కానుచు నొక్కచన్నొన యురఃకోణంబుతోరాయఁగన్. 61

తరల. అతఁడు నేలపెనంగెదోజలజాక్షి పల్కెటులున్న నీ
కత ప్రకాశితమౌట నీమదిఁ గాంక్షితంబ యవశ్యమున్
క్షితిఁ బ్రసిద్ధముగాఁగనున్న విచిత్రసత్కథ నీ కన
మ్మతమె యట్లగునేని యేమహిమం బ్రసిద్ధత గల్గెడిన్. 62

సీ. ................................
నీకుఁ బ్రియమది వేఱ వర్ణింపనేల ?
నీవిపుడు పల్కు పల్కు స్వాభావికంబు

పతుల యనురాగలీల లే పగిదినైన
వెలయఁ గోరియు దాఁచుటింతుల గుణంబు. 63

అనిన విని భారతీదేవి యా వారిజాసనుం జూచి "మీరలింత చలముఁగొని సమర్థింప నాకు నొఁగాదననేల?" యని యూఱడిలినది.

## కలభాషిణియొక్క మనోహర చరిత్రము

ఈ కథ యందలి పాత్రములపైకి నాకుఁ బ్రియతమ కలభాషిణి. నిక్కువమైన శృంగార భావములకుఁ బ్రకాశకురాలు. శాస్త్రకారుల శృంగార మనుదయ్య మంతగా సోఁకనిది. జన్మమున వారకాంత. గుణములఁ బ్రబంధనాయికలగు కులస్త్రీల కన్న మేలైనది! ఏక కాలంబున నిరువురియెడ మనసుదగిలినదానిఁగా వర్ణించుట కాధారముగా, కవి యీపెను గణికంజేసినఁ దప్పులేదని యిట్టి పుట్టుక నారోపించినాఁడో? పరిశీలింపుఁడు. ఎట్లును ఈపె నీచపాత్రము గాదు. మఱి మహోదారచరిత్ర. సర్వజన స్తవనీయ. కృష్ణుని కొలువునకు నప్పుడప్పుడు నారదుఁడు వచ్చుచుండ నతని తోడన వచ్చు శిష్యుఁడగు మణికంధరుని సాహిత్యపటిమకు గుణసంపదకును మెచ్చి వానియెడ బద్ధానురాగయై యుండియు, జాతి దోషంబుచేఁ గాఁబోలు నలకూబరుని రూపలావణ్యాది సౌభాగ్యంబులకు మెచ్చి తదాలోకనంబునం దనియక వాని విమానంబుతోఁ గొంతదవ్వరిగి యంతమగిడి యాతని తెఱంగెఱుంగఁగోరి నారదుం జేరి ప్రార్థింపుడు, నమ్మునియు రంభకు వైరిని నొకర్తు నిల్పనెంచినవాఁడు గావున,

క. నవతియన నింక నొకతెన్
భువిలోపల వేఱ వెదకఁ బోవలయునె? యో
ధవళాక్షి! నీవకానే
రవె దైవనియుక్తిఁ గొంత ప్రాప్తిగలిగినన్.
(కళా. ఆ. 1, ప. 178)

అని పల్కుచున్నాఁడు. హృదయపూర్ణమైన వలపు వినయము, అధైర్యము, దైన్యము మొదలగు భావములతోఁ గలసియుండును. విఱ్ఱవీగదు. అభీష్టసిద్ధి నిశ్చయమని యుదాసీనతయు గర్వముఁ గాంచదు. దీనికి దృష్టాంతముగఁ గలభాషిణి యిచ్చిన ప్రత్యుత్తరముఁ జూడుఁడు!

"క. ..........అంతటి రూప
శ్రీవైభవసతికిఁగాక సిద్ధించునె యా
దైవనియుక్తియు మాబోం
ట్లేవిధమునఁ బాల్పడిన నిద్ధవివేకా!"

(కళా. అ. 1, ప. 179)

నారదుఁడు సర్వజ్ఞుఁడు, మణికంధరునికి నాపైఁ గోరిక యుండుట నెఱింగినవాఁడు గావున, నీ నూతన రాగజ్వాలలో నాప్రాంత వలపెక్కడ భస్మమగునో యని దానికిం బ్రతిక్రియ చేయుటకోయన, 'నా శిష్యుఁడు చేసిన దండకము చదువుమమ్మా! విందము' అని యాపెచేఁ జెప్పించుచున్నాఁడు. అది యట్లుండె. ఈ తరుణియు నారదుని మూలముగ వాంఛితంబు సఫలంబౌనను నుద్దేశముచే నాతనికి శిష్యురాలుగా నేర్పడి యతనితో గానవిద్య నభ్యసించెను. నారదుండును గానశిక్షానంతరమున నిజకళాపాండిత్యముంగూర్చి కృష్ణుని కాంతలు మఱుఁగున నేమనుకొనుచున్నారో వినిరమ్మని యాజ్ఞాపించిన నలకూబరునిఁ గైవసము చేసికొను మంత్రమున కిదియ యవసరమని కలభాషిణియుఁ దన గుట్టు దోఁపనీక.

తే. ..................
నేను మీదాననగుట మీ గాన కథలు
వడిన నవ్వేళఁ గొడవలు దడవరేమొ!

(కళా. అ. 2, ప. 4)

సీ. నా కపేక్షితమైన నాతిరూపు ధరింప
సామర్థ్యమబ్బిన నా మగువల
నఖులరూపముఁ దాల్చి సముచితంబగు వేళఁ
జని వారి హృదయంబుఁ గనఁగవచ్చు

(కళా. అ. 2, ప. 44)

అనఁగా నారదుండును దాను రంభకిచ్చిన శాపమునకు నిది యనుకూలమని యా వరమునిచ్చెను. నలకూబర దర్శనము మొదలిదివఱకుఁ గడచిన కాలము నాలుగేండ్లు ఇది మఱవకుఁడు!

పిమ్మట నలకూబరచింతతోఁ బరితపించుచు నొకనాఁడు కాలయాపనార్థము వీణియఁగొని యుద్యానవనములో వాయించుచుండగా మణిస్తంభుండు గానాకర్ణనవ్యాజమున వచ్చుడు, నతని సహాయమున కృతార్థతనొంద నెంచినదై, యతఁడు నేఁ బోయివచ్చెదనని

పల్కినఁ దనదుఃఖము దైన్యము బయలుపడునట్లుగా విన్న వించినది.

తే. ..................
.........మహాత్మ నిన్ను నాపాలి భాగ్య
దేవతగ నమ్మియుంటి నా జీవితంబు
నేమిగాఁజేసి పోయెద వెఱుఁగఁ జెపుమ!

(కళా. ఆ. 3, ప. 53)

క. ఈవేళన యాతనికడ
కేవిధముననైనఁ జేర్చుటింతియ తక్కం
ద్రోవ మఱి లేదు నన్నుం
గావన్ క్షణభంగురములు గాంతలతాల్ముల్.

(కళా. ఆ. 3, ప. 55)

క్షణభంగురము లనుచున్నది యిన్నాళ్ళు గాచియుండియు! ఇదియు సహజమ. మఱి దైన్యము హెచ్చి హెచ్చి పిఱికిపట్టువంటి సాహసము పొడమును. ప్రాణకంటకమగు సంకటము. ఇంకను సిగ్గు నభిమానమును మర్యాదను బాటింపనౌనా? కావున నన్యము లం దనాదరయై యేమనుచున్నది!

సీ. ఓ సిద్ధపురుష మీరేసరణిని, గొని
చన్న నేమగుఁ దక్కుశంకగలదె
నీ మహత్త్వముఁ గానని జడాత్ములేమన్న
నేమికన్న మహాత్ములించుకయును
వేఱొక్కగతిగ భావింపర మముబోంట్ల
నంన్పర్శమాత్రంబు నమ్మతింప
నుచితంబుగాదంటి రుచితంబె మఱి నాదు

బలుపలుకులేల యింక నా చెలులు గిలులు
నేగుదెంచి విప్పు మొనర్తు రితమెఱుఁగక
కావునం గొనిపొమ్ము శీఘ్రంబ నీదు
వెనుకనిడికొని నన్ను మద్విభుని కడకు.

(కళా. ఆ. 3, ప. 61)

వీఁడు కపటసిద్ధుఁడు. ఈ చెలువంపురాశిని మృగేంద్రవాహనా శక్తికి బలియీ నెంచినవాఁడు! "శుద్ధముగాఁగ నీ మనసు శోకము సర్వముఁ బుచ్చివైచెద" నని మిథ్యాప్రత్యయముఁ బలికి, యాపెం బిలిచికొనిపోయి, యమ్మవారి గుడియొద్ద నిలిపి పూజాద్రవ్యములు

దేఁ బోయెను. అప్పుడు సుముఖాసత్తి, మిక్కిలియు ముసలిది వచ్చి సిద్ధుని చరిత్రం బెఱింగినదిగాన, ప్రియమును దయయును దోఁపఁ గలభాషిణిం జూచి యిట్లనియె.

క. ......................
...........లతాంగి యెచటనుండి చేరితి వకటా!
కలుషపుఁ బావురుఁ బిల్లిని
జిలుకయుఁబలె నిద్దురాత్ము సిద్ధుండనుచున్.

(కళా. అ. 3, ప. 84)

క. అ కలుషాత్ముఁడు క్రమ్మఱి
రాకమునుపె తొలఁగి పోవరాదా యెటకే
నోకూన యీ మనోజ్ఞత
రాకృతియేఁ జూడఁజాల ననిపా ల్గాఁగన్. 86

స్త్రీసహజమగు రహస్యజ్ఞాన వాంఛయు నడఁచిపెట్టుట సుముఖాసత్తియొక్క వాత్సల్యఘనతను సూచించెడిని. నలకూబరుని సంగమంబుఁ గాంక్షించి వచ్చిన యాబాలకు నీ వృత్తాంతమెంత చింతావహంబుగా నుండదు! తాను ద్వారకాపురిలో ననుభవించిన వైభవమును, తుదకుఁ దనకిట్లు ప్రాప్తించిన పశుమరణమును దలపోసి దుఃఖితమానసయై, తదనంతరంబు డెందంబు డిందుపఱిచికొని, యా వృద్ధురాలితో గద్గదకంఠముగా,

"శా. అమ్మా! నీపలు కెల్లనెంతయు నిజంబైయిప్డు గాన్పించె, నే
నిమ్మాయావి ప్రకార మిట్టగుట నూహింపంగలే కొక్క యు
ర్థమ్మున్ వీనికృపన్ గడింతునని యత్యంతాశ ప్రేరేపఁగా
నిమ్మాడ్కిం దెగివచ్చితిం దెరువులే దీపాటుఁ దప్పింపఁగన్"

(కళా. అ. 3, ప. 95)

అని యెట్టకేని నిరాసవలని ధైర్యముం దాల్చినదై.

"సీ. ..................
మీఁదటరాఁగల మేలు కీళ్ళేరికిఁ
దప్పింపరామి యెంతయు ధ్రువంబు
ఇంక వాఁడువచ్చి యేమేమి సేయునో
చచ్చుటెట్లొ యను విచారమునను
బెగడుచుండనేల జగదంబయాశక్తి
సేయవలసినట్లు సేయుఁగాక!"

(కళా. అ. 3, ప. 102)

అని పల్కుచుండ సిద్ధుఁడు క్రమ్మఱి యాపెం డాసి "యింక శక్తిఁ బూజించి పోవుదమురా" యని పిల్వఁగా, నయ్యో పాపము! మరణము అట్లు ప్రత్యక్షభీకరముగా నుండిన నెవరిగుండియలు నీరుగావు? గడ్డిపరకనైన శరణ్యమని యూఁతగాఁగొనఁ జూడమా! అట్లగుట నీ బాలభీరువు, దారుణమ్ముల నెన్నఁడుజూచియైన నెఱుంగనిది, ధృతి నీరయిపోగా నా వృద్ధాంగనంజూచి,

క. 'ఏ నొంటిఁ జోవ వెఱతున్
లోనికి నోయమ్మ! నీవునున్ రాఁగదె నా
తో' నన 'నెవ్వరు నేటికి
నేనుండఁగ' ననుచు సిద్ధుఁడింతిం బలికెన్. (కళా. ఆ. 3, ప. 116)

పలికి, దానిభయచేష్ట భావించి యింకఁ దడసిన విఘ్నంబగు నని లోనికి బల్మి నీడ్చుకొనిపోవుట కా కన్నెను గొప్పపట్టి యీడ్వఁగా నప్పుడఁతి

"తే ........ ......................
ప్రాణభయమునఁ గలఁగి యోయవ్వ! నీకు
బిడ్డనే కావవే నాకు నడ్డపడవె!
యనుచు నా వృద్ధనారి మాటునకు నొదిగె." 117

సుముఖాసత్తియుఁ దనమెడఁ గత్తి కడ్డముచేసి యామెను గాపాడినది. మృగేంద్రవాహనయుఁ గలభాషిణి వెండ్రుకలు దృఢ ముష్టింబట్టి మఱియుఁ బైకిఁ గత్తినెత్తిన యా సిద్ధు ననతిదూరం బునఁ బడవైచెను. వాఁడు కత్తినిగాని కలభాషిణినిగాని విడువక యట్లేచని, మాయా నలకూబరుఁడు రంభయుఁ గ్రీడించుచుండిన భూసామీప్యమున "మెత్తని క్రొత్తలిరు పాన్పుమీఁదఁ బడెను".

తలిరులను దాఁకినఁగాక రాక మానునా? సిద్ధత్వమెటఁ బోయెనో? కామవికార మా దేశమయ్యెను! పాండవమహిషింగూర్చి కీచకుఁడు కంపిత మానసుఁడైన ఘట్టంబునఁ దిక్కన పాంచాలి సౌందర్యము వర్ణించిన యనిర్వాచ్య మాధురీ ధురీణంబులగు సీస పద్యములంబోనివి యొకటి రెండు ఈ సందర్భమునఁ గన్పట్టెడు. రసికులు పోల్చి పరికింతురు గాక!

"సీ. అమృతంబు దొలఁకునట్లమరంగ వెల్వెలఁ
బాఱు ముఖేందు బింబంబుతోడ
బాలకర్ణద్వయీ కూలంకషంబులై
తల్లడంబందు నేత్రములతోడఁ

గడుఁ జెమర్చినయట్టి కలికిలేఁ జెక్కుల
నంటెడు విగళత్కచాళితోడ
వలిగుబ్బ పాల్లిండ్లు నిలువ కిట్టట్టు సం
క్షోభించు పయ్యెద కొంగుతోడ
వెరపు నొక యొజ్జయై వింతవిలసనములఁ
గఱపఁ జూపట్టు సౌందర్య గరిమతోడ
సరభ సాకర్షణక్షోభ చకితయైన
మదను జయిలక్ష్మిరీతి నమ్మగువ దనర."

(కళా. ఆ. 3, ప. 146)

సిద్ధుండు చూచినాఁడు. చూచినదే రెండవమాటలేక పరిరంభణమునకు మొదలిడినాఁడు! ఋషుల రసికత యీ మాత్రమే కదా! సౌమనస్యమున ఋషులకుఁ బాళయుగాంధ్రకు మృగములకును భేదము శూన్యము! ఆ బాలయు నదిసైరింపక రక్షణార్థము పేరెలుంగున నాక్రోశించిన. మాయా నలకూబరుండు వచ్చుటయు! తరువాతిక్రమములును బూర్వమే వివరింపం బడియె. ఆ నలకూబరుని కెదురుగా రంభాకారియై యీపె చను దెంచు ఠీవిఁ దిలకింపుఁడు!

సీ. తిరముగా ముడువమి విరియఁ బాఱడు కొప్పు
వేడ్తేడ నొకకేలఁదుఱిమికొనుచు
వల్లెవాటుగఁ గొంత వలువ చన్గవ నిల్పి
పెరచేత నీవి గల్పించుకొనుచు
నుదుటిపై నొక్కింత చెదరిన ముంగురుల్
పాపటకును బొందు పఱుచుకొనుచు
సారెకు జారెడు శ్రవణకల్హారంబు
లందంద మూఁపున నానుకొనుచుఁ
జమటనంటిన పానుపుఁ జివురుఁ దునుక
లెడనెడ నఖక్షతాశంకఁ దడవికొనుచు
రంభ యేతెంచె మిగుల సంరంభ మమరఁ
దొలుతఁ బ్రియుఁడెగుడెంచిన త్రోవఁబట్టి. (కళా. ఆ. 3, ప. 156)

మనోరథ మొకరీతి ఫలించెనేకాని పరిపక్వమయ్యెననుట నిర్వివాదముగాదు. అయిననేమి! ఈపె ప్రబంధముల రాచకన్నె గాదు గావున, కొంచెముతోఁ దృప్తిఁజెందగల యుదారురాలు! ఆ కొంచెమునకు మారుబేరముగ మరణశాపము వచ్చిపడినను,

"ఎట్లును గాంక్షితంబు సిద్ధించె. ఇఁక జావుగలిగిననేమి ? శక్తి గుడియొద్ద దేహత్యాగం బొనర్చెద" నని యచటికి వచ్చి, యా స్థానం బునఁ దనవలెనే శాపగ్రస్తుండై మణికంధరుఁడును ; దేవీకటాక్ష మున ముదిమివీడి కుమారీ రూపంబున విరాజిల్లు సుముఖా సత్తియు, మణిస్తంభుఁడును గుమిఁగూడ, వారువారు చెప్పిన వృత్తాంతములంబట్టి తన్నుంగలసిన యతండు కుబేరనందనుండు గామి శోకభరాలసయగుడు నాపెంజూచి మణికంధరుం డిట్లనియె.

"క. ..................
......... తరుణి ! యట్లపురూపం
బున నున్నవాఁడ నేఁజుమ్ము" (కళా. ఆ. 4, ప. 10)

అని పలికి,

"చ. జలజదళాక్షి ! యేను మునిశాప భయంబున నెందు నేఁటికిం
దెలివిపడంగనీక మది ధీరతఁ ద్రిప్పుదుఁగాని నీపయిం
గలదుసుమీ తలంపు మనగానకళాభ్యసనంబు వేళలన్
ఫలమిటులొందె దానికిని భాగ్యవిశేష వశంబునన్ దుదన్" 16

చ. అనుడుఁ గృతార్థనైతిఁ గుటిలాత్మకుఁ డెవ్వఁడు నన్ను నట్లు వం
చనమునఁ గూడునోయను విచారమువాసెను, నీదుపొందు నా
కు నభిమతంబె నీకుఁదగనన్న తలంపున నీ తలంపునేఁ
గనమినిద్రిప్పుదున్ హృదయకాంక్ష నిముంగనుఁగొన్న వేళలన్. 27

అని చెప్పి, ఇక్కడకు "నీకుఁదగనన్న తలంపు" నలకూబరుని యందుంబలెఁగలదు అని తనమాటల నమ్ముదురో మొగమాటము లని వాపోవుదురోయను శంకంజేసి, గరువము నభిమానముఁగల కోమలమానస యగుటచే శపథంబులు ప్రమాణంబులు ననుచి తంబులని భావించి

"యానుద్దుల్ హృదయైక సాక్షికములేమన్నన్ వృథాయిత్తఱిన్"

అని వచించి, నలకూబరునిపై మనసుపోవుటకుఁ గారణమొండు చూపునదియై,

ఉ. .........నమచింతతావక రూపరేఖ చొ
ప్పెనొకకాంత గల్గఁగని యిచ్చఁ గుబేరతనూజుఁ గోరితిన్. 20

క. శాప భయంబున నెఱయఁగ
నీపైఁ గోరిక మఱల్చి నిధిపతిసుతు నే

పాపపు వేళను జూచితి
నోపయిసాబ గేను మఱి గనుంగొన గుఱిగాన్. 21

క. అయక్షతనయుఁడని ని
న్నే యేఁ బొందితిఁ దుదన్ వనిన్ మనభాగ్య
శ్రీ యేమని చెప్పుదుఁ బడఁ
బోయినఁ బూఁ బాన్పునఁ బడుపోలిక యయ్యెన్. 22

ఉ: శ్రీయుతమైన దివ్యమణి చేతికినబ్బఁగఁ బాఱవైచి త
చ్ఛాయ యొకింతయున్కఁగని చాలఁగృశించితి గాజుపూసకై
నా యవివేక మేమనుకొనం దుదఁదన్మణియబ్బెనన్న న
త్యాయత తత్సమాగమ సుఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్. 23

ఆ. ఇట్టి మాటలిప్పుడే నాడుకొనుటయు
ననుచితంబ వారవనిత పలుకు
లిచ్చకంబులనక యెవ్వరు నమ్మెద
రదియుఁగాక దృష్టమన్యవాంఛ. 24

అని లజ్జాశోకంబులడర నవనతముఖియై యున్న కలభాషిణికి సమాధానము జెప్పి నిదర్శనముగా సుగాత్రీశాలీనుల చరిత్రంబు వక్కాణించి మణికంధరుం డాపెకుందును బోఁగొట్టెను. ఈదర్శన మేలయనఁగా, ఒకరిపై ప్రేమయుండినను వారేదేనొక క్రొత్తరీతి నుండినంగాని మతిసమ్మతింపదను శృంగార న్యాయమునకు! ఇది శృంగార విశేషములకుం జేరిన భావప్రకృతి. భార్యయందైనఁగాని, సర్వకాలముల సర్వావస్థల నేకరీతియగు మక్కువం దాల్చినవా రుండరు. ఏదేనొక విలాసము వహించి యొప్పారిరేని తమి తనంతట రేఁగును. మనుష్యులును బలుమూర్తులు గలవారని యంటిమిగదా! హృదయ వికాసము గలిగించునవి యందుఁ గొన్నిమాత్రమ. మఱి ఒకరికొక మూర్తిపైఁ బ్రీతి. ఇంకొకరి కింకొక మూర్తిపైఁ బ్రీతి. రేఖలు, లీలలు, విలాసములును తత్తద్ధృదయసారముల ప్రకారము సుఖదుఃఖావహము లగుట వింతగాదు.

అయిన నొక్కటి. పైఁజెప్పిన న్యాయము ఏకపురుషునందును వివిధ కాలముల స్త్రీలకు రాగము మాఱుచుండుటకు హేతు భూతము. ఒకనియందలి ప్రీతి వాని మూర్తి ననుసరించి హెచ్చుట తగ్గుట తెలిసెను. కాని కలభాషిణి వృత్తము వేఱు. ఏకకాలము నందే యిరువురియెడఁ జితము హత్తినటున్నది. ఇది బావఁమా?

అభావ్యమా ? మనసు ఒకేకాలమున నిద్దఱపై సమముగఁ బాఱునా ? అనేకులపై మోహ ముండుట నిజమా ? ఇది కష్టతరమైన ప్రశ్న. మణికంధరుని వలచినది నలకూబరునిని వలచినది. ఈ రీతి నిరువురిమీఁద దుర్భరమోహముం బూనియుండిన యొక స్త్రీని చరిత్రముం జదువుటచే నెఱుంగుదును. ఆమె యెవ్వరన, సుమారు నూఱు సంవత్సరముల క్రింద ఫ్రాన్స్‌దేశములో గణ్యయు విద్యాగంభీరయుఁ గా నుండి వెలసిన 'లెస్‌పినాస్' అనునామె. కాఁబట్టి యిట్టి వర్తనము అస్వాభావిక మనరాదు. అపురూప మనవచ్చును. అపురూప శృంగారముల సూచించిన సూరన్నయే 'రవిగాననిచోఁ గాంచెడు కవి !'

కలభాషిణి యొక్క తదనంతర వృత్తాంత మింకను గౌరవార్హము. తన శాపంబుఁ దలఁచికొని త్వరలో జీవంబు విడుచుటయు కర్తవ్యమని యెంచి సిద్ధుని జూచి, 'ఇంక జాగేల ? నీ ఖడ్గము అకుంఠితోద్యోగము. రంభాశాపమును దానికి సహాయకారి. కానఁ త్వరలోఁ గార్యంబు ముగించి తత్ఫలంబగు సామ్రాజ్యసుఖంబు ననుభవింపుమా' యని ధృతిమైఁ బలికిన సిద్ధుఁడు ప్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు. 'నా భార్య నిన్ను వ్రేయఁగూడదని కాళికాదేవిపై యానపెట్టి యుండుటచే మునుపే నఱుకఁబోయి యన్ని పాట్లఁ బడితిని. ఇఁక నామాట వలదు. ఈ కత్తిని మణికంధరున కిచ్చెదను. అతఁడు దానిని నీపైఁ బ్రయోగించి రాజ్యలక్ష్మి మహనీయుండగుఁగాక !' అట్లని మణికంధరుని నతిప్రయాసమై నీ క్రూరకర్మమునకు ననుమతుం జేసిన, కలభాషిణియు కోరి కోరి కాంచినవరుఁడు విధిప్రేరణంబునఁ దనకు యముఁడుగాఁగా కాలవైపరీత్యంబునకు చోద్యంబున, అప్రమేయ శాంతియుఁ జెంది ధీరభావయై

"వ. ..................మణిస్తంభునకుఁ దదంగనకుం బ్రణామంబులు సేసి కన్నీళ్ళు గ్రుక్కికొనుచు 'నీకలంకపాటు తక్కిన భయమునకుఁగాదు నుండు, మిమ్ము నెప్పుడు గురుభావంబున నారాధింపుచుండ లేమికిం గాని' యనుటయును సుముఖానత్తియు 'నోయమ్మ మననెమ్మనంబుల కూర్మి యింతటన పోయెనో మీఁదటనైన నీపతియు, నీవుఁ గోరినట్లు మమ్ము గురుభావంబున నడుపుకొనియెద' రనినఁ గలభాషిణి పునః పునః ప్రణామంబు లాచరించి ముకుళిత కరకమల యగుచు నిట్లనియె" (కళా. ఆ. 4, వ. 177)

శా. పూతంబైన మదీయపుణ్యయుగమో పుణ్యంపుటిల్లాలనీ
పాతివ్రత్యము చందమున్ విన మదిన్ భావింపఁగా నెట్టి దు
ర్నీతిప్రక్రియ వారికైనఁ గృపతో నీవిచ్చినంగల్గు నా
పాతివ్రత్యము నాకుమీఁదనయినం బ్రాపింప దీవింపవే! ప. 178

క. నావుడుఁ బరమ పతివ్రత
వై వెలయుము రాజ్యవైభవానుభవం బెం
తేవర్తిల్లఁగ నలరుచుఁ
బ్రోవుఁడు మముబోంట్ల నీవిభుండును నీవున్. 179

ఉ. అట్టిటుఁ జంచలింపకు దృఢాత్మత నుండుమటంచు నిప్పడే
మిట్టివి నీకుదెల్పునవి యెయ్యవి పెండ్లికిఁ బోవునట్లు గ
న్పట్టుచు నున్న దాన వతిభవ్యవికాసమునుబ్బుఁ జూడ నిన్
గట్టిగ నెన్న దేవతవుగాని నరాంగనవే మృగేక్షణా! 180

చ. అని తనుఁబల్కి నజ్జలరుహాక్షిని వీడ్కొని సిద్ధు వక్త్రమున్
గనుఁగొని నన్ను నంపితిరె ఖడ్గము నిచ్చెదరే యటంచు నా
తని బలుకత్తిఁ బుచ్చుకొని తా మణికంధరు చేతికిచ్చి యో
గ్యనియమ గంధమాల్యవతియై కలభాషిణి నిర్విశంకతోన్. 181

శక్తికి నభిముఖియై కూర్చుండెను. స్వహస్తముతోఁ గత్తినిచ్చు టేల? ప్రియునకు మనస్సంకోచము వాయుటకొఱకు సత్యమైన వలపునకు లక్షణమే యిది. తమ కెన్ని వచ్చిన నేమి? ప్రియులు సుఖంబున్నఁ జాలు: ఖడ్గప్రదానానంతరము అతని మనసు గట్టి పడునట్లుగా

"క. సమరంబున నెదిరించిన
సమదాహిత వీరవరులఁ జక్కడఁచుటనై
జము మీకునిట్టి యెడలన్
భ్రమయక చేమఱవకునికి పటు శౌర్యమునన్." 184

అని తెలిపి కలభాషిణీదేవి యతనిచేత నిరస్తజీవయాయె!

ఈ పాత్రముం గూర్చి యింత విపులముగ వ్రాసినందుకు క్షమాపణార్థమై కారణములఁ జూపవలయు. సూరనార్యుని వాఙ్మయసృష్టినెల్ల నియ్యది నిస్సంశయముగ నగ్రగణ్యము. దీనికిం దీటగు చరిత్ర మింకెయ్యదియు లేదు. శృంగార వర్ణనముం జేయుటలోను ప్రబంధముల వెఱ్ఱులేవియు వేయలేదు. నల కూబరునికై నాలుగేండ్లకన్న నెక్కువగఁ గాచియుండెఁగదా! ఇష్ట ముండినఁ జెలికత్తెలతో మొఱలిడుట, ఉద్యానవనములోఁ బడి

పొరలుట, చంద్రాది దూషణము ఇట్టి వికారచేష్ట లన్నియుఁ జేసినట్లు చెప్పియుండవచ్చును. కాని, కవి యీ విషయములఁ దలంపనైన లేదని తోఁచుచున్నది. భావనాశక్తిమై వ్రాయువారలకు మనసు పాత్రములయందు లీనముగనుండుఁ గావున సహజరాగములు దప్ప నితరములు దట్టవు. మఱియు, నీ శాస్త్రీయ ఘోషలకు మధురలాలసా చరిత్రములోఁ బ్రవేశమున్నదిగాన నిట ననవసరములని కవి వానిని విడిచిపెట్టెనేమో! కారణము లేయేటనైనఁ బోనిండు! మనకు లభించినదన్నో మనసువశము గాకపోవునంత రమణీయమైన కథ. కవికిఁ గృతజ్ఞతమై సమస్కారము, రసికులకు స్వాగతమును!

## శోకాంతవర్ణన లనిషేధ్యములు

ఇంత మంచి సుందరమగు పాత్రము వర్ణనము శోకాంతముగాఁ జెప్పుట కిష్టము లేమిచేతనో, మఱి, మన కవులకుం బట్టిన దౌర్భాగ్య మతంబు కతంబుననో, మణికంధర ఖండితమస్తకయగు నా లలనాశిరోమణి కాళికాదేవి కరుణా ప్రసాదంబున "పునస్సహితమస్తకయు, నిజపురీ వర్తినియునై తన బంధుమిత్రాదుల నలరించుచు" సుమారు రెండు సంవత్సరము లుండి పిమ్మటఁ గాల ప్రాప్తమరణ యాయెనని కరుణరసప్రధానమగు నీ భాగముయొక్క సొంపును గవి వికలంబొనర్చి యుండుట భాషాదుర్దశగదా? రసములలో శోకము నొక్కటి. ఇది మాత్రము నిషేధ్య మననేల? శోకప్రధానముగా వ్రాసినఁ గవిత్వము మొక్కపోవునా? మొత్తము మీఁద భారతమే శోకాంతమఁట! దానికి రాని తక్కువ పెఱవానికి వచ్చునా?

## కల్పనాస్ఖాలిత్యములు

ఇట్టి యుద్గ్రంథమునఁ గల్పనాభంగము లుండుట చింతనీయము! కృష్ణుని భార్యలయొద్ద కలభాషిణీ నారదులు గానవిద్య నేర్చుకొనుటకై కడపిన కాలము నాలుగేండ్లు మణికంధరుఁ డంతఃపురములోనికిఁ బోఁగూడదని యేమో వానికి ప్రయాస మావంతయు లేకయ "పుండరీకాక్షుని యనుగ్రహ విశేషంబున సకల రహస్య సంగత విద్యాసంపన్నతచేత నారద కలభాషిణులయట్ల యత్యధికుండవు" భాగ్యము లభించినది! ఈ యనుగ్రహ విశేషముం బ్రయోగించి వారిని సద్యఃకాల విద్యామహనీయత ఘటించి కలభాషిణి విరహకాలమును మట్టుచేసి యుండరాదా? కృష్ణకాంతల శిక్షయు ననావశ్యకమాయె. దానితోఁ గల్పనయు న్యూనమాయె.

# తృతీయ భాగము

## మొదటి ప్రకరణము

### మధురలాలస ప్రభావతియొక్క యక్క

ఈ పొరఁబాటులంగూర్చిన ప్రస్తావములు ముఖ్యములుగావు. ఏలన, షష్ఠాశ్వాసము తుద మొదలు క్షమార్హములుగాని దోషములు దట్టముగ నుండుటచేత, వీని చింత యావశ్యకము. మణికంధరుఁడు కళాపూర్ణుఁడై పుట్టి రాజ్యముఁ జేయుచుండఁగా, నతని కొలువుకూటములో శిశువగు మధురలాలస యొకనాఁడు హారము యొక్క నాయకమణి హృదయస్థమగుటఁజేసి యా కళాపూర్ణాది పాత్రంబుల చరిత్రంబు లత్యద్భుతంబున మందలించినది. రాజు గారి కిదివఱకే యభినవకౌముది భార్య యాయెను. మధురలాలస తాను కళాపూర్ణుని భార్య యగుటకై యవతరించినదని తెలిపెఁ గావున.

“క. ఆ మధురలాలసా కథ
లేమియు శుద్ధాంతమునకు నేగకయుండన్
భూమిపతియడఁచె నభినవ
కౌముది విననేలయనుచు ఘనయత్నముతోన్.”

(కళా. అ. 6, ప. 190)

ఇది హాస్యమా ? ప్రయోజకమా ? ఎట్లును అభినవకౌముది కోపతాపములు లేక ద్వితీయవివాహమునకు సమ్మతించుచున్నది గావున నీ జాగ్రత్త యేమియుఁ బనికిరాదు !

ఇఁక కవి శృంగారమునకు దిగి పాడు ప్రబంధధోరణికిం జేరిన ముఱికినంతయు నింపైన సుగంధమని దట్టముగఁ బట్టించు చున్నాఁడు ! మధురలాలసకు యౌవనము వచ్చినది. కవితకు వచ్చినది ముదిమి ! యౌవనము వచ్చుసరికి కవి కృతమైన యంగాంగ పరీక్షయు వచ్చునుగదా ! అయమ్మ యా కాలమునఁ బెద్ద తోఁటవలె నుండెనఁట !

సీ. గురుతర స్తనకేళిగిరులును గంభీర
తరనాభి కూపమతల్లికయును
జారురోమాళి శృంగారధారానర
ణియు నంగుళీకిసలయచయంబు

సుకుమారబాహు వల్లికలును రమ్యోరు
కదళికాస్తంభ ప్రకాండములును
సులలితాధర బింబఫలవిలాసము పుష్ప
వినర పాండిమహాసవిభ్రమంబు
గలిగి పలుకులు శుకపిక కలకలముగఁ
గుంతలంబులు మధుకర కులముగాఁగ
శంబరారాతి కేళీవనంబుఁబోలె
సుదతి యపుడొప్పె నొక వింత సోయగమున.

(కళా. ఆ. 6, ప. 206)

ఈసంగతి యీమాత్రము. ఇఁక నింతలోఁ గళాపూర్ణుఁడును అభినవకౌముదీ విహారములచేతను రాజకార్యములచేతను మధుర లాలసను మరచినాడఁట! అన్ని యద్భుతముల శిశుప్రాయముననె చెప్పిన దానిని, సమీపమున సామంతు నింటఁ బెరుగుదానిని మఱచుటయట! ఈ మఱపునకుఁ గారణము కళాపూర్ణునియొక్క బుద్ధిహీనతగాదు, మఱి కవియొక్క! ఈ మఱపు రానిచో శాస్త్రీయ మగు హెయిలున కవకాశ ముండదు. అలంకార క్రమములు వేయకుండినఁ గావ్యము చెడునను భ్రమచేత రాజునకుఁ భ్రమఁ బెట్టినాఁడు! ఈ చిత్తశోష రాజునది గాదు. శాస్త్రవిధేయతంబూనిన కవిది.

ఆ మధురలాలసకో యుద్రేకము బలమైనది! ఉద్రేకలక్షణా లన్నియు మశూచి కాఁక తాకిన లేచు బొబ్బలవలె నంకురించినవి! మొగము తెల్లబాఱినది. ఉండుకొంచెము మతియుఁ బోయినది! "ఒక్కతెఁ బిల్వఁబోయి మఱియొక్కతెఁ బేర్కొని బిల్చు" నఁట! "ఒకెక్కడ కేగఁజూచి మఱి యొక్కెడ కేగు" నట! భోజనశాలకుఁ బోవుదమని లేచి పెరటితట్టునకు మఱచినట్లు వెళ్ళునేమో! పురుషునితో మాటలాడి యుండకపోయినను,

సీ. ఏమి కన్నులఁగన్న హృదయేశు రూపంబు
దోఁపక యదిమున్ను దోఁపకుండె
నేమి వీనుల విన్న హృదయేశు మధురోక్తి
తోపక యది మున్ను దోపకుండె.

(కళా. ఆ. 6, ప. 214)

ఈ గారిడీతంత్రము అమానుషము! పైశాచముగావచ్చును! ఇట్లనేక విధంబుల రేవగలును జాగ్రత్సుషుప్తులఁ గామవికారముల

నాచారము రీతిఁ బ్రకటింపఁ జొచ్చినఁ జెలికత్తెలు వెఱఁగంది మామూలు విచారణలకు బ్రారంభించిరి. ఈ చెలికత్తెల విషయమై నాకొక సందేహము! యజమానురాలి యుడుకుఁ బొడఁగనువేళలఁ దమకుఁ గొంత కాఁక యెక్కదాయేమి? వీరి కష్టము నరయు కవులు లేరుగా! వారు ప్రతిక్రియఁ జేయుటకై" శుద్ధముగ నుప యోగములేని చికిత్సయని ప్రబంధములవలన దెలిసియుండియు నామె నుద్యానవనమునకుం దోడ్కొనిపోయిరి.

ఇది మొదలు కవి గతానుగతికముగా వ్రాయుచున్నాఁడేగాని, స్వబుద్ధి పొంతఁబోవునట్లు గానము. భావములు నవ్యములు గావు. రుచిరములుఁగావు. పాటప్రాఁత. మాటరోఁత! మధురలాలసయుఁ దత్సఖులును జలక్రీడలాడిరి. దేహమునకు శాంతమే మోగాని యాడిన తరువాత "నవీనవస్త్రాభరణ గంధమాల్యంబుల నలంకృత లైరి". సరియే కాని ఈ భారమగు వస్తుసామగ్రి నెవరు మోచికొని తెచ్చి సిద్ధముగ నిడిపోయిరో పత్తాలేదు! అప్పుడు రాజుగారు తటుక్కున వచ్చిరి. ఇఁక రాకున్న వారికీకన్నె జ్ఞప్తికి వచ్చుటెట్లు? తిక్క బలియుటెట్లు? సరి. పరస్పరదర్శనము సంప్రాప్తము

చ. వినుకలిచేతమున్ మిగుల వింతలు గాగ విరాళిఁగొన్న య
వ్వనజదళాక్షి యట్లు దనవల్లభురూపముఁ గన్నులారఁగాఁ
గనుఁగొని……………….."

(కళా. అ. 6, ప. 239)

అని యున్నది. దీనికిఁ బూర్వమెన్నఁడును జూడకున్న గళా పూర్ణుఁడని గుర్తెట్లు గలిగె? మఱియు,

"ఏమి గన్నులఁగన్న హృదయేశు రూపంబు
దోఁపక యదిమున్నె దోఁపకుండె"

నని పూర్వమే యాపె యుపద్రవముంగూర్చి వ్రాసియుండు టం జూడ కన్నులఁ జూడకమున్నె హృదయమున రూపమావిర్భ వింపఁగల వింతమానిసియో యీ మదాశయపుత్రి! లేక చిత్రఫల మేమైన నీ వినోదముల కాధారముగా నుండునా! ఊహ్యము. కళాపూర్ణుఁడు "ఎట్టకేలకుఁజనియె దిరిగి". ఈ ముద్దరాలును తియ్యని పచ్చి పచ్చి యోజనులకుం దొడంగుచున్నది! "ఇంకెట్టు లమ్మా! తోఁట కేల పిలుచుకొని వచ్చితిమే? ఆరామములు మన్మథపక్షములు గదా!" యని చెలులెల్ల నొక చిన్న లెక్చరు వేయునప్పటికి నంగనామణియు,

క. ...............అంగజతాపం
బున నుస్సురుస్సురనుచుం
గనురెప్పలు దేలవైచి కడుసొలయుటయున్.

(కళా. ఆ. 6, ప. 249)

ఇఁక శైత్యోపచార ప్రారంభము !

సీ. విరిదమ్మి తావులు వెదఁజల్లు కొలనిచెం
గటఁగమ్మ పన్నీటి కాలువలును
గడు నివతాళించు కప్రపుటనఁటుల
యిరవులఁ బూవుఁ జప్పరముఁ బన్ని
వట్టివ్రేళ్ళను దడిగట్టి శ్రీగంధపు
టనలునమెత్తి తదంతరమునఁ
కర్పూరవేదికఁ గావించి చల్లని
చెంగల్వరేకుల సెజ్జఁదీర్చి
చిలుకుదేనియతోడి గొజ్జంగిపూవుఁ
దలగడయమర్చి యందు నా జెలువనునిచి !
జగతిఁగల సర్వశైత్యోపచారవిధులు
నలిపిరందును గడఁగాన కలసిరంత.

(కళా. ఆ, 6, ప. 251)

ఈ పద్యములోని విశేషములఁ దలచుకొన్న నాకు గుండియ లదరుచున్నవి ! అబలలు, పూఁబోండ్లు, కోమలాంగులు అనఁబడు సఖీజనములు, గున్నయేనుగులవంటి యిరువదిమంది కూలివాండ్రు చేయుటకన్న నెక్కువ పనిని ఇంత త్వరలో నేలాగునఁజేసి ముగించిరి ! కార్య మెంతసేపుపట్టెను ? అదివఱకు నంగనామణి సొలసియే యుండెనా ? లేదా, శాస్త్రప్రకారము మంచిలగ్నము చూచి యీ వేళకు నామె మూర్ఛపోవునని యెఱింగి యాక్రియ లన్నియు ముందునాఁడే తయారుచేసి యెదురు చూచుచుండిరా ? నాకుంజూడ నిట్టి పద్యములు కవులు తొలుతనే వ్రాసిపెట్టి పిమ్మట నది యే కథయైననేమి, యక్కడక్కడఁ దూర్చి పెట్టుదురేమో !

ఉ. ........................
............పూవిననకఱ్ఱలు గొజ్జఁగినీట మాటికిం
దొప్పగఁదోఁచి పీచుచుఁ జనుంగవపై, వరకాళ్ళఁ, బాణులన్
లప్పలు గాఁగఁ జందనమలందుచుఁ గొందలమందిరందఱున్. 252

ఏమి సౌకుమార్యము! ఇతరులు దేహమునట్లు తోముచు గుజ్జుమును మాలీసుచేసినట్లు చేయుచుండఁగా సంతోషముచే సకిలించు గుణము గలుగవలయునన్న పాలియగాండ్ర యిండ్లలో నవతారమెత్తవలెను! లేకున్న నట్టిగడుసుదనము అరిది. ఆ సంగతి యట్లుండనిండు. ఈ యుపచారములు నపచారములు జరుగుచుండఁగా నందఱు 'గప్‌చుప్' అని యూరకుండిరి. మాటలేదు. అవి ముగిసినదే మౌనముద్రఁ బగులఁగొట్టి చిలుకలవలెఁ గిలారింప సాఁగిరి. "అయ్యో! అమ్మా! చెప్పవే నీకష్టము ప్రాణసఖితో" నని యొక నంగనాచి ప్రార్థింపఁగా (ఇదివరకును ఏమియుఁ దెలియకయా యిన్ని దోహదములు చేసియుండుట?) మధుర లాలస యెట్లో మనసును నాలుకను దృఢపఱుచుకొని యేమనుచున్నది.

ఉ. ఓ హరిణాక్షి నీకు నిఁక నుల్లముదాఁపఁగ నేటికిన్ జగ
న్మోహనమూర్తితోడ నటమున్నొక నాఁటినిశన్ విలాస స
న్నాహముమీఱ మద్విభుఁడు నా కలలోపలవచ్చి తేర్చెఁగా
మాహవకేళి నద్భుత సుఖైకమయంబది యేమిచెప్పుదున్! 261

కులస్త్రీలు? ఒక్క యుషాదేవి చూపిన దారింద్రొక్కు గొఱ్ఱెలు! ఇట్టి యేడ్పు నెవరైన నొకరేడ్చిన సంగీతముగా నుండును. అందఱుఁ గూసినఁ బెద్దరోఁత!

"ముదితా చలువలు గిలువలు
మదికి నసహ్యంబు లతని మన్ననఁ దక్కన్."

అనుచున్నది. అట్లయిన మొదలే యేలవలదనరాదు! చెలికత్తెలు గసియెత్తునట్లు శ్రమపడుచుండఁగా హాయిగాఁ బండుకొని వేఁడుక చూచుట న్యాయమా?

ఇట్లు వీరు రహస్యములు మార్చుకొనుచుండఁగా వెన్నెల యయ్యెను? నాకు నిక్కడ నొక ధర్మసంకటము. ఈ కాంతాతిలకముల జాతియేమి? ఏమి విపరీతపుఁ బ్రశ్నయందురో! నా శంకకుఁ గారణములఁ బరీక్షింపుఁడు. జలక్రీడకు నెంతయాలస్యమైనను మధ్యాహ్నము 1 గంటకు వచ్చియుందురు, ఆ వెనుక చలి దుర్భరము గావున, పుష్పాపచయాది లీలలు, అంగనామణియొక్క వికారములు, సఖీజన రాజకుమారికా ప్రశ్నోత్తర మాలికలు, ఇవి నడచుసరికి చంద్రోదయము. పున్నమనాఁడనుకొన్నను అరు ఆరున్నర గంటలకుఁ గదా చంద్రుఁడు పొడచూపియుండును.

ఇంతసేపు ఎదిగిన కూఁతురు, భోజనాదులకు రాక, యెక్కడనో ద్రిమ్మరుచున్న, హిందూజాతి తల్లులు ఆయుధపాణులై, అనగా పొరకను, చేటను దాల్చి, రోయుటకు వెన్నాడక యూరకుందురా? అట్లుండిరేని వారు హిందువులా? మనువు నోటిలో మన్ను వేయుటకుఁగదా యిట్టి దురాచార వర్ణనము.

ఉ. కావునఁ జంద్రుగింద్రుఁ జిలుకం గిలుకం బికముం గికంబు నన్
గావుమటంచు వేఁడకుఁడు నాబ్రదుకీ రిపుజాతికిం బ్రియం
బే వివరింపమీకుబలెఁ బెంచినవారికి ముద్దు గాక పె
న్బావురుఁ బిల్లికిన్ గలుగునా మొగమాట మొకింతచిల్కపైన్. 217

ఇది కడమాట బజారులో తుదబేరమందురే, యట్టిది!

చూడుఁడు! వేశ్యయైన కలభాషిణి రాజకులములోఁ బుట్టినందున నెట్టి యపభ్రంశములకుం బాలాయెనో! మనదేశములోఁ గులస్త్రీలకన్న వారకాంతలే యుత్తమలనుటకిదియొక తార్కాణము. మన యిల్లాండ్రు ఏకత్తెలుంగారు. వంటకత్తెలు దప్ప! విద్యయు, స్వయంవరణముఁ గలవారుగాన, గణికలు సౌమనస్యమున మిన్నలు, తక్కినవారి బ్రదుకెట్టిది? శారీరక క్రియలచే నిండినది. ప్రబంధములలోని శృంగారము ఉత్తమమైనదిగాదు. ఈ నాయికానాయకులు తాపోద్దీపిత దేహులుగాని బాధిత మానసులుగారు. బాల్యవివాహ వినాశిత దేశములో శృంగారానుభవము లాఘవమగు టేమివింత?

సంభాషణమూలముగ కథకు నభ్యుదయపరంపరలఁ గల్పించుట మొదలగు కవితాశక్తులన్నియు నీ ఘట్టములకు వచ్చుసరికి సూరన్నలో నుండక లేచిపోయినట్లున్నది. ప్రతిభలేని పాడుకొంపలీ భాగములు!

అంగనామణిని బట్టిన బాధలన్నియుఁ బురుష వృషభునిఁ గూడ బట్టినవి. అతఁడు నర్మసచివు నొక్కని సంపాదించి గుసగుసలాడెడిని. కాఁబోవు నిల్లాలి యంగాంగముల వినువారికి నోరూరఁగ వర్ణించుట మొదలగు దుస్సహతంత్రము లెన్నియేనిఁ గలవు. ప్రియురాలిని దుష్యంతుఁడు మఱచినట్లు కాళిదాసుఁడు వర్ణించిన రీతితోఁ గళాపూర్ణుని మఱపుకథను బోల్చిచూచిన, నీ సందర్భమున సూరన్న కవిత్వమెంత శుష్కించినదో తెలియును. పెండ్లి వ్యాపారము. ఆపె చెలికత్తెలు ఈయన సచివులతో మంతనమాడి ముడిగట్టుటకు నేర్పాటులు చేయుదురు! వలపనుదానిని ఉప్పును

బప్పునుంబలె నంగడిలోఁ బెట్టి విక్రయించుట యీ కర్మభూమి యొక్క మహాధర్మము! కళాపూర్ణుఁడు మధురలాలసను బెండ్లి యాడుటకై యభినవకౌముదమ్మగారి యనుమతిని దానే కోరుట లేదు. రాయబారులను బంపుచున్నాఁడు! భార్యాభర్తలకును మధ్యస్థమా? ఏమీ! భార్యకు పురుషుని పడుకలోనేగదా పాలు! మనసులో లేదుగదా! అభినవకౌముదికి సరేయనుటదప్ప నింకే స్వాతంత్ర్యమున్నది! వివాహము తటస్థమయినది. ఆ శుభకార్య ములో "పెద్దపూఁబోండ్లు" రాకపోకలు చేసిరట. ఎంత ముసలి వారైనను పూఁబోండ్లే! శైలియు వ్రాలుచున్నది. పెండ్లియైనది.

## అసహ్యశృంగారము

వధూవరు లేకాంతము గోరుచున్నారు. చెలికత్తెలు గొంచె మున వదలరు. కవియన్ననో యీ సమయమునఁ బ్రాణముఁబోయి నను వారిని వదలఁబోఁడు! ప్రథమవిఘ్నము తల్లి. అవసరముగా వెళ్ళుచుండఁగా కూఁతును నిలఁబెట్టి యాపెకు బుద్ధివచ్చునట్లు ఇచ్చిన యుపన్యాసము ఒకగంట దీర్ఘము! అంగనామణికి తాల్మి లేనితమిచేఁ గలిగిన తబ్బిబ్బులఁజూచి జరగఁబోవు తమాషాలం దలంచి, చెలికత్తెలు హాస్యముఁ జేయుటలో వినియోగింపఁబడిన కాలము అరగంట. అలంకార రచనాదులకుఁ బట్టిన కాలము 2 గంటలు! ఇక్కడ కవి ప్రయోగించు వైరస్యము తూనిక యగణ్యము! ఎట్లనఁగా:

ఒకటి. నిష్కారణముగ మధురలాలస "విభుండిఁక వచ్చు నెప్పుడొకొ విఘ్నము లేమయినన్ ఘటిల్లునో" యని తన కే ద్రోహముఁజేయని యభినవకౌముదిమీఁద దోషారోపణకుం దొడఁగు చున్నది! ఈ యమ్మ దౌర్భాగ్యపు విరాళిని కలభాషిణియొక్క యుదారచరితంబుతో నుపమించి చూడుఁడు! పిమ్మట "మెడికల్ కాలేజ్ ప్రొఫసర్లు" రీతిని పురుషుని శరీరభాగముల వర్ణించు చున్నది! చాలీచాలని దానికి తన పరువేర్పడునట్లు బాగుగ విడఁదీసి యాడెడుమాట వినుండు!

"తే. ఆ లలిత చరణములొత్తు కేలుగేలు
కోర్కిఁ దద్వక్షమునఁజేర్చు కుచము కుచము
దివుట దద్రహఃకథ విను చెవులు చెవులు
పలుకులేల తద్రతిఁగన్న బ్రదుకు బ్రదుకు."

పోతనామాత్యుని "కమలాక్షు నర్చించు కరములు కరములు" అను మహోత్తర పద్యమునకుఁ బట్టిన గ్రహచారవశా యీ యనుగమనము !

రెండు. చెలికత్తెలు దార్చుటకై వచ్చుట. అంగనామణికి సిగ్గునుగూడ వచ్చుట ! ఆ సిగ్గు పలాయన మౌమాడ్కి వారు,

మ. పొదియైనాథులుదారుఁ గాపురములింపుల్ మీరగాఁ జేయుచున్
గదిపెంద్రేసి కొమాళ్ళఁ గూతులఁ దగన్ గన్నట్టి యిల్లాండ్రకున్
మదిలజ్జాదులులేవె నీకుబలె సన్మానంబుతోఁ జక్కవ .... ....
చ్చెదొ యేమేఁగలదే. ... ... ... ...

ఇత్యాది వివరములఁ దెల్పుట, వినువారి చెవులు వ్రయ్యలగుట మొదలగు దారిద్ర్యములు గొన్ని !

మూఁడు. అంగనామణి యారీతి నుండఁగా రాజు గవాక్షమూలమునఁజూచి యుత్కంఠ యాఁపలేకపోవుట. దానికి గుర్తుగా నింకను గాలము వ్యయమగునట్లు, ఆపె తన్నుంగూర్చి చేసిన మాడ్కి, యాపె యంగములను మిక్కిలి విమర్శతో వర్ణించి ఋణవిముక్తుఁడగుట ! నీరసములైన యుపమలు ఉత్ప్రేక్షలును భార్యపై దీపింపఁజేయుట.

"క. సమదాక్షి మీనసంచా
రమునఁ దొలంకుచును ముఖసరస్సు లావ
ణ్యము వెళ్ళిపారఁ గ్రేవల
నమరించిన పిల్లకొలఁకు లంగనవీనుల్ !" 124

పిల్లకొలఁకులఁట ! అందులోనుండి కాఋద్రవమో ?

చ. అనుపమముల్ రతిస్మరులయాటలు నర్మములంచుఁ గప్పి పె
ట్టిన పువుబంతులీ సతి కడింది చనుంగవ తేంట్లుగ్రేవలం
దును జొరకుండఁజేరిచిన తొరపు సంపఁగి పూవుదండలీ
వినుతభుజంబు లాతుదల వేడ్కకు నిడ్డ చిగుళ్ళు హస్తముల్. 130

ఉ. మానవతీపతంనము సమగ్రనితంబ విజృంభణంబు జం
బూనదిసైకతస్థలము పొల్పువహింపుచుఁ జాలనొప్పెడున్
బై నునుమంచుపోలె వెలిపట్టు మడుంగు బెడంగుచూపనా
పై నవసారసాళిపరిపాటి నుదంచిత కాంచి మించఁగన్. 132

తే. అతివ తొడలును జఘనంబు నరసిచూడఁ
గొమరు మీఱెడు జమిలితొండముల శిరసు
తోడి వలరాచవారి యద్భుతపు హస్తి
యగ్రభాగంబు చూపఱ కాత్మఁ దోఁప. 135

చ. జలజ దళాయతాక్షి మృదుచారుతర ప్రపదద్వయీ విని
ర్మలరుచి పల్లుఘల్లుమను రత్నపుటందెలమ్రోఁత జృంభణం
బుల నవకంపుఁ గచ్ఛపము పొల్పునదల్పుచు గెల్పుఁ దెల్పెడున్
గలుగునె యింక దీనికి జగంబులలో నుపమాప్రసంగముల్. 155

ఇత్యాది. ఈ పద్యములం బట్టి విచారింపఁగా నేర్పడిన విషయములివ్వి: రాజుగారి దూరదృష్టిబలము. అంగనామణి చీర యేమాయెనో! అపె గిర్క్రలు కొట్టుచుండెఁ గాఁబోలు! లేకున్న నన్నిభాగములు గనుపడునా? ఈయుపమ లెందునకుఁ బనికి రావనియు, రోతలనియు వేఱుగఁ జెప్పవలయునా? వీనికిం గారకము భావనాశక్తిగాదు. మఱి సామ్యశక్తి. అందులోను గుయుక్తి, కాముకుఁడఁట! తాళలేనివాఁడట! ఆలోచనాశక్తిచేఁ గాని తట్టనట్టి పదునెనిమిది పద్యములు గొణఁగెనట! రసాభాసమన నిదియే గదా!

ఈ పాండిత్య మంత్రములు ముగించిన పిదప చెలికత్తెలు- వీరొక తడాఖా-అపెకుఁ గరణీయముల బోధించి, కళాపూర్ణుని "చరణంబు విలాసిని యూరువులందుఁ జేర్పఁజేసి బలిమి నావనజ ముఖిచేతఁ బట్టించి సంవాహన మొనర్పఁ జేసిరి". ఇది శుద్ధముగ అనావశ్యకము అసహ్యమును!

అయ్యో! మృగప్రాయ శృంగారమా! ఈ చెలికత్తెలు మన్మథుని పురోహితురాండ్రు!

ఈ యెడారువంటి కవిత్వములో,

తే. వరునిచిట్టంపుఁ జేఁతలఁగరము ప్రేమ
మెఱుపువోలెఁ దళుక్కన మెఱయుఁగాని
నెలఁత సిగ్గను మొగిలులో నిలువలేద
యిదియు మిక్కిలి నింపయ్యె నతనిమదికి.

(కళా. అ. 7, ప. 154)

అని పద్యముమాత్రము సూరనయొక్క నైజప్రభావమును సూచింపఁ జాలినంత రమణీయముగానున్నది. తక్కినవి భావశూన్యములు.

ఈ యాశ్వాసములంగూర్చి విక్షేపముగఁ జర్చించుటకు నా కిష్టములేదు. సామాన్య ప్రబంధముల యట్టుల యవి నిరర్థకపద్య పూరితములు. కల్పనాశక్తి యేదిక్కునఁ బోయెనో! సంభాషణ చాతుర్య మెందు గ్రుంకెనో! ప్రతిభ యెటుమాయమాయెనో! అలంకారాది శాస్త్రములయందలి మూఢభక్తి పటుతమము!

తుచ్ఛశృంగారములకు హేతువులు

స్త్రీవర్ణన చేయుటకు మనకవులకుఁ దెలియదుగాఁబోలు! కారణమేమన ఇంటిలోనుండు రసములు జిహ్వకేగాని మనసునకు వికాసము నిచ్చునవిగావు. బాల్యవివాహము, విద్యావిహీనత ఇత్యాది దురాచారహతులగుటంజేసి యిల్లాండ్రు సరసములకుం బనికిరారు. ఇఁక సరసములకుఁ దగినవారు దానిని జీవనోపాయవృత్తిగా నాశ్ర యించెదరు. వారియందు మఱుఁగు, మానము, జంకు, మర్యాద మొదలగు నుదాత్తగుణంబు లల్పంబులు. ఎట్టి హీనలయ్యుఁ గుల కాంతలకన్న మేలగుటంబట్టియే మొ వారికి 'భోగమువారు' అను పేరు గలిగె. తక్కిన యాఁడువారు భోగమునకుం దగరు. వారిం బ్రేమించుట దానధర్మము. జన్మపరిత్యాగతుల్యము!

భారత కవుల శృంగార వర్ణనము దివ్యము

పచ్చిపచ్చిగా వ్రాయుట శృంగార మెన్నఁటికిఁగానేరదు. మహాకవుల శృంగారవర్ణనములో శృంగారము, శుచిత్వము సమ న్వితములు. ఆంధ్రకవు లద్దానికి విరుద్ధంబగు భ్రమనేల దాల్చిరో! అట్లు చేయుటకుఁ గారణములేదు. ఏలన, ప్రామాణిక కవులగు కవిత్రయము వారు మంచిత్రోవను విభావించియుండు కతనమున. భారతములో గోప్యాంగవర్ణన శృంగారమునకై యెక్కడను జేయఁ బడియుండలేదని తోఁచుచున్నది. నిదర్శనముగా

నన్నయభట్టు

ఆదిపర్వములోని శృంగారపద్యముల వినుఁడు.

సీ. పలుకులముద్దును గలికిక్రాల్గన్నుల
తెలుపును పలుదచన్నుల బెడంగు
నలఘుకాంచీపదస్థలముల యొప్పును
లలితాననేందు మండలమురుచియు

నళినీలకుటిల కుంతలముల కాంతియు
నెలజవ్వనంబున విలసనమును
నలసభావంబును బొలుపును మెలఁపును
గలుగునగ్గిరికను...............
(అది. ఆ. 3, ప. 27)

క. కనకావదాత కోమల
తనులతఁ దనుమధ్యఁ గమలదళనేత్రను యో
జనగంధి నవని నాథుఁడు
గనియెను సురకన్యఁబోని కన్నియ నంతన్.
(అది. ఆ. 4, ప. 169)

ఉ. దానిశరీర సౌరభము దానివిలోల విలోకనంబులున్
దాని మనోహరాకృతియు దాని శుచిస్మిత కాంతివక్త్రమున్
దాని విలాసముం గడుముదంబునఁజూచి మనోజబాణ సం
తానహతాత్ముఁడై నృపతి..............
(అది. ఆ. 4, ప. 170)

ఉ. చారుసువర్ణహాసి నవచంపకభూషయు సిందువారము
క్తారమణీయయున్ వకుళదామవతంసయునై యపూర్వశృం
గార విలాసలీల యొనఁగం చన ముందటనున్న మాద్రినం
భోరుహనేత్రఁజూచి కురుపుంగవుఁడంగజరాగమత్తుఁడై.
(అది. ఆ. 5, 145)

సీ. త్రిభువనలక్ష్మి యేతెంచి యేకాంతమి
ట్లిలొకో యున్నది యివ్వనమున
గగనమణిప్రభ గగనంబునందుండి
యవనీతల ప్రాప్తమయ్యె నొక్కొ
శంభుండు లావణ్య సద్గుణ సముదాయ
మింద యిమ్ముగ సంగ్రహించె నొక్కొ
దీనియంగమును బొందిన యివ్విభూషణ
శ్రీయేమి పుణ్యంబుఁ జేసెనొక్కొ
యమరకన్యయొక్కొ యక్షకన్యకయొక్కొ
సిద్ధకన్యయొక్కొ శ్రీ సమృద్ధి
సర్వలక్షణ ప్రశస్తాంగి యిది దివ్య
కన్యయగు ననంత కాంతి పేర్మి.
(అది. ఆ. 7, ప. 72)

ఉ. నెఱికురులున్ విలోలసితనేత్రయుగంబును నొప్పులొల్కు వా
తెఱయును దీనియాననముఁదెల్పు గరంబు మనోహరంబు నా
యెఱిఁగిన యంతనుండి నతినిట్టి లతాలలితాంగిఁజూచి యే
నెఱుఁగ సురేంద్రకన్యకలు నిట్టిరె రూపవిలాస సంపదన్.

(ఆది. ఆ. 7, ప. 77)

ఇందు తొడలు, మీఁగాళ్ళు ఇట్టి గూఢార్థములు లేవు. అవి గల సందర్భము లాదిపర్వమున మృగ్యములు.

ఎఱ్ఱాప్రెగ్గడ

ఎఱ్ఱాప్రెగ్గడ వ్రాసిన యరణ్యపర్వ శేషములో ద్రౌపదీహరణ ఘట్టమున నుండు పద్యములు :

"ఉ. నీలపయోదమండలము నిశ్చలలీల వెలుంగఁ జేయుచున్
గ్రాలెడువాలు గ్రొమ్మెఱుఁగు కైవడిఁ దద్వనభూమియంతయున్
లాలితదేహకాంతి పటలంబులఁజేసి వెలుంగఁజేయు న
బ్బాల వినీలకుంతల విభాసినిఁజూచి సవిస్మయాత్ముఁడై."

(ఆది. ఆ. 6, ప. 541)

ఉ. లీలయెలర్పఁగా నబలలేఁజిగురాకును బోలె నొప్పు కెం
గేలు కదంబశాఖతుదిఁ గీల్కొనఁజేసి వసంతవిభ్రమో
న్మీలితబాలవల్లిక్రియ మేలగు చూడ్కుల కించి పావక
జ్వాలయపోలెఁ జిత్తము నిజం బెరియింపఁ దొడంగెఁ జూచితే.

(ప. 148)

సీ. మగృనేత్రవారుణ మృగసమాకులమైన
యివ్వనాంతరమున నేకతంబ
యిట్లు నీయున్కికి నెయ్యది మూలమి
వ్వనదేవతవొ సురేశ్వరునితోడ
నలిగి ధరిత్రికి నరుగుదెంచిన శచీ
దేవివో హరియురస్థితుఁ దొరంగి
కేళిఁ గ్రుమ్మరు పద్మగేహవో భవదీయ
జనకత్వమున సముజ్జ్వలితుఁడైన
పుణ్యుఁ డేవంశమునవాఁడు పొలఁతి నీదు
జీవితేశ్వరుఁడగు సుఖజీవితాత్ముఁ
డెవ్వఁడబల నీ నామమై యింపు మిగుల
శబ్దమెయ్యది నాకు నిజంబుఁ జెపుమ.

(అర. ఆ. 6, ప. 151)

హనుమంతుఁడు సీతాదేవిని వర్ణించుట :

సీ. కన్నీరు జడిగొని క్రమ్మఁ బ్రాకెక్కిన
గద్రమకపోల భాగములు గలిగి
యవశమై యొరఁగిన యంగవల్లిక పొంత
నున్న భూమీరుహ మ్మూఁతఁగాఁగ
వెడలు నిట్టూర్పుల వేఁడిమిఁ బగిలిన
యధర పల్లవము గారాకుఁబోల
దలఁపుల నందడి దందడించినదాల్మి
కదలు శిరఃకంపగతుల బెరయ
నున్న పుణ్యమూర్తినుత్తమసౌందర్య
నవనతాస్య నార్తయైనదాని......... (అర. ఆ. 7, ప. 28)

## తిక్కన్న

విరాటపర్వములోఁ దిక్కన్న వ్రాసిన శృంగారవర్ణనము అనన్య సాధ్యమని వేఱుగఁ జెప్పవలయునా? ఔచిత్యశోభితము. చెనటియగు కీచకు నట్టివాఁడు సైతము నిజంబగు ననురాగ ప్రభావంబునం జేసి కళాపూర్ణాదుల కన్న మేలుగ సిగ్గులేని విధమునఁ గాక గఱువతనంబునఁ బలికెడు. నిక్కువమైన ప్రీతియున్ననే స్త్రీనింగూర్చియైన నసహ్యకరములగు వర్ణనల మృగప్రాయులు గాని వారెవరైనఁ జేయుదురా? విరాటపర్వములోని యా పద్యము లన్నియు నుదహరించెద. లేకున్నఁ బక్షపాతమను నపవాదమే గాక, తిక్కన తెలిసి వ్రాసినాడో గ్రుడ్డియేటుగా వ్రాసినాడో యనియుఁ గొందఱు శంకింపనగు అన్నింటిని నివేదించిన నేశంకకు నవకాశముండదు.

ద్రౌపదియొక్క సైరంధ్రీవేషము :

సీ. పఱిమొయిల్గప్పినఁ బాడఱి నునుఁగాంతి
గదలిన యమృతాంశు కళయనంగఁ
బెనుమంచుమీఁద బర్విన వికాసము దప్పి
చెలువుగుందిన సరోజిని విధమున
ధూమంబుపొదవినఁ దుఱఁగలి మెఱుఁగులు
నలఁగిమాసిన దీపకళిక పగిది
ధూళిపైఁ బొరసినఁ దొంగలించుటమాని
లావణ్యమెడలిన లతిక మాడ్కి

గంధకారికావేషంబు కతనమూర్తి
యుజ్జ్వలత్వంబు మఱువడియుండఁ బాండు
తనయమహిషి.................. (విరా. ఆ. 8, ప. 294)

నగరులోఁ జొచ్చు లీల :

సీ. పదతలంబుల కెంపు పరఁగినతలము కుం
కుమలిప్తమైన చందము వహింప
నంగంబునునుఁగాంతి యడరిన గోడలు
వేదులు మణిమయవిధమునొందఁ
గనుఁగవ మెఱుఁగులు గదిరిన ముందర
పుష్పోపహారంబు పొలుపుదాల్ప
వేనలికప్పుపర్వినమీఁదు నీలదు
కూలంబు మేల్కట్టు కొమరు వడయఁ
దానుజొచ్చినకతన మత్స్యక్షితీశు
నింటనిమ్మెయిఁ గ్రొత్తయొప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ కల్లనల్లఁ
బాండురాజతనూభవ పత్నియరిగె. (విరా. ఆ. 1, ప. 308)

కీచకుని ద్రౌపది వర్ణన :

సీ. ఇయ్యింతి ప్రాపున....................
కుసుమబాణుని బాణముల్గూఢనైదు
గరఁగి నేరిమినాటించి కరువుగట్టి
పోసిచేసి చైతన్య సంపుటముఁదగ ఘ
టించిరో కాక యిట్టి చేడియలుగలరె. (ఆ. 2, ప. 27)

ద్రౌపది స్థితి :

సీ. వెఱవక ననుఁజూచె వీఁడనియెదఁ గలు
షించిన నొండొండ చెమట వొడమ
ననుచిత కృత్యంబు లాచరించు విధాతృ
బలిమికి నివ్వెరపాటు దోఁప
నిచ్చట దిక్కులే రెవ్వరు నాకను
భయమున మేనఁ గంపంబు పుట్టఁ
జేయఁగ నేమి యుపాంబులేమి నా
ననమున వెల్లఁ దనంబుగదుర
నున్న పాంచాలిఁ గనుఁగొని..........

(ఆ. 2, ప. 33)

కీచకుని యుత్కంఠ :

సీ. తన్వంగి మవ్వంపుఁ దనులత నెసఁగెడు
నునుఁగాంతి వెల్లువ మునుఁగఁ బాఱఁ
గిసలయహస్త కెంగేల నేపారు క్రొ
మ్మించను లేయెండ మిగులఁ బర్వ
గమలాస్య ముద్దు మొగంబు లేమెఱుఁగుల
మొత్తంబు సరిచుట్టు ముట్టికొనఁగ
ధవళాక్షి తొంగలితఱుచు ఱెప్పల చెన్ను
కప్పను చీకఁటి గవియుదేర
బెగ్గలంబంతకంతకు నగ్గలింప
నొదవు చెమటతోఁ జిత్తంబు సెదరి యొందు
మెలఁగఁ దలఁపేది యా సింహబలుఁడనంగు
పట్టి యాడెడు జంత్రంబు పగిదినుండె. (ఆ. 2, ప. 37)

సీ. తెలిగన్నుఁ గవకాంత పొలుపార నించుక
గనువిచ్చి చూచినఁ గాదె యబల
చెలువంపు నెమ్మోము నెలమి సొంపినుమడి
గా నల్లనవ్వినఁగాదె యింతి
దంతమౌక్తికరుచి దలకొన మరుమాట
పలికినఁగాదె యుత్పల దళాక్షి
యుల్లంబు సరసత దెల్లంబుగా లీలఁ
గైకొన్నఁ గాదె పంకరుహ వదన
యనుచుఁ జూచుఁ జేరు నమ్ముగ్ధ పలుకులు
వినఁగఁ గోరుఁ గేలు దనదుకేలఁ
గీలుకొలుపఁ దలఁచుఁ గీచకాధముఁడు ని
జానురక్తిఁ దెలుపనప్పళించు. (ఆ. 2, ప. 45)

సీ. సుదతి నీమై చక్కఁ జూచుట కోడెదఁ
గనుచాటు పొరయునో యని తలంచి
మదిఁ బొనర్చినమాట మగువనీ పెంపునఁ
గుదిసి నా నాలుక తుదికిరాదు
పడఁతి నీ కరములుపట్టఁగ దివిరి శం
కించి వడంకెడుఁ గేలు సూడు
నెఱినిట్టిదని యింతి నీ నెమ్మనంబెన్ని
భంగుల సరసినఁ బట్టువడదు

చెలువ యింక నొక్కించుక సేపు నీవ
నాదరంబున నెప్పటి యట్లయున్న
మన్మథుఁడు సమయించిన మగుడనన్నుఁ
బడయవచ్చునె యెన్ని యుపాయములను.

(అ. 2, ప. 4)

కీచకుఁడు ద్రౌపదిని ముఖస్తోత్రము చేయుట :

సీ. నెత్తమ్మిరేకుల మెత్తఁదనముఁదెచ్చి
యచ్చునఁ బెట్టినట్లంద మొంది
చక్రవాకంబుల చందంబుఁ గొనితెచ్చి
కుప్పలు సేసినట్లొప్పమెఱసి
చందురునునుఁగాంతి కందేర్చి కూర్చి బా
గునకుఁ దెచ్చినయట్లు కొమరు మిగిలి
యళికులంబులకప్పుఁ గల యంతయును దెచ్చి
నారు వోసిన భంగి నవక మెక్కి

యంఘ్రితలములు గుచములు నాననంబుఁ
గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి
యనుపమాన భోగములకు నాస్పదంబు
గాదె యీ త్రిప్పులేటికిఁ గమలవదన. (అ. 2, ప. 52)

సుధేష్ణ కీచకుని మనసు మరల్పఁ గోరి చేసిన కాంతాజన వర్ణనము.

సీ. లలితంబులగు మట్టియల చప్పుడింపార
నంచకైవడి నడనల్లవచ్చి
యెడమేనినెత్తావి సుడియంగఁ బయ్యెద
నగము దూలించిపై మగుడఁ దిగిచి
సోలెడు నెలదీఁగె లీలఁ గ్రాలుచు వింత
చెలువంబు దలకొనఁ జేరినిలిచి
తెలిగన్నుఁ గవకు నెచ్చెలియైనలేఁత న
వ్వొలయంగ నరసంపుఁ బలుకు పలికి

మెఱయు చెయ్యులరాగంబు మెయికొనఁగ
నెడఁద సొగయించుమాటల నెలిమి మిగుల
నిన్ను ననురక్తిఁ గొలుచు నన్నెలఁతలుండ
నీరసాకార సైరంధ్రిఁ గోరఁదగునె.

(అ. 2, ప. 64)

కిచకుని ప్రత్యుత్తరము :

సీ. గండు మీలకుఁ బుట్టి కాముబాణములతో
గలసి యాడెడు నట్టి కన్నుఁ గవయు
బినకాండముల శిక్షఁబెరిగి లేఁదీఁగల
మెచ్చకయున్నట్టి మృదుకరములుఁ
జిగురులతో నంధిసేసి యంబుజముల
పైనెత్తి చనునట్టి పదతలములుఁ
గలకంఠముల చేతఁ గఱచిన విద్య వీ
ణలకిచ్చునట్టి తిన్నని యెలుంగు
నత్తెరంగున రేఖయు నవ్విధంబు
గరువచందంబు నమ్మెయి కలికితనము
నట్టి చెన్నును సైరంధ్రియంద కాక
కలవె యొరులకు నెఱుఁగక పలికి తబల!

(అ. 2, ప. 67)

కీచకోత్కంఠ :

సీ. లీల నాముందట నాలేమ పొలసినఁ
జూడ్కికిఁ జుబ్బన చూఱిగాదె
కనువిచ్చి నన్ను నాతనుమధ్య సూచినఁ
దనువున కమృత సేచనముగాదె
చిరునవ్వు బెరయ నచ్చెలువ నాతోడఁ బ
ల్కినఁ జెవులకు రసాయనముగాదె
యెలమి నన్నెలఁత నన్నెలయింపఁదివిరిన
నెడఁద కానందంబు నిక్కగాదె
యానితంబిని మక్కువ ననఁగి పెనఁగి
యింపు పొంపిరి వోవ నన్నేలుకొనఁగఁ
దలఁచి పొందిన నది జన్మఫలముగాదె
యనుచు వలరాజు బారికి నగ్గమయ్యె.

(అ. 2, ప. 86)

కీచకు దర్శనంబున ద్రౌపది యవస్థ :

సీ. దైన్యంబు తలపోఁతఁదలకొన్నఁ జెలువ కా
ననమున వెల్లఁదనంబుగదిరె
భయరస వేగంబుపైకొని ముట్టినఁ
గాంతకుఁ దనులతఁ గంపమడరె

బెగడంతకంతకు మిగిలిన నింతికిఁ
బదముల నట త్రొటుపాటు బెరసెఁ
దల్లడం బొందినఁ దన్వికి నవయవం
బులనెల్ల ఘర్మాంబుకళిక లెనఁగెఁ
దలఁకువుట్టెఁగొంకుకొలఁదికి మీఱె నెం
బాటుదోఁచె ముట్టుపాటు దొడరె
వెఱఁగుపాటు దనికె నెఱనాడె నొవ్వనె
వ్వగలువగల నీనె దిగులు వొదివె.

(అ. 2, ప. 106)

కీచకుఁడు దీనుఁడై ప్రార్థించుట :

సీ. కాంతి దళ్కొత్తు నీకడగంటి చూడ్కితోఁ
బొందఁ గానని మేను పొగులుటయును
దీపారు నీ పల్కు దెల్లంబుగా వినఁ
గానని వీనులు కందుటయును
నింపగు నీచెయ్వు లెలమిమైఁ గొనియాడఁ
గానని కోర్కులు గలఁగుటయును
సొగయించు నీకేళిఁ దగిలి యానందంబుఁ
బొందఁ గానని మది గుందుటయును
బాయ నాదగు జన్మంబు ఫలమునొంద
భావజన్మని పూనిక పారమెయ్య
నన్ను బంటుగా నేలుము నలినవదన
యింక నీసిగ్గు దెరయోలమేల నీకు.

(అ. 2, ప. 138)

పరిభవానంతరమున :

సీ. ఎలదీఁగఁ గప్పిన లలితపరాగంబు
క్రియ మేన మేదినీ రేణువొప్పఁ
జంపకంబున నవసౌరభం బెనఁగెడు
కరణి నాసిక వేఁడిగాడ్పు నిగుడఁ
దోయజదళములఁదుది మంచుదొరఁగెడు
గతిఁ గన్నుఁగవ నశ్రుకణములురుల
నిందు బింబముమీఁది కందుచందంబున
గురులు నెమ్మొగమున నెరసియుండ
సర్వజనవంద్యయైన పాంచాలి సింహ
బలునిచే నివ్విధంబున భంగపాటు

దనకు వచ్చిన నెంతయు దైన్యమొంది
యవ్విరాటుని సభఁజేర నరిగి నిలిచి.

(ఆ. 2, ప. 138)

కీచకుండు ద్రౌపదీ సమక్షంబునఁ జేయు బాలిశచేష్టలు దుర్విలాపంబులు నెంత సహజములు! చూడుఁడు:

సీ. ఎవ్వనితోనైన నెలుఁగెత్తి యొక్కింత
పనిలేని వెంగలి పలుకుఁ బలుకు
మట్టియ లొండొంటి బిట్టుదాఁకఁగ
నేల నందంద మునిగాళ్ళ నప్పళించుఁ
గడువికారంబుగా నొడలెల్ల విఱుచుచు
మలఁగి రిత్తకురిత్త సెలఁగి నవ్వుఁ
దాళంబుగాఁ గరతలమునఁ బెలుచఁగం
బంబు వ్రేయుచు వెడపాటఁ బాడు
మలయు నంతంతఁ జేరవఁబొలయు నింతి
దన్నుఁ జూడమి కెంతయుఁ దల్లడిల్లు
నిక్కడక్కడ వఁడుఁ దగు లినుమడింపఁ
జూచు నత్తన్విఁ జొరిఁ బొరిఁ గీచకుండు.

(ఆ. 2, ప. 250)

కీచకుని పశ్చాత్తాపకరమగు మహావస్థ:

సీ. వామాక్షిరుచిర లావణ్యంబు భావించుఁ
దన్వంగి రూపు చిత్తమున నిలుపుఁ
గంబుకంధర చెన్నుకైవడిఁ దలపోయు
నంగన సౌకుమార్యముఁ దలంచు
భామిని సహజ విభ్రమమెదఁ గీలించుఁ
బడఁతి చెయ్వులు మదిఁ బట్టుకొలుపు
మానిని గరువంపు మాట పొందూహించు
దళితాబ్జముఖి తిన్నఁదనము మెచ్చు
నడరి కోర్కులు చిట్టుముట్టాడ వెడఁగు
పడిన యుల్లంబు పట్టునఁ బఱుపఁ దనకు
వశముగాకున్న నెంతయు వంతనొందుఁ
జింతయెనకంబు వడిగొని చిక్కువఱుప.

(ఆ. 2, ప. 259)

సీ. పొడసూపినట్లయిన వడిఁబట్ట సమకట్టి
పరికించి కానక బమ్మరించు
మెలఁగినయట్లయినఁ బలికింపఁ దలఁచి ని
రూపించి లేమి నశ్రులు వహించు
గదసిన యట్లయినఁ గౌగిలింపఁ గడంగి
యారసి బొంకైన నలఁతనొందు
నొడఁబడ్డ యట్లయిన నడరిపైకొనఁ జూచి
చెన్నఁటి యగుట నిశ్చేష్టఁ బొరయు
లలిత వివిధ విహారంబులకు లతాంగి
యెలసి పొలసిన యట్లయిన నెలమిఁగలసి
యభిమతక్రీడ నలుపంగ నప్పళించి
వెదకి రిత్తబయల్గని విహ్వలించు.

(అ. 2, ప. 301)

ఉద్యానవనవిహార ఫలము :

సీ. ఇంపైన ప్రియకాననిచ్చి విల్చినమథు
వాదట నాను ముత్తాళివిభునిఁ
జెట్టుపల్పచరించి చుట్టుఁ గ్రుమ్మరి మనో
రమ నియ్యకొలుపు మరాళవిభుని
ఫలరన మొండొంటి కెలమిఁ ఇంచులనిచ్చు
మెయిన చొక్కెడు శుకమిథునములను
గమిబాసి తలిరు జొంపమునకు మెయిమెయిఁ
దాఁకంగఁ జనుపికదంపతులను
జూచి చూచి యుల్లంబున నేచి కోర్కు
లడరఁ జిడిముడిపడు బ్రమాను పడు వెడంగు
పడు వెనుంబడుఁ దల్లడబడుదురంత
చింత బారికి నగపడు సింహబలుడు.

(అ. 2, ప. 306)

కీచకవధానంతరమున జయశీలయై పాంచాలి సుధేష్ణం జూడ బోవునప్పుడు :

సీ. ముదమున నెలమి సొంపాదవి నెమ్మొగమునఁ
దోఁపంగవచ్చినఁ ద్రోచిత్రోచి
లలి నుల్లసిల్లుచు లలితలోచన దీప్తు
లడర నుంకించిన నాఁగి యాఁగి

సంతసంబున బాలిశములగు చెయ్వులు
దొడరఁ జూచిన జేయ కుడిగి యుడిగి
మనమున నుబ్బుమై మాట నాలుకకురాఁ
గడఁగిన నాడక కడపి కడపి

ధీరయై యిట్లు సమ్మద పూరమునకు
గరువతనమును బలితంపుఁ గట్టకట్టి
వెలఁదియెరుఁగని యదివోలె వికృతిలేక
యల్ల నెప్పటి యట్టుల యరుగుటయును.

(అ. 3, ప. 56)

ఉత్తరంగూర్చిన పద్యములు నిట్టివ. ఆంధ్రమున శృంగార వర్ణనము తిక్కనయంత మనోహరముగఁ జేసినవా రెవరును లేరు. శుచి సౌందర్యములు నిత్యసంయోగములు. వీరకావ్యములో నించుక సందర్భ మలవఱిచికొని యింతచేసిన ప్రతిభాశాలి శృంగార కావ్యమే వ్రాసియుండిన దాని రామణీయకము హృదయమున లయించునట్టి లావణ్యము గలదిగానుండదా? ఒకవేళ నేకరస ప్రధానమగుట నతియను దోషంబునఁ దానుం బడియుండునా? చెప్పలేము. ఇట నుదాహృతములగు పద్యములఁ జదివి నేత్రముల హర్షాశ్రువులు గ్రమ్మనట్లానందింపని వారాంధ్రమండలి నుండరు.

### కళాపూర్ణోదయమునందలి మిగత కథ

కళాపూర్ణోదయములోని మీఁది వృత్తాంతముల సంగ్రహముగ విమర్శింతము. ఈ భాగమునఁ గల్పన లేదు, కథ లేదు. ఒక విషయమునకు నొక విషయముగా నిష్కారణమై నటించి పుస్తకముఁ బొడుగుఁజేయుట కవి యుద్దేశమేమో! ఆ సర్వలక్షణ సంపన్నుతా ప్రతిజ్ఞయొక్క దుష్ప్రకృతి యిటఁ దేటతెల్లంబు. రాణులిద్దఱకును జెలికత్తెల మాటలచేఁ బ్రేరితమైన కొట్లాట ఘటిల్లినది. నీచపాత్ర ములేగదా మన రాజులకు రాణులకు మంత్రులు: రాజు అభినవ కౌముది కాళ్ళు పట్టుకొనుచున్నాఁడు. ఆ కృష్ణమూర్తి యీ మర్యాదకు సృష్టికర్త! ఎన్నఁడో సత్యభామ కాళ్లు పట్టెనో లేదో, రాజు లందఱు నాయన యుపదేశములనెల్ల నిదియే సులభసాధ్యమని యెంచి యవలంబించి సనాతనాచారములోఁ జేర్చిరి.

పిమ్మట రాజుగారు సవతులు యలుక దీర్చుటకై పెద్దామెను గానవిద్యావిశారదం జేయుదుననియు, చిన్నయామెకు (ఆపె కాళ్ళ మీఁద బడినాఁడు. లేకున్న నీమెమాత్ర మూరకుండునేమి?) నీ

కాళ్ళకు అష్టదిగ్గ్రాణుల కిరీటముల యందలి మణులం దెచ్చి గజ్జెలో నగలో చేసిపెట్టెదననియు ప్రతిజ్ఞఁజేయఁగా అమ్మలిరువురు శాంతించి చల్లఁబడిరి. సవతుల కొట్లాటకై రాజు లేట్లాడుట మనలో ప్రాచీనధర్మమేమో! ఐరోపావారిని నిందించునపు డీ న్యాయమును జ్ఞప్తియందుంచుకొన్న నన్యాయము పలుకకుందుము. అలంకార శాస్త్రములలో నేమి చెప్పినాఁడు ? "నయవిరచన యాత్రాజి దూత్య నిభు వర్ణనము" అనియా ? సరియే. ఈభాగములో నేసంగతియైన వేసిన నొక్కటే. వేయకున్న నొక్కటే, కాబట్టి వేయుదము, అని నిర్హేతుకజాయమాన శుక్రనీతిని బ్రసంగించుచున్నాఁడు కవి ! సత్వదాత్ముండను మంత్రి యిన్నేండ్లు భూమి నేలిన ప్రభువునకు నుపదేశము చేయుట ముసలివాని కుపనయనము చేసినట్లు :

> "ఇవి యన్నియు నిపుడు ప్రసం
> గవశంబునఁ జెప్పఁబడియెఁ గాని."

యనుచున్నాఁడు, ప్రసంగవశమా ! శుద్ధాబద్ధము. అలంకారశాస్త్ర వశమునఁగాదా ? ఇంక సంధి యొకటి బాకీ యుండలేదా ? అది మగధరాజుతోఁ జేయుదము. ఈ మగధరాజు వృత్తాంతము నాకు దిగ్భ్రమ, గల్గించుచున్నది. మధురలాలసా వివాహసమయంబున,

> "అశ్వాలోచనముల కాత్మవస్త్రముకొంగు
> మాటుగా నొనరించె మగధరాజు"

కాన నితఁడు సామంతుఁడుగదా ? ఇంతలో,

> శా. ..................................................
> నీ రాష్ట్రంబున కెగ్గొనర్చుటకుఁ బార్ష్ణిగ్రాహుఁ డివ్వేళలన్
> సారోదారుఁడు మాగధుం డిపుడు తత్సంధానమర్హంబగున్.
> (కళా. ఆ. 7, ప. 270)

అని ప్రబలశత్రువైనట్లు మంత్రి చెప్పుట యెట్లు? మఱియు, స్వభావుఁడిచ్చిన విల్లునమ్ములునుండ మాగధునిమైత్రి యెందుకు, ఏటిలో వేయుటకా? ఈ దిగ్విజయముగూడ సందర్భశుద్ధిలేనిది. ఏలన? మదాశయుఁడు సకలరాజుల గెలుచునట్లు వరంబుగొన్నవాఁ డగుట నతఁ డట్లుచేసి సార్వభౌముఁడై యుండఁగా, నతనిని కళా పూర్ణుఁడు గెల్చెనన్న నీ యధిక ప్రసంగము లన్నియు నివారిత ములై యుండును. అవును. "ఆజి" యని సూత్రమున్నదే! ఇంత

సర్వలక్షణప్రాప్తికి దానిని మెడగట్టుకోవలదా? దూత్యము కొంత సూర్యాస్తమయ వర్ణనము. దీని యగత్యమేమో దేవునకే యెఱుక! అందులోని కుయుక్తులో!

తే. నింగి యనియెడి ప్రత్తిచేనికిని రక్త
బలియిడిరనంగ నెఱనంజ దొలుత నమరఁ
దఱుచుగాదాన విరసిన దొరుగుఁబత్తి
విళ్ళునాఁ జుక్కలెంతయు నుల్లసిల్లె!

(కళా. అ. 8, ప. 12)

ఆకాశము ప్రత్తిచేను! రక్తబలి యిచ్చినారఁట! చుక్కలు ప్రత్తి విళ్ళు! ఇట్లు వ్రాసిన మనవారి కేమో యానందము! కష్టతరముగనున్నఁ జాలును. మనోజ్ఞమని యెంతురు. ఆశ్చర్యమునకును నామోదమునకును మనవారిలో వ్యత్యాసమే లేదు! తరువాత జంద్రోదయము. ఇంకొక వికారాలంకారము!

"తే. కాలమను కువిందుఁడు చంద్రికాపటంబు
నేయఁబన్నిన మగ్గమొకో యనంగ
వనమయూఖాళి గొనసాఁగి మివులనొప్పె
విధుఁడమరె వాని గృహభిత్తి వివరమనఁగ"

(కళా. అ. 8, ప. 15)

భావప్రధానముగ వక్కాణించు మయూరుఁడే సూర్యుని కిరణము లాయన 'మీసాలు'గ నుపమించినాఁడు! ఇఁక, తక్కువ కవుల మాటలేల? అపురూపమే సురూపమని మనవారి భ్రాంతి. ఎంత క్లేశపడి సంపాదింతుమో యంతసుఖమని యెన్నిక! పాతాళమువఱకు ద్రవ్వి గులకఱాయిఁ దెచ్చిన నది బుద్ధిబలమా, లేమియా?

పిమ్మట సూర్యోదయ వర్ణనము. మఱికొన్ని దుష్టయోచనలు: సూర్యబింబము "గగనాఖ్య పనసవృక్ష ప్రకాండో పరిభ్రాజితంబగు పక్వఫల" మఁట? ప్రబంధముల శ్రాద్ధమునకై తేఁబడిన యెఱ్ఱ గుమ్మడికాయ యనరాదా! యోజనాశక్తికిం జేరిన చమత్కారమునకును భావముల నలరించు శక్తికిని ఎంత భేదము!

కళాపూర్ణుని దిగ్విజయము నేర్చినట్లే యున్నది. చతురంగములలో నొక్కొక్క యుద్ధమున కొక్కొక్క యంగము మాత్రము పూనినట్లు వ్రాసియున్నాడు. ఇది యా యంగసంగరముల వెవ్వేఱుగ వర్ణించుటకై చేసికొన్న దబ్బర మర్యాదగాని, జయకాంక్షఁబోవు

రాజులు వరించునది గాదు. గౌడేశ్వరునితోఁ జేయబడినది యశ్వ యుద్ధము. ఇందులో నింక నొక యసంభావ్యము గలదు. "పిరంగులు జబురు జంగులు దుపాకులు" మొదలగు నాధునికోపకరణములు వాడఁబడినవఁట! ఈ వికృతికిఁ గవి యెట్లోర్చెనో! పిమ్మట నింకొక రాజుతో గజయుద్ధము. ఈ రీతిని గటారులతోడి పోరుఁ మొదలగువానిని, భారతకాలమునుండి మొగలాయీల నాటివఱకుఁ బ్రఖ్యాతికి వచ్చిన పద్ధతుల నన్నిటిని ఏక కథలో నేక కాలమున నడచినట్లే వర్ణించియుంట కాలౌచిత్యమునకు మారణక్రియ? ఆంధ్రదేశీయులు కటారిసాధనలో బహు నిపుణులని యెన్నఁబడినట్లు ఈ దిక్కుమాలిన ఖండన క్రియవలనఁ దెలియవచ్చుచున్నది. ఇదివఱకుఁ గళాపూర్ణుఁడు పోరినది శస్త్రములతో. ఇఁక ముందైన స్వభావుఁ డిచ్చిన ధనుర్బాణముల నుపయోగింతుమని యేమో యన్నట్టుండి భీష్మపర్వములోని యుద్ధముంబోనిది యొండు పొందింపఁబడియున్నది. అస్త్రపరంపరలు నిగుడుచున్నవి. జయలక్ష్మి యే చాంచల్యమును లేక కథానాయకుని జేరియుండుట యామె తలవ్రాత, బ్రహ్మచే వ్రాయబడినది గాదు. మఱి యుత్తములు గాని కవులచే! కృతార్థుఁడై రాజు స్వపురికిం బోవుచున్నాఁడు.

## కాలౌచిత్యము

'కాలౌచిత్యము' అను పదమును వాడితిమి. కాన కవిత్వ తత్త్వమునకుం జేరిన యీ విషయము గొంత విచారింపక పోఁగాదు. కాలముచే మనుష్యుల గుణములు మారుచుండుట యనుభవ విదితము. ప్రబంధ విదితము గాదు. కథానాయకుఁడు సాధారణముగఁ గాలాతీతుఁడు! నిరామయ నిరంజనతలకుం జేరిన యవతార పురుషుఁడు; ప్రారంభమున నే వయసు, గుణములు, కోరికలు, చర్యలు నుండునో, యవసానమునను నవియే. పెరుగుట లేదు. పరిణామముం బొరయని లోహ విగ్రహముల యట్టి నిర్వికారుఁడు. స్త్రీల విషయమున నొకటి రెండు సంగతులకై వయః ప్రభావమున సూచింతురు. అవెవ్వియన సమర్తాడె ననుటకును, బిడ్డఁగనె ననుటకును! క్రొత్త పెండ్లికూతురైనను, ప్రాఁత పెండ్లమైనను, లేఁత పడుచైనను, ముదురు ముసలియైనను వారలలో భేద మంతగా నుండదు, పసిప్రాయమున నాయిక నాయకునికై యెట్లువ్విళ్ళూరుచుండునో, వయసుననను ఆరీతినే యాపె వంపును రాగంపు విలసనములు నుండును. అనఁగా పుస్తకములలో నను

మాట! ప్రకృతిని గాదనుట తెలిసియో తెలియకయో కట్టుకొన్న మగవారి కెల్లఁ దెలియును. పాశ్చాత్యులు మనుష్యజీవిత పరిశీలన సమర్థులగుటను, స్వయంవిమర్శమై వ్రాయువారు అగుటను, కాల సృష్టి పరిణామముల వర్ణించుటలో నద్భుత చరిత్రులు! కాలౌచిత్య మున నర్థములు రెండు. ప్రతిపాత్రమును గాలానుగుణ పరివర్త నములకుఁ బాత్రమైనట్లు వర్ణించుటయు, కథలోని వివిధ సందర్భ ములు కాలముతోఁ జెరికగలవిగా నుండునట్లు గల్పించుటయు ననునవి. ఇందు ప్రథమ భావముమీఁద వివరించితిమి. ద్వితీయా ర్థమునకు సూరనార్యునే నిదర్శనముగాఁగొని వ్యాఖ్యానం బొనర్తము. కళాపూర్ణోదయములోని సందర్భములకు కాలవిషయమునఁగల పరస్పరాసాంగత్యము పాటింపుఁడు! నారదుఁడు మణికంధరుఁడు శ్రీకృష్ణుని యాశ్రితులు. మణికంధరుఁడు కళాపూర్ణుఁడుగాఁబుట్టి దిగ్విజయముఁ జేయుసరికి ద్వారకాపుర సముద్రములో మునిఁగి పోయియుండెను. అనఁగా కళాపూర్ణుఁడు రాజ్యము చేసినది కలి ప్రారంభము ననుకొందము. ద్వాపరాంతమునన్నను బాధకము గాదు. అప్పుడు పిరంగులుఁ దుపాకులు నెక్కడివి? రెండవది రుక్మిణీ కాంతునికిఁ దరువాత నీ రాజువలె సద్గుణు లెవ్వరు లేరని కురుకాది దేశాధీశులు కానుకలు పెట్టినారఁట; పాండవుల మనుమ డైన పరీక్షిత్తు సార్వభౌముఁడాయెనని జగత్ ప్రసిద్ధమగు కథ యుండఁగా,నీ కళాపూర్ణుని వానితోఁ బోటీకిం బెట్టుట "కొండంగని తగరుదాఁకఁ గోరుటగాదే!" ప్రపంచ ఖ్యాతములగు కథలతో విరోధించినట్టి కల్పనలు అయోగ్యములు.

సుగ్రహుండు ఎన్నెన్నో తపస్సులుచేసి యవస్థలుపడి హారము పడసినవాఁడు. పిమ్మట నా హారము ఒక బ్రాహ్మణుని యింట నెన్నియో యేండ్లుండినది. తరువాత నాయెఁ గృష్ణార్పితము. ఆ వెనుకఁ గృష్ణునిచే మణికంధరునికి లభించినది. వాఁడు గానవిద్య, యాత్ర, తపస్సు — ఇత్యాదులలోఁ గడపిన వత్సరములు కనీసము ఆఱు. అట్లగుట మణికంధరునియొద్దఁ జేరినది మొదలు మధుర లాలస రెండవ తూరి ధరించువఱకు జరిగిన యేండ్లు సుమారు ఇరువదినాల్గు. ఇఁక సుగ్రహుని వయస్సెంత యుండునో యూహింప నలవిగాదు. అట్టి దీర్ఘాయుష్మంతుఁడగు సుగ్రహుఁడు సత్త్వదాత్ముం డను పేరంబరిగినవాఁడు. మధురలాలసకు మేనమామ! సుగ్రహు నింగూర్చిన యాభాసముల కింకను ముగింపుగానము. రూపానుభూతి యతని నెఱింగి యుండకపోవుట సిద్ధము! శాపంబుచే మతి

మాత్రము గోల్పోయి యాకారంబు మాఱని యతని నేకస్థలమున నుండియు నామె యేల గుర్తింపకపోయె? రాణివాస మందమా? కళాపూర్ణుని యభ్యంతర మందిరములోఁ బ్రవేశింపఁగల యతఁడు మదాశయుని యంతిపురమునఁ గాలిడ ననర్హుఁడై యుండునా? సదుత్తరములు చింత్యములు.

కళాపూర్ణుఁ డారీతిని వివిధయుద్ధంబులఁ దన కేకీడుచేయని రాజులను భార్యకై పూనిన వైరముచే నోర్చి జయశీలుఁడై పురము ప్రవేశింపఁగా, పౌరస్త్రీలు అతనిఁజూచుటకై వినోదకరములగు వేషములతో వచ్చుచున్నారు. నేఁ జెప్పనేల? సాధ్యమైనంతవఱకు మీరే కన్నుల విప్పి చూడుఁడు!

ఉ. క్షోణితలేంద్రుఁ జూడ నొక కొమ్మ వడింబఱతెంచి యుల్లస
ద్వేణిభరంబుతో మొగపు తీఁగె వలగ్నము నందమర్చి, యొ
డ్డాణము తీఁగెగానిడి, మెడన్ వలగొన్నది చాల కడ్డమై
పాణుల నుండఁగౌను మఱి బాగుగఁ గానుక వెట్టుకైవడిన్.
(కళా. అ. 8, ప. 139)

ఉ. గుబ్బెత యొర్తువచ్చె నృప కుంజరుఁ జూడ రతార్త నీవిఁ దా
గొబ్బునఁగట్టుచున్ బయఁట కొంగది మాన్పఁగఁ బోలెఁ గాళ్ళపైఁ
బ్రబ్బికొనన్ గుచోద్ధత భరంబునకుం బయికాఁపు వోలెఁ ద
బ్బిబ్బుగఁ జేతికిన్ దొరకి పెన్మిటి వస్త్ర మురోవృతంబుగన్. 140

ఏమిది? ఉన్నట్టుండి రాజు సగమురాత్రిలో వచ్చెనా?

తే. ఇత్తెఱంగునఁ బౌరులకెల్ల నేత్ర
పర్వమొనరించు రూప వైభవముతోడఁ
గ్రముక కంఠోత్తర మహాపుర ప్రవేశ
మాచరించి...................... 143

ఇదేమి యన్యాయము! పౌరుల కెల్ల నఁట! స్త్రీలకే గదా రాజులు ముఖ్యముగ దర్శనమిచ్చుట? ఇట్టి యపచారములును శృంగారములా?

మధురలాలస పెండ్లియైనప్పుడే యంతవిరాళిఁదాల్చిన యగ్గి తునుకగావున నామె వయసు 15-16 అనుకొందము. పెండ్లియైన యేఁడునకే దిగ్విజయమని యాలోచించినను ద్వారక ములిఁగి చాల కాలమైయుండదు. కళాపూర్ణుఁడు సింహాసనమెక్కిన తరువాత మునిఁగెనా, తత్పూర్వమే మునిఁగెనా? పూర్వమైయుండిన నిరువ

దేండ్ల క్రిందట మునిఁగిన యూరింగూర్చి కళాపూర్ణుఁడు విచారణ లకు మొదలిడుట యధికాలస్య ప్రసంగము. తరువాతగా నుండిన, నెల్లిరాజులను జయించిన వాఁడుగదా, శ్రీకృష్ణ బలరాములను భీమార్జునులను మార్కొ నెనా ? మఱి, తనకుం గురువును దైవము నని కృష్ణుని సేవించివచ్చెనా ? అదియట్లుండె. అభినవ కౌముది యొక్క వయసు మొదలైనవి యరయుదుము. కలభాషిణి మణికంథరునిచేఁ జచ్చి పునర్జీవితయైద్వారకను మెలంగినది రెండేండ్లు. ఆవఱకే యభినవకౌముది ప్రాయముది. శల్యా సురుఁడు వెన్నాడి కొన్నేండ్లు తిరిగియుండును గాన, 17 సంవత్స రములన్నఁ దక్కువలెక్క. ఈమెకుఁ దగిన నాథుఁడుగా నుండ వలయునని కళాపూర్ణునకు సద్యోయౌవనము విధింపఁబడియె, కళాపూర్ణుఁడు పుట్టునప్పటికి నాపె వయసు 18 యనుకొనుఁడు. మధురలాలసా వివాహ మప్పటికి నామెకు అధమపక్షము 34-35 సంవత్సరములు నిండియుండును. ఎట్లు లేదన్నను ముప్పదికిఁ దక్కువయుండదు. ఇన్నాళ్ళు సంసారముచేసిన యాపెకును, క్రొత్త పెండ్లికూఁతునకును రూప యౌవన వర్తన విభ్రమాదుల నేతారతమ్యమైన నుండునట్లు కవి వర్ణించినాఁడా విచారింపుఁడు ! నాకుంజూడలేదు. 15, 16 ఏండ్లు గొడ్రాలుగా నుండిన యామె తటుక్కని మధురలాలసకన్నఁ గొంచెము ముందుగఁ బుత్రునిఁ గనెనఁట! ఇప్పటివారిలో నిట్లు తటస్థించిన నెన్ని సందేహములు పుట్టవు! మధురలాలసకు బిడ్డ నీదలఁచి, పట్టపు దేవిని విడుచుట బాగుగాదనియు, నీ క్రియల నించుమించు వారు సరిపోలిన జతగా నేర్పడినట్లు ప్రదర్శింపవలయుననియు నెంచి చేయఁబడిన జ్యేష్ఠాంశ హేయకల్పన లివి !

## విషయమున ననౌచిత్యములు

సుగ్రహుని వయసు కృతయుగము లెక్కలోఁ జేర్పవలసి నదే. మన వారిలో మాటలు వేదమయములు. చేఁతలు బూతులు. వేదాంతములకును మానహీనములగు ననుష్ఠానములకును అన వరతానవసితమైత్రి. పరమయోగీశ్వరుఁడైన శివుఁడు “దేహార్ధమునఁ దాల్చు దీఁగెబోఁడి!” అక్కథకుండగు వ్యాసశిష్యుఁడు సూతమహా మునీంద్రుఁడు, ఉపవాస వ్రతములచే డస్సి యెండిన శౌనకాది మహర్షుల హృదయముల రసము లూరునట్లుగా, స్త్రీలవర్ణనలు పోగుపోగుగా విడఁదీసినట్లు చెప్పుచున్నాఁడనుట ప్రబంధములలో

ప్రసిద్ధి. విరాగియైన వనవాసికి రాజకన్యలలయు బోగముసానులయు రహస్యవృత్తము లెట్లు తెలిసె? కష్టపడి యార్జించిన దూరదృష్టి దూరశ్రవణాదులకు ఫలముగా నీ సుఖముల ననుభవింపకపోయి నను, విమర్శనముతో సావకాశముగఁ బరీక్షించి తెలిసికొను నానంద మైన ననుభవించినాఁడుపో! పచ్చిపచ్చి మాటలతో పెద్దమనుష్యుల యెదుట సిగ్గులేక విపుల వ్యాఖ్యానములకుం దొడంగ నాతని పరమ పవిత్రమైన నోరెట్లాడెను? పరమపావనులగు మునులు ఏ జుగుప్సయు లేక గ్రుక్కిళ్ళు మ్రింగుచు నెట్లు వినిరి! ఇట్టి రుచికరములగు కథలు చెప్పువాఁడు కావుననేగదా ఋషీశ్వరు లట్లు జపతపముల వదలి యతనిచుట్టు బెల్లమును ముట్టడించెడు చీమలవలె మూగియుండుట! సూతమహాముని కీ కళాపూర్ణోద యము నారోపింపకుండుట సూరనార్యుని ఘనతకుఁ దావలము. అయిన నింకొక విధమైన యనుచితముఁ జేసియున్నాఁడు. ఇంత దనుక చవులూరెడు కామక్రీడలు వర్ణించి రతివర్ణనకు నాహుతిగా నీయఁబడిన పద్యములు సుమారు 25 తటుక్కన వైష్ణవరాద్ధాంత ముతో భక్తిరసముఁ గొంతదింపి గ్రంథసమాప్తి యొనర్తమని, లక్ష్మీ నారాయణసంవాదమనెడు గతిమోక్షమును లేని ఘట్ట మొకటి తెచ్చి వేసికొనినాఁడు. కృతిపతికిఁ గామమోక్షములు రెండును గాంక్షి తములేమో! ఈ లోకమునకొకటి. ఆ లోకమునకొకటి! కానఁ దప్పేమియులేదుగాని, కావ్యముల నీరీతి నిహపరముల పరముగా బిగువుతో నీడ్చిన వానిక్యైక్యము తునుగును. అట్లగుట నియ్యవి సౌభాగ్యవిరుద్ధములు. కలయిక లేని రసములఁ గలుపఁ జూచిన నరుచి. పాలలో చక్కెరవేసిన నిర్దోషము. ఉప్పువేసినచో!

హిందూదేశీయులు మనసు మెత్తనివారు. కాయములంత కంటె మెత్తన! సత్త్వగుణమను సాకుపెట్టుకొని యెన్ని దెబ్బలు పడినను "నావిగావివి పరమాత్మకుం జేరినయవి" యని యపహాస్య మునకుం బాత్రములగు వింతకారణముల గొణిగికొనుచు, వంచిన తలయెత్తక, వణఁకెడు నొడలునాపక, పాఱెడు కాలునిలుపక, పోవుచుందురు! రాజసగుణమగు తేజము ప్రధానమని మనకుం దెల్పుటకోయన, సూరన్న యా దౌర్భాగ్యపునయవిరచనలో రచించిన యీ మూడు పద్యముల ప్రతాపముఁ గనుండు.

క. సకలకళా నిపుణులు సే
వకులై కొలువఁగఁ బ్రతాపవంతుఁడు గొలిపిం

చుకొనున్ గావునఁ బోలవు
సకలకళలు నొక ప్రతాపసంపదతోడన్.

చ. ఇనుఁడొకచో నొకింత యుదయించిన మాత్రన విచ్చిపోవు హె
చ్చిన పెనుఁజీఁకటుల్ నిరవశేషముగా నవియట్లు నిచ్చిపో
వనయము శీతధాముని కళౌపమ్యజావిధినైన వీనిచే
తన కనరాదె యేరికిఁ బ్రతాప కళాగుణతారతమ్యముల్
(కళా. అ. 7, ప. 245–246)

చ. ఒకఁడొకకేలవంచె నధికోన్నతిఁ బేర్చిన మేరుశైల నా
యకుఁ బెఱవేల్పులందఱుఁ జిరాశ్రయణంబున వంపలే రొకిం
చుకయును బుద్ధిలో నరసిచూడ జగంబున నుగ్రుఁడన్ ప్రసి
ద్ధికి బుధుఁడన్ బ్రసిద్ధికని దెల్లముగా నివిసూ ఫలస్థితుల్.
(కళా. అ. 7, ప. 247)

ఎఱుక ప్రధానమే. దానికన్న వేయింతలు ప్రధానము పరాక్రమము! ఉపన్యాసములుగావు వృద్ధికిఁ గారణములు. మఱి కార్యసాహసమును, దీక్షయు.

## ఉపసంహారము

భావనాశక్తిచే ననర్గళముగ ప్రభవిల్లు భాగములయొక్క చక్కఁదనము పాండిత్యబలంబుమై నేర్పడినవానికి రావనుట యీ విమర్శనముచే విదితంబు. సూరనార్యుఁడు రెంటియందును ప్రగల్భుఁడు. రెంటినిం జూపింప నిశ్చయించినవాఁడగుట నాంధ్రంబున నసదృశంబగు కావ్యంబు కళాపూర్ణోదయంబు సృజింపఁబడియె. ఇది నిర్దోషంబుగాక పోయినను అనన్యసాధారణగుణగణవిభాసితంబగుటఁ గావ్యోత్తమంబనఁ జెల్లునది. ఇందు నవరసము లున్నవి. అష్టాదశ వర్ణనములున్నవి. ఏకరసంబుగాకునికి మేల. అయినను సర్వరసముల వర్ణనలఁ జేర్చి యొక కథ వ్రాయఁ జూచుట యసాధ్యము గాకపోయినను, సామాన్య సాధ్యంబుగాదు. భారత రామాయణము లట్టి విస్తారేతిహాసముల దప్ప నన్యంబుల సకల సాభాగ్యములకు నాస్పదంబుండదు. అపారపారావారంబుం బోని మహాచరిత్రముం గల్పించినంగాని, రససంచయంబు లెల్ల నందు యుక్తగతిని నిలువఁజాలవు. అట్లగుట నీ గ్రంథమున నసంగత ప్రశంసల వేయవలసెను. ఆ పరభాగము ప్రబంధములకుఁ జేరినది పరిమితప్రాశస్త్యము. పూర్వభాగము అమేయ

ప్రభావము. దానిం గూర్చి యెంత నుతించినను అత్యుక్తి గలుగదు. అందలి కల్పనలు, సందర్భములు మహేంద్రజాలము లట్లు ఆశ్చర్యకరములు. శైలి ప్రావీణ్య మన్ననో వాచాతీతము. మౌనముగఁ గ్రోలి హృదయము పరవశముగా నానందింపవలయును కాని, మాటలఁదమి యాఱదు. పాత్రముల వచనములు మధుర సుధాధారలు.

అట్లగుట శ్రీ పింగళి సూరనార్యునియెడఁ గృతజ్ఞతయు భక్తియుఁ జూప నెంచినవారును, సహజముగఁ దమకుం గల రసతృష్ణను దృప్తినొందింపఁ దలంచువారును నైన రసికు లెల్లరు నీ కవికులోత్తంసుని కృతులఁ బలుమాఱు పఠించి కృతార్థు లగుదురు గాక!